# "సదా" స్మరామి

## డాక్టర్ కాసరనేని సదాశివరావు నమో నమామి

100

1923-2023

## శతజయంతి ఆత్మీక సంచిక





ప్రచురణ :
శతజయంతి ఉత్సవ కమిటీ
గుంటూరు

# "సదా" స్మరామి
# డాక్టర్ కాసరనేని సదాశివరావు నమో నమామి
# శత జయంతి ఆత్మీక సంచిక

డా. రమాబాల
డా. సురేష్





డా. ఉమాబాల
డా. సుబ్బారావు





డా. ఉషాబాల
డా. పి.వి. రావు



డా. రమేష్
డా. వల్లీరాణి

డా. కాసరనేని సదాశివరావు
డా. జయప్రదాంబ



డా. సురేష్
డా. యమున

## వృద్ధాప్యంలో డాక్టరు గారి సంరక్షకులు



అత్తోట సూరమ్మ
(చెల్లెలు)



జయశంకర్
(తమ్ముని కొడుకు)

# “సదా” స్మరామి

డాక్టర్ కాసరనేని సదాశివరావు శతజయంతి ఆత్మీక సంచిక

తేది: 13–10–2023

**సంకలనం:**
డాక్టర్ పాతూరి రాధిక, ప్రిన్సిపాల్,
విజ్ఞాన్ నిరులా మహిళా ఇంజనీరింగ్ కాలేజి, గుంటూరు

**పర్యవేక్షణ:**
పాతూరి కోటేశ్వరరావు
విశ్రాంత అధ్యాపకులు, 2 సి కళాశాల

**సహకారం:**
డాక్టర్ కందిమళ్ళ సాంబశివరావు
డాక్టర్ చిట్టినేని కోటేశ్వరరావు

**ముఖం చిత్రం:**
విజ్ఞాన్ రాజేష్, బండ్ల మాధవరావు

**ఫోటోల కూర్పు:**
విజ్ఞాన్ రాజేష్

**కంప్యూటర్ ఆపరేటర్స్:**
గేరా రాణి, ఎమ్.ఎ., బి.ఎడ్.,
గుండిమెద వెంకట సుబ్బారావు
చేజర్ల కిషోర్ కుమార్

# మదిలోని మాట

"సదా" స్మరామి సంచిక తీసుకు రావడం లోని ప్రధాన ఉద్దేశ్యం, డాక్టర్ కాసరనేని సదాశివరావు గారిని ఈ తరం వారికి పరిచయం చెయ్యడమే ఒక కుగ్రామంలో జన్మించి, చిన్నతనంలో కష్టాలు ఎదుర్కొని ఎదిగిన తీరు, సాధించిన విజయాలు, వృత్తిలోని ప్రజ్ఞ, పాటవాలు, యువతకు స్ఫూర్తిదాయకాలు వైద్య వృత్తికే పరిమితం గాకుండా, విద్యాసంస్థల నిర్వహణలో తను చూపిన పరిపాలనా దక్షత, సాహిత్యంపై అభిలాషతో సాహితీ సదస్సు స్థాపన, అవసరమై రాజకీయ రంగ ప్రవేశం ఒక వృత్తినే నిర్వహించలేక సతమతమవుతున్న నేటి. తరానికి, డాక్టరు గారి బహుముఖ ప్రజ్ఞ ఒక వేగుచుక్క అవ్వాలనేది "సదా" స్మరామి సంకల్పం. డాక్టరు గారితో పరిచయమున్న అందరికి అరవై రోజుల ముందుగా వ్యాసాలు వ్రాయమని విజ్ఞప్తి చేశాము. కానీ స్పందన ఊహించినంతగా రాలేదు సంఖ్యాపరంగా లోటు లేదుగానీ, గుతాత్మకంగా కొంత కొరత కన్పిస్తుంది. బహుశా "మరణించిన వారిని మరచిపో" అనే లోకజ్ఞాన సూక్తిని పాటించి వుంటారనుకుంటున్నాను.

స్పందించిన వారు, డాక్టరు గారు వైద్యం ప్రారంభించక ముందే గ్రామీణులకు, పేదవారికి, తక్కువ ఫీజుతో వైద్యం చేయాలనే సంకల్పాన్ని గురించి, విద్యార్థుల వద్ద అసలు ఫీజు తీసుకోకూడదనే నిర్ణయాన్ని గురించి, వైద్యం పేద, ధనిక తేడా లేకుండా, రోగ తీవ్రతే ప్రధానంగా పాటించడం గురించి గొప్పగా స్పందించారు. మరికొందరు, రోగుల పట్ల, వారి సహాయకుల పట్ల డాక్టరు గారి ఆత్మీయ పలకరింపుల గురించి ఆనందాన్ని తెలియపరిచారు. విద్యావంతులు, డాక్టరు గారి దక్షతను గురించి, వారు నిర్వహించిన విద్యాసంస్థల పేరు ప్రఖ్యాతలను గురించి, గొప్పగా బవరించారు. రాష్ట్రం లోని ప్రముఖ సాహితీవేత్తలను, గుంటూరు. రప్పించి సాహిత్యంపై జిజ్ఞాసను రగిలించడం గురించి రాశారు. దేశవిదేశాల్లో వున్న డాక్టర్లు, డాక్టరు గారు ఆనరరీ ప్రొఫెసర్ గా భోదించిన తీరును, నేర్పిన మెళకువలను, ఎప్రెంటీస్ లుగా డాక్టరు గారు, వారి పై చూపించిన ప్రేమ, ఆప్యాయతలను గురించి వ్రాసారు.

"సదా" స్మరామి చదవండి, డాక్టరు గారిని గురించి వివరాలు తెలుసుకోండి.

**"సదా" స్మరామి**

# అభినందనలు

ఎనభై రెండేళ్ల వయస్సు లో పర్యవేక్షకునిగా, నా పనిని సులభతరం చేసిన:

1. సంచికకు "సదా స్మరామి అని నామకరణం చేసిన శిష్యుడు డాక్టర్ కందిమళ్ల సాంబశివరావుకు

2 వ్యాసాల సంకలనం ప్రతిష్టగా తీసుకొని శ్రమ పడిన విజ్ఞాన్ నిరులా ప్రిన్సిపాల్ అయ్యి మా అమ్మాయి డాక్టర్ పాతూరి రాధికకు

3 సంచిక కవరు డిజైన్ చేసిన 'విజ్ఞాన్ రాజేష్, చేయించిన మరో శిష్యుడు శిఖర స్కూల్ డైరెక్టర్ డాక్టర్ బండ్ల మాధవరావుకు

4. కంప్యూటర్ ఆపరేటర్స్‌గా విధులు నిర్వహించిన రాణి, సుబ్బారావు, కిషోర్‌లకు

5 తన క్రియాశీల ఆలోచన తో అద్భుతంగా ఫోటో పేజీలు సెట్ చేసిన మా రాజేష్‌కు 6. సకాలంలో "సదా స్మరామి" ని అందంగా ముద్రించి యిచ్చిన శ్రీ కాట్రగడ్డ శ్యాంబాబు

గారికి వారి సిబ్బందికి హృదయ పూర్వక అభినందనలు నాపై అభిమానంతో, అమెరికా నుండి "సదా" స్మరామి సంచికకు తోడ్పడిన నా పరిమళ పారిజాతం ఎడిటర్ డాక్టర్ చిట్టినేని కోటేశ్వరరావుకు ప్రత్యేక కృతజ్ఞతలు.

**పాతూరి కోటేశ్వరరావు,**

**"సదా" స్మరామి పర్యవేక్షకుడు**

# వ్యాసాల సరళి



# "మార్గదర్శి" డాక్టర్ కాసరనేని

డాక్టర్ మద్దినేని గోపాలకృష్ణ M.S.
ప్రముఖ సర్జన్

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారి **శత** సంవత్సర వేడుకలు జరుపుకొనుట మనందరికి, మన సమాజానికి ఎంతో సంతోషమైన విషయము డాక్టర్ గారు గుంటూరు పక్కన ఉన్న 'తక్కెళ్ళపాడు' గ్రామంలో 1923 సంవత్సరము అక్టోబర్ నెల 13వ తేదీ జన్మించారు. తల్లిగారు సౌభాగ్యమ్మ తండ్రి గారు రామశాస్త్రి గుంటూరు హిందూ కాలేజీలో ఇంటర్మీడియట్ పూర్తి చేసే విశాఖపట్నం ఆంధ్ర మెడికల్ కాలేజీలో M.B.B.S; M.S (జనరల్ సర్జరీ)లో బంగారు పతకంతో ఉత్తీర్ణులయ్యారు. డాక్టర్ జయప్రదాంబగారితో 1949వ సంవత్సరము వివాహం జరిగినది. వారిది ఆదర్శ వివాహము. దండలు మార్చుకునే పెళ్లి, గుంటూరు సాంబశివపేట 1వ లైన్ లో సరస్వతి సినిమా హాలు వెనుక లైనులో శ్రీ కోడె గోపాలకృష్ణయ్య గారి ఇంట్లో దండలు మార్చుకున్నారు. 1951 సంవత్సరం సాంబశివపేట మూడో లైన్ లో ప్రజా వైద్యశాల "పీపుల్స్ నర్సింగ్ హెూమ్" పేరుతో హాస్పటల్ ప్రారంభించారు. వారి సర్జరీ ప్రొఫెసర్ రమణమూర్తి గారు రిబ్బన్ కట్ చేసి ఆరంభించారు. భార్యాభర్తలు మొదటిసారి మన గుంటూరులో హాస్పటల్ నడపటం వలన రోగులకు అన్ని వయస్సు వాళ్లకు కాన్పులు ఆపరేషన్లు తక్కువ ఫీజులతో, ఎక్కువ శ్రద్ధతో రాత్రనకా, పగలనకా అర్జెంటు కేసులకు అందుబాటులో ఉండేవారు. అప్పుడే యాంటీబయోటిక్స్ అందుబాటులోకి వచ్చాయి. జబ్బులు త్వరగా నయమై రోగులు కోలుకునేవారు. వైద్య రంగంలో ప్రజలకు అందుబాటులో ఉండి సమాజానికి సేవ చేస్తూ, మంచి పేరు తెచ్చుకున్నారు. గుంటూరు ప్రజలు, పరిసర ప్రాంతాల ప్రజలు, గుంటూరు జిల్లా, కృష్ణాజిల్లా, ప్రకాశం, రాయలసీమ జిల్లాల నుంచి వైద్యం కోసం డాక్టర్ గారి దగ్గరకు వచ్చేవారు. మెడికల్ అడ్వాన్స్ తో వైద్య పరీక్షలు సరైన మందులు, కొత్త మెడికల్ ఎక్విప్మెంట్స్, అల్ట్రాసౌండ్, సిటి స్కాన్, ఎంఆర్ఐ, యాంజియోగ్రామ్ కి,

ఇంటెన్సీ కేర్ యూనిట్స్ క్యాన్సర్ ట్రీట్మెంట్ అందుబాటులోకి రావడం ప్రజలకు ఎంతో ఉపయోగం జరిగినది నేను హౌస్ సర్జన్ %+% చేసేటప్పుడు డాక్టరు కొండబోలు బసవపునయ్య గారు డాక్టర్ గారి హాస్పటల్ కేసులు చూస్తూ ఆపరేషన్లు అసిస్ట్ చేస్తూ వైద్య విధానం నేర్చుకున్నాము. వారి పరిచయము, స్ఫూర్తితో మేము కూడా గుంటూరులో ప్రాక్టీస్ పెట్టినాము. 1961 సంవత్సరము కొత్తపేట ఓల్డ్ క్లబ్ రోడ్డులో డాక్టర్ ద్వారకాబాయి హాస్పిటల్ కొని, అభివృద్ధి చేసి, అన్ని వసతులు కల్పించారు. 1962వ సంవత్సరం గుంటూరు జనరల్ హాస్పిటల్ లో హానోరోరి సర్జన్ గా చేరి, 1974 వరకు 12 సంవత్సరాలు సేవలందించారు. యువ డాక్టర్లు చాలామంది వారి దగ్గర పని చేసి వైద్య విధానం నేర్చుకుని, వివిధ ప్రాంతాలలో ప్రాక్టీస్ పెట్టి ప్రజలకు వైద్యం చేసేవారు. డాక్టర్ గారు వారి హాస్పిటల్స్ ప్రారంభించి, వారు వృద్ధిలోకి రావడానికి సహాయపడే వారు కొన్ని వందల హాస్పిటల్స్ ప్రారంభించి ఎక్కువ మంది ప్రజలకు వైద్యం అందుబాటులోనికి తెచ్చారు.

డాక్టర్ గారి హస్తవాసి అమృత హస్తంతో ప్రారంభిస్తే తొందరగా వృద్ధి చెందుతామని వారి నమ్మకము. చివరి రోజుల్లో వీల్ చైర్ మీద కూర్చొని కొన్ని హాస్పిటల్స్ ప్రారంభించారు. డాక్టర్ గణేష్ ని రాజేష్ కంటి ఆసుపత్రి సుదర్శని డాక్టర్ మొర్ర రాజేష్ చిన్న పిల్లల సర్జికల్ హాస్పిటల్స్ ఇలా ప్రారంభించినవే. చాలా బాగా వైద్య సేవలు అందిస్తున్నారు. వారి దగ్గర పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేసిన డాక్టర్ ప్రసాదరావు ఆస్ట్రేలియా వెళ్లి కార్డియో తెరపిక్ సర్జరీలో ట్రైనింగ్ పొంది, హైదరాబాద్ N.I.M.S హాస్పిటల్ లో పనిచేసారు. ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా నుంచి పద్మశ్రీ బిరుదు పొందారు. విద్యావేత్త డాక్టర్ సదాశివరావు గారు పల్లెటూరు పిల్లలకు విద్య ఎంతో ముఖ్యమని గ్రహించి విద్యావేత్తగా S.P. S హై స్కూల్ నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటీ 1967లో రిజిస్టర్ చేయించి, 1968 లో JKC College Professional Colleges, RVR Engineering College, RVR B.Ed college, Law College, Pharmacy College, Nursing College ఉచ్ఛ స్థితిలో ఉన్నవి. ఎందరో విద్యార్థులు కష్టపడి చదివి దేశ విదేశాల్లో ఉద్యోగాలు చేస్తున్నారు. ఇతర దేశాలకు migrate అయ్యి మంచి పేరు తెస్తున్నారు. డాక్టర్ జయ ప్రదాంబ మరణం తర్వాత, 1996 Dr Kasaraneni Jaya Pradamba Degree College. B.Sc, Maths, Computer Courses తో నడుచుచున్నవి హాస్టల్ వసతి కూడా కలదు.

సాహితీ సదస్సు పేరుతో యువ రచయితలకు కళాకారులకు ప్రతినెల సభలను ఏర్పాటు చేసి ప్రముఖ రచయితల తో ప్రసంగాలు ఏర్పాటు చేసినారు సాంస్కృతి రంగంలో మంచి ప్రోత్సాహం ఇచ్చారు. ప్రజాస్వామ్య దేశం లలో రాజకీయంగా సమాజం నడవాలంటే మంచి తెలివైన వ్యక్తులు రాజకీయలలో చేరి వారి సేవలు దేశానికి అందించాలని వారి అభిప్రాయం. **M.L.A** గా పెదకూరపాడు నియోజక వర్గంలో 5 సంవత్సరాలు గ్రామంలో పార్టీలతో సంబంధం లేకుండా అభివృద్ధికి కృషి చేశారు. డాక్టర్ సదాశివరావు గారు జీవితంలో ఎంతో కష్టపడి ఉన్నత ఆశయాలతో మన అందరిని ప్రేరేపించి ఉన్నత వ్యక్తిగా మనందరికీ మార్గదర్శి (రోల్ మోడల్) గా సమాజాభివృద్ధికి కృషిచేసి, వైద్యరంగంలో

గొప్ప డాక్టర్ గా, విద్యారంగంలో గొప్ప విద్యావేత్తగా, సాహిత్య రంగంలో సాహితీ వేత్తగా, రాజకీయ రంగంలో రాజకీయ నాయకుడిగా, మన అందరిని ఉత్తేజపరిచినారు. మన గుంటూరు బృందావన్ గార్డెన్స్, శ్రీ వెంకటేశ్వర దేవాలయము అన్నమయ్య కళావేదిక మీద స్వధర్మ సేవా సంస్థ 2010వ సంవత్సరములో మూడవ ధర్మజ్యోతి పురస్కారం అందజేసి గౌరవించటం మనందరికీ సంతోషదాయకము. డాక్టర్ కాసరనేని సదాశివరావు గారి శత సంవత్సర వేడుకలు జరుపుతూ వారికి మనమిచ్చే ట్రిబ్యూట్ వారి ఆశయాలను పాటించుతూ సమాజాన్ని అభివృద్ధి చేయటమే ఈ అభివృద్ధి. . GOD BLESS YOU ALL.

అన్నదానము గొప్పదనవచ్చునేకాని
అన్నంబు జాములో సరిగిపోవు
వస్త్రదానము గూడ భవ్యదానమె కాని
వస్త్ర మేడాదిలో పాతదగును
గృహదానమొకటి యుత్కృష్టదానమే కాని
కొంప కొన్నేండ్లలో కూలిపోవు
భూమి దానము మహాపుణ్యదానమే కాని
భూమియన్యుల జేరిపోవవచ్చు
అరిగిపోక, ఇంచుకయేని చిరిగిపోక
కూలిపోవక యన్యుల పాలుగాక
నిత్యమయి, వినిర్మలమయి, నిశ్చలమయి
యొప్పుచుందు విద్యాదానమొకటి జగతి

– **చిలకమర్తి లక్ష్మీనరసింహం**



## పూర్ణ పురుషులు డాక్టర్ సదాశివరావు గారు

ఆచార్య యార్లగడ్డ లక్ష్మిప్రసాద్

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు నాకు 1972 నుంచి తెలుసు. నేను డాక్టర్ గారికి 1977 నుండి తెలుసు ప్రథమ పరిచయం నుండి డాక్టర్ గారు నన్ను ఎంతో ఆప్యాయంగా చూసేవారు. డాక్టర్ గారితో ఇతరులెవరికి లేని అనుభవాలు నాకున్నాయి. అది డాక్టర్ గారి 1985

జూలైలో అమెరికా ఇంగ్లాండ్ దేశాల పర్యటన డాక్టర్ గారితో పాటు వారి పెద్ద బావమరిది వర్మ గారు, నేను 8 వారాలు ఆ రెండు దేశాల్లో తిరిగాము. డాక్టర్ గారి పరిపూర్ణమైన వ్యక్తిత్వాన్ని చాలా దగ్గరగా చూసే అవకాశం, అదృష్టం నాకు కలిగాయి. డాక్టర్ గారు ఎంత గంభీరంగా ఉంటారో, అంత సౌమ్యం గాను, సరదాగా ను ఉండేవారు. వారితో నాకున్న 40 సంవత్సరాల సుదీర్ఘ, సన్నిహిత పరిచయములో ఆయన కోపంగా గానీ, విచారంగా గానీ చిరాకుగానీ ఉన్న సందర్భం ఒక్కటి కూడా చూడలేదు.

ఆయనకు అమెరికాలోని మిన్నేసోటా రాష్ట్రంలో రాచెష్టర్ నగరములోని మయోక్లినిక్‌ను చూడటం తన జీవితంలోని చిరకాల వాంఛయని చెప్పారు. గుంటూరులో డాక్టర్ గారి విద్యార్థి అయినా కంఠంనేని సత్యనారాయణ గారు (ఆయనను బ్యాక్ సత్యనారాయణ అని కూడా అంటారు) డాక్టర్ గారిని, నన్ను, తన నాలుగు సీట్లు ఉన్న సొంత విమానంలో సెయింట్ లూయిస్ నుండి తాను ఉంటున్న కియోకక్ కు, మరుసటి రోజు రాచెస్టర్ లోని మయో క్లినిక్ తీసుకువెళ్లారు. ఆ క్లినిక్ లో మయో సోదరుల కృషిని డాక్టర్ గారు అణువణువు తిలకించి పులకించిపోవడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ మయో క్లినిక్ లో దాని అనుబంధ సంస్థలలో మొత్తం 14300 మంది పని చేస్తున్నారని అక్కడి డాక్టర్ నాకు చెప్పారు.

మొత్తం మీద డాక్టర్ గారి పుణ్యమా అని అప్పటికి 25 సంవత్సరాలుగా అమెరికా, ఇంగ్లాండ్ లలో నివసిస్తున్న మన తెలుగువారు కూడా చూడనటువంటి ఆ దేశంలోని అన్ని ప్రముఖ నగరాలను సందర్శించే మహత్తర అవకాశం నాకు కలిగింది. ప్రతిచోటా డాక్టర్ గారి పూర్వ విద్యార్థులు, అభిమానులు ఆయన పట్ల చూపించిన ఆదరణ, అభిమానం, ప్రేమ నాకు ఆశ్చర్యం కలిగించాయి.

ప్రతి చోట వాళు ఏ ఇళ్లల్లోనే మకాం. నేను కొంచెం సంకోచంగా వుండేవాణ్ణి. ఆయన వారందరికీ నన్ను గురించి ఏమి చెప్పారో తెలియదు కానీ విజయవాడ లయోలా కళాశాలలో లెక్చరర్ గా పనిచేస్తున్న నన్ను వారందరూ ఎంతో ఆప్యాయంగా, గౌరవంగా చూశారు. ఆ పర్యటనలోనే మేము మొట్టమొదట లాస్ ఏంజిల్స్ దగ్గర ఉన్న డాక్టర్ గారి చిన్న బావమరిది వర్మ గారి అమ్మాయి అరుణ నరసింహారావు దంపతులు, ఇంగ్లాండ్ లో ఉన్న డాక్టర్ గారి పెద్దమ్మాయి రమాబాల–సురేష్, రెండవ అమ్మాయి ఉషాబాల–సుబ్బారావు, పెద్దబ్బాయి–రమేష్–వల్లి వాళ్లతో ఉన్నాము. ఇది ప్రత్యేకంగా ఎందుకు చెప్తున్నానంటే డాక్టర్ గారి మొదటిసారిగా విదేశీయాత్రకు, తొలిసారిగా తమ పిల్లలు, బంధువులు, శిష్యుల ఇళ్లకు వెళ్ళడం, ఆ సందర్భంగా ఆయన మనసులో కలిగే భావశబలత, రకరకాల అనుభూతులు, నాకు గమనించే అద్భుతమైన అవకాశం కలిగింది. డాక్టర్ గారి ఆ కుటుంబ సభ్యులు నన్ను వారి కుటుంబంలో ఒకడిగా ఆదరించటం వారి సంస్కారం, నా అదృష్టం అనుకుంటాను. నేను డాక్టర్ గారితో పాటు ఆ పర్యటనలో చివరి అంకముగా ఉమాబాల గారింటిలో ఉన్నప్పుడు, నా చిరకాల కోరికగా ఉన్న ఆంధ్ర విశ్వవిద్యాలయం విశాఖపట్నంలో నన్ను లెక్చరర్ గా నియమించారన్న వార్త రావటం అందులో డాక్టర్ గారి ప్రమేయం ఏమీ లేకున్నా ఆయన వంటి సహృదయ సజ్జనుల సహచర్య ఫలితమేనని నేను అనుకుంటూ ఉంటాను.

డాక్టర్ గారి గురించి నేను రాయడం మా ఇద్దరం అనుబంధం వివరించడం ఒక పెద్ద గ్రంథం అవుతుంది ముఖ్యమైన విషయాలు మాత్రం ప్రస్తావించి ముగిస్తాను.

డాక్టర్ గారు శాసనసభ సభ్యులుగా న్యూ ఎం.ఎల్.ఏ క్వార్టర్స్ లో ఉండేవారు వరండా, ఒక గది, బాత్రూం మాత్రమే ఉండేవి. డాక్టర్ గారు ఆ గదిలో ఇనప మంచం మీద పడుకునే వారు. ప్రక్కన ఒక టేబుల్ కుర్చీ మాత్రం ఉండేవి. గుంటూరులో డాక్టర్ గారి ఇంటిలో మేడ మీద డాక్టర్ గారి బెడ్ రూమ్, బాత్రూంలు కలిసి ఉన్న దానికంటే చిన్న వసతి అది. అందులో నియోజకవర్గం నుండి వచ్చిన వాళ్ళు క్రింద చాప మీద పడుకునేవారు. డాక్టర్ గారు రాత్రిపూట బాత్రూమ్ కు వెళ్లడానికి, నడవడానికి కూడా ఖాళీ ఉండేది కాదు. ఆయన నాకిచ్చిన చనువును వాడుకుంటూ "డాక్టర్ గారూ! పరమశివుడు శనీశ్వరుడికి దొరకకూడదని దాక్కున్నట్లు ఇది ఏంటండీ" అన్నాను. ఆయన చిరునవ్వు నవ్వుతూ "నీకు తెలుసు ఇది నేను పదవిగా భావించడం లేదు. ప్రజా సేవకు మహత్తర అవకాశంగా భావిస్తున్నాను. స్వాతంత్ర పోరాటంలో ఎంతో మంది పడిన కష్టాల కంటే, తన పర్యటనలో వ్యాన్ లో నిదురించి, రోడ్ల పక్కన, కాలకృత్యాలు తీర్చుకున్న ఎన్టీఆర్ గారు పడిన కష్టంతో పోలిస్తే ఇది ఎంత" అన్నారు.

ఎంత సంస్కారము! అయితే 1989లో ఎన్టీఆర్ గారు ఎన్నికలలో ఓడిపోయి తర్వాత గండిపేటలో జరిగిన పార్టీ విస్తృత సమావేశంలో అదే డాక్టర్ గారు "మీరు పార్టీ వ్యవహారాలలో మీ అల్లుళ్లకు ప్రాధాన్యత నిచ్చారని ప్రజలు భావిస్తున్నారు. మీ జన్మ దినోత్సవ సాధారణంగా జరుపుకొని 'మహానాడు' ను పార్టీ ఆవిర్భావ దినముగా జరిపితే, మే నెల మండుటెండలలో కార్యకర్తలు, ప్రజలు ఇబ్బంది పడకుండా ఉంటారని నిర్మోహమాటంగా చెప్పారు. మరుసటి రోజు "ఈనాడు" సంపాదకీయములో "నాడి" తెలిపిన డాక్టర్ గారు" అని రాయబడటం డాక్టర్ గారి మహోన్నత వ్యక్తిత్వానికి నిర్భీకతకు నిలువెత్తు ఉదాహరణ.

ఇక 1977లో డాక్టర్ గారు గుంటూరు నుండి లోక్ సభకు జనతా పార్టీ అభ్యర్థిగా పోటీ చేసినప్పుడు గోడల మీద "డాక్టర్ కావాలా? డాఫర్ కావాలా" అని నినాదాలు రాయించిన వారిని మందలించి వాటిని చెరిపి వేయమని చెప్పారు. ఈ రెండు సందర్భాలలో నేను ఆయనతో ఉన్నాను.

డాక్టర్ గారికి విశాఖపట్నం అంటే చాలా ఇష్టం. ఆయన వైద్య విద్యాభ్యాసం, డాక్టర్ గారు. జయప్రదాంబ గారు గుంటూరులో ప్రాక్టీస్ ప్రారంభించే వరకు విశాఖపట్నంలో తన కాపురం తొలి సంవత్సరాలు గడిపారు. అవి ఏ వ్యక్తి జీవితంలో అయినా ముఖ్యమైన, మధురమైన రోజులు కదా! డాక్టర్ గారు నేనుండగా 1985 తర్వాత రెండు సార్లు విశాఖపట్నం వచ్చారు. ఒకసారి ఒంటరిగా వచ్చారు. రెండవసారి వారి పెద్దమ్మాయి రమాబాల గారితో వచ్చారు. విజ్ఞాన్ లావు రత్తయ్య గారి బీచ్ రోడ్డులోని పెంట్ హౌస్ లో ఉన్న అతిథి గృహంలో ఉన్నారు. డాక్టర్ గారు నిర్మాణంలో ఉన్న స్టీల్ ప్లాంట్ చూడాలన్నారు. స్టీల్ ప్లాంట్ పరిసరాలన్నీ గంటకు పైగా చూసి మనకు సహజంగా రావలసిన పరిశ్రమల కోసం కూడా ఎన్ని ఉద్యమాలు చేయవలసి వస్తోందని, భారీగా నిట్టూర్చారు.

డాక్టర్ గారి రెండోవ అబ్బాయి సురేష్ కు అమ్మాయి విశాఖపట్నంలోనే పుట్టింది. ఆ పాప చిన్నారి జయప్రద. ఆ పాపను చూడటానికి వియ్యంకుల ఇంటికి వెళదాము. అక్కడే లంచ్ చేద్దామన్నారు. ఆ చిట్టి తల్లిని చూసి డాక్టర్ గారు చాలా ఆనందపడ్డారు. మరుసటి రోజు యూనివర్సిటీ లైబ్రరీకి వెళ్లామన్నారు. కారు డ్రైవర్ రావడం ఆలస్యం అయ్యింది. డాక్టర్ గారు ఎందుకు కంగారు పడుతున్నావు!

నీ స్కూటర్ తీయి అన్నారు నేను సంకోచిస్తుంటే వద అని నా స్కూటర్ మీద కూర్చున్నారు. నాకు కంగారు, సంతోషం, అది ఆయన నిరాడంబరత, ఏ విధమైన బేషజం లేకుండా ఉండటం ఇటువంటి అనుభవాలు డాక్టర్ గారితో నాకు చాలా ఉన్నాయి నా ద్రౌపది నవల ముద్రణకు ముందు ఐదు ఆరు నగరాలలో మిత్రులకు, రచయితలకు చదివి వినిపించాను. అందులో భాగంగా డాక్టర్ గారి ఇంట్లోనే రాత్రి సమావేశంలో కొంతమంది ముఖ్యులను పిలిచారు. డాక్టర్ సీతారామారావు గారు, జె.కె.సి కళాశాల పాతూరి కోటేశ్వరరావు గారు, విజ్ఞాన్ రత్తయ్య గారు ఉన్నారు. నేను చదువుతున్నాను. డాక్టర్ గారు అర్థ నిమీలిత నేత్రాలతో తల ఊపుతున్నారు. "అగు ఏమిటి మళ్ళీ ఆ వాక్యం చదువు అన్నారు. చదివాను.

"ఏమిటి? ఆ రోజుల్లో మైళ్ళు ఎక్కడవున్నాయి? యోజనాలు అని వ్రాయీ అన్నారు. అందరం ఉలిక్కి పడ్డాము. ఆయన సునిసిత మేధాశక్తికి ఇదొక ఉదాహరణ.

డాక్టర్ గారు, రమాబాల గారు, నేను విశాఖపట్నంలో శిల్పి పట్నాయక్ గారి దగ్గర తయారవుతున్న డాక్టరమ్మ గారి విగ్రహం చూడటానికి వెళ్ళాము ఆ రాత్రి నేను డాక్టర్ గారిని "డాక్టర్ గారూ, నేను మిమ్మల్ని డాక్టరమ్మ గారిని వేరు వేరుగా చూడలేను మీరిద్దరూ పరిపూర్ణమైన ఆదర్శమైన జంట అందుచేత మీ విగ్రహం కూడా తయారు చేయించి పంపుతున్నాను అని అన్నారు. డాక్టర్ గారు పకపకా నవ్వుతూ నేనింకా ఉన్నాను కదా! అన్నారు. దయచేసి నాకు వదిలెయ్యండని అభ్యర్థించాను. ఆయన మౌనం దాల్చారు రెండు విగ్రహాలు ఒకేసారి డా. జయప్రదాంబ మహిళా కళాశాల ఆవరణంలో ఆవిష్కరించబడటం నా అదృష్టంగా ఈనాటికీ భావిస్తాను.

డాక్టర్ గారు 'సదాశివం' అన్న ఆత్మ కథాత్మకత గ్రంథంలో– వ్యక్తుల గురించి ప్రస్తావిస్తూపోతే ఎక్కడ తేలతామో, తెలియదంటూనే లక్ష్మీప్రసాద్ ను గురించి రాయలేకుండా ఉండలేకపోతున్నానని నన్ను గురించి కొన్ని పంక్తులు రాయడం, నా జన్మ ధన్యమైనదని నిజాయితీగా ఈనాటికీ అనుకుంటాను.

ఇక డాక్టర్ గారి చివరి హైదరాబాద్ ప్రయాణం నా కారణంగానే జరిగింది. డాక్టర్ గారు అప్పటికి గుంటూరు దాటి ప్రయాణాలు మానివేశారు. మీరు ఒకసారి హైదరాబాద్ రావాలి. నా 'ద్రౌపది' నవల ఆవిష్కరణ ఉంది. అంకితం ఇవ్వటానికి మీరు తప్ప నాకు ఎవ్వరూ యోగ్యులుగా కనపడలేదు. దాసరి నారాయణరావు గారు, డాక్టర్ సి. నారాయణరెడ్డి గారు ఉంటారు. మీరు రాలేను అంటే వారిని గుంటూరు తీసుకురావలసి ఉంటుందన్నాను. ఆయన చాలా ఖర్చు, శ్రమ కదా నేనే వస్తానులే అని ఎంతో శ్రమతో కారులో హైదరాబాదు వచ్చి ఆ నవలను అంకితం తీసుకొని నన్ను ధన్యుణ్ణి చేశారు.

సమకాలీన జీవితంలోని అన్ని రంగాలలో విరాట రూపమైన డాక్టరు గారు పూర్ణ పురుషులు. ఆయన గురించి ఇంత చిన్న చట్రంలో రాయటం అసాధ్యమని తెలిసి, తప్పక ముగిస్తున్నాను.



## మైత్రిని మంచి గంధంగా భావించే మనసున్న డాక్టరుగారు

డా. కడియాల వాసుదేవరావు

గుంటూరు నగరమే కాదు, గుంటూరు జిల్లా మొత్తం కీర్తి పతాకను ఎంతో ఎత్తుకి తీసుకొని వెళ్ళి సముజ్వలంగా దానిని రెపరెప లాడించిన కొద్ది మంది వ్యక్తులలో డాక్టరు కాసరనేని సదాశివరావు గారొకరు సదాశయాలకు పెద్దపీట వేసే డాక్టరు గారి సమగ్ర వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించాలంటే ఒక సిద్ధాంత వ్యాసమే రాయాలి. బహుముఖ ప్రజ్ఞాశాలి మన డాక్టరు గారు. జీవితపు విలువల గురించి, సామాజిక వికాసం గురించి, నాగరికత తీరు తెన్నుల గురించి, మానవతా దృక్పథం గురించి, సాహితీ పరిమళం గురించి, మనుషుల మధ్య నెలకొనే మమతల వంతెన గురించి డాక్టరు సదాశివరావు గారికి తెలిసినంతగా మరొకరికి తెలియదని వారి అభిమానులమైన మనందరం ప్రశంసించే మాట.

ప్రపంచంలోనే వైద్య శిఖామణిగా ఆరాధించబడే సర్ విలియం ఆస్లర్ వ్రాసిన చిరు వ్యాసంలో వైద్య వృత్తికి అత్యంత కీలకమయిన పదం ఏమిటో వివరిస్తూ, ఆ పదం పేరు అందరికి తెలిసినదేనని అన్ని రహస్యాలూ అందులోనే ఇమిడి ఉన్నాయని చెబుతూ చివరికి, ఆ పదం శ్రమ (work) అని తేల్చిచెప్పాడు. ఆ లఘు వ్యాసం ఆంగ్ల సాహిత్యంలో ఒక మణిపూస, విద్యార్థిగాను, వైద్యునిగాను డాక్టరు సదాశివరావు గారు శ్రమకు ఎంతో విలువ నిచ్చేవారు. శ్రమ ప్రతిభకు వన్నె తెస్తుంది. ఆ బాటలో పయనించిన డాక్టరు గారు విద్యార్థి దశలో అనేక బహుమతులు, ఎమ్ ఎస్ (జనరల్ సర్జరీ) పరీక్షలో స్వర్ణపతకం సాధించారు. వారి గురువులను ఎప్పుడూ కృతజ్ఞతా భావంతో స్మరించుకోవడం వారి కలవాటు.

1951వ సం.లో గుంటూరులో వారు డా జయ ప్రదాంబగారు ప్రజా వైద్యశాలను స్థాపించడం పట్టణ చరిత్రలో ఒక మైలు రాయి. "పేరులోన గలదు పెన్నిధి' అన్న చందంగా ఆ సంస్థ ప్రజలందరికి ఎనలేని వైద్య సహాయాన్నందించింది. శస్త్రచికిత్సలను ప్రామాణిక పద్ధతిలో నిర్వహించడం వలన

ఆధునిక వైద్యం అందరికీ అందుబాటులోకి వచ్చింది. ఆదర్శ మూర్తులయిన వైద్య దంపతులు మఱచిపోలేని సేవలందించారు. అందరి కృతజ్ఞతలకు పాత్రులైనారు వైద్య శాస్త్రంలో గణనీయమైయిన జ్ఞానంతో పాటు, నైతిక సూత్రాలను నూటికి నూరు పాళ్ళు పాటించిన వ్యక్తి డా. సదాశివరావు గారు, సహృదయతకు వారు పర్యాయపదం. వారి వద్దకు వైద్య సహాయం కోరి, ఏ విద్యార్థి వెళ్లినా ఫీజు తీసుకునే వారు కాదు. ఉపాధ్యాయులను ఎంతగానో గౌరవించే వారు. ఉచిత వైద్యమే కాకుండా వారి వద్ద ఉన్న మందుల శాంపిల్స్ కూడా ఇచ్చేవారు. అంతటి ఉదారత వారిది ఏదేని కారణం వలన వారి వైద్యశాలలో వైద్యం పొందు తున్న రోగి మరణిస్తే, ఆ కుటుంబ సభ్యుల నుండి ఒక్క రూపాయి కూడా తీసుకునేవారు కాదు. డాక్టరు గారి నైతిక సూత్రావళికి ఎన్నో ఉదాహరణలు పేర్కొనవచ్చు.

ఊపిరి సలపని వైద్య వృత్తిని నిర్వహిస్తూనే, వారు బోధనా రంగం పట్ల ఆసక్తితో, 1963లో గుంటూరు వైద్య కళాశాలలో ఆనరరీ ప్రొఫెసర్ ఆఫ్ సర్జరీగా బాధ్యతలను స్వీకరించారు. వారికి నేను విద్యార్థిని కావడం నా అదృష్టంగా భావిస్తాను. వారి నుండి నేను ఎన్నో విషయాలు నేర్చుకున్నాను. క్లిష్టమయిన విషయాలను వర్గీకరించి వాటిని తేట తెల్లంగా వివరించడంలో మంచి నైపుణ్యం ఉండేది వారికి, సునిశిత హాస్యం డాక్టరు గారి స్థిరాస్థి. వారి వాక్కులు ఎందరికో ప్రేరణ కలిగించేవి వారి చేతుల మీదుగా కొన్ని వందల నర్సింగ్ హోమ్లకు ప్రారంభోత్సవాలు జరిగాయి.

మైత్రిని మంచి గంధం గాను, జీవితాన్ని మంచి గ్రంథంగాను భావించేవారు డా. సదాశివరావు గారు, డా జయప్రదాంబ గారు, వారి నివాసంలో ఎప్పుడూ సందడే సందడి ఉత్సవ వాతావరణం కనిపించేది చిరు నవ్వులు, చలోక్తులు ప్రతిధ్వనించేవి. మమతలతో వేసిన మల్లెపందిరి లాగా ఉండేది వారి గృహం. అతిథులందరికీ సహనంతో వండి పెట్టి విందు భోజనంతో ఎంతో మర్యాద చేసేవారు జయప్రదాంబ గారి తల్లి తులశమ్మ గారు.

జయప్రదాంబ గారి స్వగ్రామం కలువపాముల. మా గ్రామానికి మైలున్నర దూరంలో ఉన్నది. వారి కుటుంబంతో ఉన్న పరిచయం వలన నాకు కొంత సన్నిహితత్వం లభించింది. డాక్టరు గారి పిల్లలు రమాబాల, ఉమాబాల, ఉషాబాల, రమేష్, సురేష్లు వైద్య విద్యార్థులు కావడంతో నేను వారి కుటుంబ సభ్యుడిగానే పరిగణింపబడుతుండేవాడిని ఇది నా అదృష్టం డాక్టరు గారు మంచి పుస్తక ప్రియుడు. తెలుగు సాహిత్యంలో 'మణిదీపాలు' వంటి గ్రంథాలు వారి దగ్గర కోకొల్లలుగా ఉన్నాయి.

'సాహితీ సదస్సు' డాక్టరు గారు గుంటూరులోని సాహితీ ప్రియుల కందించిన అపురూప కానుక 1966లో దసరా రోజున జన్మించిన ఆ సదస్సు ఎంతో పేరు తెచ్చుకొన్నది. 1980 వరకు నిర్వహించిన కార్యక్రమాలలో మంచి జిజ్ఞాస పూర్వకమైన చర్చలు, ఆసక్తికరమైన గోష్ఠులు, ఉపయుక్తమయిన ఉ పన్యాసాలు జరిగాయి. అందరినీ అలరించాయి. దాచుకున్న మొగలి రేకులు లాంటి ఆనాటి పరిమళాలు నేటికీ సజీవంగానే ఉన్నాయి. 1971లో 'నవయుగ కవి చక్రవర్తి' గుర్రం జాషువా గారి పై ఒక వ్యాసం

వ్రాసి ఉత్తమ కవితకు సమకాలీనత, విశ్వజనీనత అనేవి రెండు కొలబద్దలని చక్కటి భావం వెలిబుచ్చారు డా. సదాశివరావు గారు.

విద్యారంగానికి గొప్ప సేవలందించారు డాక్టరు గారు 1968లో స్థాపించబడిన జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల విశిష్టమైన సంస్థగా రూపుదిద్దుకున్నది. నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ వారి ఆధ్వర్యములో నెలకొన్న విద్యాసంస్థలన్నీ సమాజ ప్రగతికి ఇతోధికంగా దోహదం చేస్తున్నాయి. 1996లో స్థాపితమయిన డాక్టరు జయప్రదాంబ డిగ్రీ కళాశాల స్వల్ప కాలంలోనే అందరి మన్ననలందు కున్నది. విద్యావంతులు రాజకీయాలలోకి అడుగు పెట్టాలని, అప్పుడే దేశం బాగుపడుతుందని పలుమార్లు అనేవారు సదాశివరావుగారు విజ్ఞానం, చైతన్యం పుష్కలంగా ఉన్నవారు. ప్రజా సమస్యలను బాగా అవగాహన చేసుకోగలరనీ, దాని వల్ల సమాజం లబ్ధి పొందుతుందని డాక్టరు గారి అభిప్రాయం. ఈ భావన కనుగుణంగానే వారు లోక్ సభకు, శాసన సభకు పోటీ చేసారు. 1985లో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర శాసన సభకు ఎన్నుకోబడ్డారు. అనేక విషయాలలో నాటి ముఖ్యమంత్రి డా. ఎన్.టి రామారావు గారికి సలహాలిచ్చారు. డా ఎన్.టి. ఆర్. సదాశివరావు గారి మాటకు ఎంతో విలువ నిచ్చేవారు. ఆచార్య రంగా గారి జీవితం, వారి సిద్ధాంతాలు డాక్టరు గారి ఆలోచనలను బాగా ప్రభావితం చేశాయి.

ఫిబ్రవరి 2008లో డాక్టరు గారి స్వీయ చరిత్ర 'సదాశివమ్' అనే గ్రంథానికి ఆవిష్కరణ మహోత్సవం జరిగింది. నేత్ర పర్వంగా జరిగిన ఆ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన జస్టిస్ చలమేశ్వర్ గారు మంచి ప్రసంగం కావించారు. "సంఘంలో ఆదర్శమూర్తులు తగ్గిపోతున్నారు. కొన్నాళ్ళు పోయాక పూర్తిగా కరువై పోవచ్చు. ఒక ఆదర్శమూర్తి జీవిత ప్రస్థానం గ్రంథ రూపంలో వెలువడుతున్న శుభ తరుణాన, సభకు తప్పక హాజరవ్వాలని, అస్సాం నుండి ఆంధ్రప్రదేశికి దీర్ఘ ప్రయాణం చేసి వచ్చాను." అన్నారు ఆయన. సభానంతరం ఇంటికి వెళ్ళాక నేను ఆదర్శమూర్తులు తగ్గిపోవడానికి కారణమేమిటా అని కాసేపు తర్కించుకున్నాను, నాలో. జస్టిస్ జలమేశ్వర్ గారి మాటలు ఎందరినో ఆలోచింపచేశాయి.

నేను వెతుకుతున్న కారణాలు నా కళ్ళ ముందు కనబడడానికి ఎంతో సేపు పట్టలేదు. వాటిని అక్షర క్రమములో ఏర్పాటు చేసుకోవడానికి కూడా అట్టే సమయం పట్టలేదు.

**నాకు గోచరించిన కారణాలు:**

అ) అధికార కాంక్ష
ఆ) ఆర్జన పట్ల ఆరాటం
ఇ) ఇహలోక సుఖాల కోసం వెంపర్లాట
ఈ) ఈర్ష్యా ద్వేషాలు
ఉ) ఉదారత లోపించడం
ఊ) ఊసరవెల్లి స్వభావం

వీటి వివరణలోకి వెళ్ళడం విషయాంతరం గనుక ఆ ప్రయత్నం చేయను డా సదాశివరావు గారు ఆంధ్ర జాతి గర్వించదగ్గ ఆదర్శమూర్తి

సద్విద్య, సద్వైద్యం, సమాజానికి ముఖ్యమని పలుమార్లు నొక్కి చెప్పారు డాక్టరు గారు, ఆ దిశగా మంచి సేవలను విరివిగా అందించి తరువాతి తరాలకు గొప్ప ప్రేరణను, స్ఫూర్తిని అందించారు.

ఇద్దరు మహా వ్యక్తుల మధ్య పోలికలు ఎలా ఉంటాయో గమనించడం ఆసక్తితో కూడిన ప్రక్రియ. డా. కట్టమంచి రామలింగారెడ్డి గారికి, డా. కాసరనేని సదాశివరావు గారికి మధ్య కొంత సారూప్యం ఉన్నది. ఇరువురికీ విద్యా రంగం పట్ల విపరీతమయిన అభిమానం, సాహితీ రంగం పట్ల ఆసక్తి మెండు. అయితే వారి మధ్య కొన్ని తారతమ్యాలు లేకపోలేదు. ఒక విషయంలో వారి సారూప్యం కించిత్తు ఆశ్చర్యం కలిగిస్తుంది. అదేమిటంటే, కట్టమంచి వారి గోత్రం 'సదాశివ!

గురువుగారు డా. సదాశివరావు గారితో ఎప్పుడూ సంభాషించినా, తత్వవేత్త Bertrand Russell వాక్యాలు నా మదిలో మెదులుతాయి. ఆయన రచించిన "The Conquest of Happiness" అనే గ్రంథంలోని చిట్ట చివరి పంక్తులను ఉదహరిస్తూ ఈ వ్యాసం ముగిస్తాను.

''.........అటువంటి వ్యక్తి తనను తాను విశ్వం పౌరుడిగా భావిస్తాడు, అది అందించే దృశ్యాలను, అది అందించే ఆనందాలను స్వేచ్ఛగా ఆస్వాదిస్తాడు, మరణం ఆలోచనతో కలవరపడకుండా ఉంటాడు, ఎందుకంటే అతను నిజంగా వారి నుండి వేరుగా లేడని భావిస్తాడు. అతని తర్వాత వస్తాడు. జీవన స్రవంతితో అటువంటి లోతైన సహజమైన కలయికలో గొప్ప ఆనందం కనుగొనబడుతుంది.''



## వారో వ్యక్తి కాదు వ్యవస్థ

శ్రీమతి రాజా వాసిరెడ్డి మల్లీశ్వరి, గజల్ కవయిత్రి

ప్రవహించే నదిలా,

పూచే తరువులా, వీచే గాలిలా బీద సాదలను

ఆధరించి పేరుగన్న

కర్మవీరులుగా, పరహితాచరణ మతులుగా ఈ నేల మీద నిలిచే వారు కొందరే ఉంటారు. వారు

స్వార్థ చింతన లేక

మానవతా విలువలకే

పట్టం కట్టి జన్మ సార్ధకం

చేసుకుంటారు.

సాధారణంగా ఎవరైనా

ఏదో ఒకవృత్తివెన్నుకొని

తద్వారా వచ్చే ప్రతిఫలంతో జీవనం

సాగిస్తూ అదే గొప్పను కుంటారు. కాని కొందరే

"బతుకు కరిగిపోయే

మంచు ఉన్న దానిని నలుగురికి పంచు" లి అని,

"పేరుల కోసం పాటు పడని నరుని బ్రతుకు

ఎందుకని" అని తలచి

సమాజం హితకాంక్షులై
తమ కాలాన్ని, జ్ఞానాన్ని,
ధనాన్ని, దేహాన్ని అవసరమైన వారికై వినియోగిస్తారు అలాంటి వారే శ్రీ సదాశివరావుగారు.
వారు వైద్యం చేసినా రాజకీయం నెరపినా, పరోపకారం సలిపినా.,
సలహాలిచ్చినా, సూచనలు చేసినా అవన్నీ
మేలు కూర్చినవే.
సమాజ భవిత, హితం
యువత వలనేనని ఎంచి, ఆ నవ యువ తరాల గురించి ఎంతో ఆలోచించి ఉత్తమ విద్యా విధానం
మనిషిని ఉన్నతుణ్ణి
చేస్తుందని భావించి తాను నడిపిన విద్యాలయాల్లోని విద్యార్థులను
వెన్నెముక ఉన్న వారిగా
తయారుచేయగలిగేజి

ప్రతిభ, నిబద్ధత, సహనం, మార్గదర్శకత్వం చేసే సామర్థ్యం మొదలైన లక్షణాలు గల అధ్యాపకులను నియమించిన గొప్ప దార్శనికులు సదాశివరావు గారు. ఆ దార్శనికతే వారిని అందరిలో భిన్నంగా నిలిపింది.

వారు సెక్రటరీగా ఉన్న జే కే సి కాలేజీలో నేను చదువుకున్నాను.
జే కే సి కాలేజీలో వారు విద్యార్థులకై
వ్యక్తిత్వం, కర్తవ్య
నిర్వహణా నిబద్ధత, సాహిత్య నేపథ్యం ఉన్న
శ్రీ రోశయ్యగారిని కళాశాల ప్రిన్సిపాల్ గా
నియమించటంమే గాక
అలాంటి వారే ఐన శ్రీయుతులు అమరేంద్ర,
అనంతం ఈ నాగళ్ళ గురుప్రసాదరావు,
పాతూరి కోటేశ్వరరావు
వంటి వారినెందరినో
అధ్యాపకులుగా నియమించటమే వారి



దార్శనికతకు నిదర్శనం,
సదాశివరావు గారు బాల్యం నుండి ప్రకృతి
ప్రేమననుభవిస్తూ, అస్వాదిస్తూ రామాయణ, భారత
భాగవతాది గ్రంథాలను, మనుచరిత్రాది ప్రబంధాలను,
''దేశమే దేవాలయం
ప్రజలే దేవుళ్ళు''
అన్న తుమ్మల సీతారామమూర్తి మున్నగు ఆధునిక కవుల కవిత్వాన్ని చదివి దాని సారమెరిగిన వారాయన. అందుకే
''స హితేన సాహిత్యం''
అన్న మాటల అర్థ

పరమార్థాల అర్థమెరిగిన వారాయన సాహిత్య సహవాసం, సజ్జన సాంగత్యం వలన సహృదయతన అలవడుతుందని, సమాజంలో హింస కొంతైనా తగ్గుతుందనేది వారి ప్రగాఢాభిప్రాయమనిపిస్తుంది. సాహిత్యం విలువ తెలిసిన వ్యక్తిగా సదాశివరావుగారు నవ యువకులైన విద్యార్థులను యువ కవులుగా తయారుచేసే సత్సంకల్పంతో కేకేసి కళాశాల లో ప్రతి నెలా సాహితీ సమావేశాలను నిర్వహించి వాటికి అధ్యక్షత వహించే వారు. ఈ సమవేశాల్లో గుర్రం జాషువా, కాళోజి నారాయణరావు. సి. నారాయణరెడ్డి, కృష్ణ కుమారి వంటి ఆనాటి

ఉత్తమ సాహితీ సృజనకారులను రప్పించి, సాహిత్యోపన్యాసాలనిప్పించి వారిని సన్మానించారు వారు. నేను కూడా రెండు సార్లు వారి అధ్యక్షతన జరిగిన సదస్సుల్లో

వేగుంట మోహన ప్రసాద్ (మో), బేతవోలు రామ బ్రహ్మం
మొదలైన వారితో పాటు విద్యార్థినిగా నేను పాల్గొనటం జరిగింది. ఆ నాటి ఆ ఆహ్వాన పత్రిక నా వద్ద ఇంకా భద్రంగా ఉంది ఓ మధుర స్మృతికి నిదర్శనగా.
ప్రతి అంతాన్ని సూక్ష్మ
పరిశీలనా దృష్టితో చూచే సదాశివరావుగారు.
నిజానికో వ్యక్తి కాదు.
ఓ వ్యవస్థ సదాశయాలెప్పుడు

సత్ఫలితాలు ఇస్తాయనేది వీరి ద్వారా మరో సారి రుజువైంది ఎలా అంటే "తానొకడైనా
తలకొకరూపుగా" అన్నట్టు, "పటుడింతై
ఇంతింతై" అన్నట్టు
మర్రి విత్తు లాంటి
కుగ్రామం నుండి వచ్చిన ఆయన మహా
సమాజ జనం కోసం
ఎంతో చేసి సాధించి చూపారాయన
"ధన సంపాదన కన్న జనసంపాదన మిన్న.
పుస్తక పఠనం ప్రతి వ్యక్తి
ప్రవృత్తి కావాలి.
మానవతా దృక్పథంతో
వైద్యం చేయాలి.
ప్రకృతి పరిశీలనే
మనిషికి అపరిమిత
జ్ఞానాన్నిస్తుంది." అంటూ వారు చెప్పిన ఎన్నో మాటలు
ప్రాతః స్మరణీయాలు..



ఏమైనా సదాశివరావుగారిది బహుముఖీనమైన, విలక్షణమైన, విశిష్టమైన వ్యక్తిత్వం.



# బహుముఖ ప్రజ్ఞాశాలి

**పాతూరి కోటేశ్వరరావు**
విశ్రాంత అధ్యాపకులు, జె.కె.సి కళాశాల

డాక్టర్ కాసరనేని సదాశివరావు వృత్తి పరంగా ప్రముఖ శస్త్రవైద్యుడైనప్పటికీ అనేక రంగాలలో తన ప్రతిభాపాటవాలతో ప్రసిద్ధికెక్కారు. విద్యారంగంలో తన దార్శనికతవల్ల రాష్ట్రస్థాయి విద్యాసంస్థలుగా జె.కె.సి కళాశాలను, ఆర్.వి.ఆర్ అండ్ జె.సి ఇంజనీరింగ్ కళాశాలలను తీర్చిదిద్దారు. ప్రవృత్తిగా సాహిత్యంపై అభిరుచితో "సాహితీ సదస్సును" గుంటూరులో నెలకొల్పి పేరున్న కవులను, సాహితీ వేత్తలను రప్పించి ప్రతినెలా సమావేశాలు ఏర్పాటు చేసారు. చదువుకున్నవారు రాజకీయాలలోకి రావాలని బలంగా నమ్మి తను ఆదర్శంగా రాజకీయ రంగ ప్రవేశం చేసారు. సమాజంలో విలువలు కాపాడడానికి తన ప్రవర్తన ద్వారా ఆదర్శవంతమైన జీవనవిధానం ద్వారా ఎంతో మందికి మార్గదర్శకులమయ్యారు. ఎల్లవేళలా చుట్టూవున్న వారికి శుభం కలిగించే "సదాశివుడ"య్యారు. అట్టి మహనీయుని శతజయంతి (1923-2023) జరుపుకోవడం, ఆదర్శ జీవనానికి పట్టాభిషేకంగా శతజయంతి కమిటి సభ్యులమైన మేము భావిస్తున్నాము.

**జననం:**

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు 13.10.1923 తేదీన తక్కెళ్ళపాడు శివారు రామచంద్రపాలెంలో జన్మించారు. అప్పటికి ఆ ఊరు జనాభా వందమాత్రమే తను పుట్టి ఆ ఊరి జనాభా ఒక శాతం పెంచారు. ఇది ప్రసిద్ధ అమెరికన్ సాహితీవేత్త మార్కెట్వేన్ కే దగ్గిందని డాక్టరు గారు తన ఆత్మకథలో వ్రాసారు డాక్టరుగారి తండ్రి రామశాస్త్రి తల్లి సౌభాగ్యమ్మ, వారికి డాక్టరు గారు మొదటి సంతానం 'సదాశివుడు' అని పేరు పెట్టారు. తరువాత కలిగిన సంతానం నలుగురు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు. ఒక అబ్బాయి, ఒక అమ్మాయి అకాల మరణం చెందారు. డాక్టరుగారు చిన్నతనం నుండి

తక్కెళ్లపాడులోని తాతయ్య, పిన్నమనేని వీరయ్య, అమ్మమ్మ బసవమ్మల దగ్గర పెరిగారు. మేనమామ సూరయ్య విద్యాధికుడు కావడం వల్ల డాక్టరు గారి చదువుపై తను బాగా శ్రద్ధ తీసుకున్నారు.

**విద్యాభ్యాసం:**

డాక్టరు గారి ప్రాధమిక విద్య తక్కెళ్లపాడు ఎలిమెంటరీ స్కూల్లోనే జరిగింది. చదువుపై వీరయ్య గారి కన్నా బసవమ్మ గారికి పట్టుదల ఎక్కువగా వుండేది. హైస్కూలు విద్యకు గుంటూరు. హిందూ కాలేజీ ప్రాంగణం ఎంచుకున్నారు. అక్కడ ఉపాధ్యాయులను గురించి చాలా గొప్పగా ఆత్మకథలో వ్రాసారు. మాథ్మెటిక్స్ టీచరు మైలవరపు వెంకట్రామయ్య గారి వల్ల యస్.యస్.యల్.సి లో మార్క్స్ ఎలక్టివ్ సబ్జెక్టుగా తీసుకొని ఇంటర్మీడియటి మార్స్ గ్రూపుతోనే మెడిసిన్లో చేరడం ఒక రికార్డు. మాథ్స్ వల్ల ఏ విషయమైనా సునిసితంగా ఆలోచన చేసే వారు.

ఇంటర్మీడియెట్ ప్రిన్సిపాల్ బుద్ధిరాజు రామచంద్రరావు గారు డాక్టరు గారిపై చెలఅగని ముద్ర వేశారు. ప్రతిభతోపాటు పిల్లలపై ప్రేమ, డాక్టరుగారిని చలింపజేసింది. ఒకరోజు దోవతి ఊడిపోతే తనగదిలోకి పిలిచి దోవతి కట్టడం నేర్పారట. ఆ అభిమానమే జె.కె.సి కాలేజి ప్రారంభానికి రామచంద్రరావు గారిని ముఖ్య అతిధిని చేసింది.

మేనమామ సహాయంతో విశాఖ పట్టణం ఆంధ్ర మెడికల్ కాలేజిలో చేరి మొదటి సంవత్సరం యూనివర్సిటి ఫస్ట్గా నిలిచారు. తరువాత కుటుంబ సమస్యలతో చదువుపై శ్రద్ధ తగ్గి కేవలం పాసవుతూ వచ్చారు. 1947లో MBBS పూర్తి చేసి కొంత కాలం సీనియర్ హౌస్ సర్జన్ చేరి MS కోర్సు ఫస్ట్ చాన్స్లోనే గోల్డ్ మెడల్ సాధించారు. ఇది ఆ రోజుల్లో ఒక రికార్డ్. మొదటి చాన్స్లో పాసవ్వడం దుర్లభవం అనుకునే రోజులు అవి.

**వివాహం:**

పూర్తిగా ప్రేమ వివాహం కాకపోయినా, తన మిత్రుడు డాక్టర్ యార్లగడ్డ కృష్ణమూర్తి సూచన మేరకు ఒక్కరే వెళ్లి డాక్టరు జయప్రద గారిని చూడడం వెంటనే ఉంగరాలు మార్చుకోవడం జరిగింది. కట్న కానుకల ప్రశక్తిలేదు. పెండ్లి డాక్టరు గారి శ్రేయాభిలాషియైన కోడె గోపాలకృష్ణ గారి ఇంట్లో పూల దండల మార్పిడి ద్వారా జరిగింది పెండ్లిపెద్దగా ఆనాటి రాష్ట్ర మంత్రి మాన్యశ్రీ కందుల ఓబుల రెడ్డిగారు వ్యవహరించారు అన్యోన్య దాంపత్యం పలువురికి ఆదర్శ మయింది ఇద్దరు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలు అందరూ డాక్టరే వారి జీవిత భాగస్వాములు కూడా డాక్టర్లే గుంటూరులో డాక్టర్ల కుటుంబంగా ప్రసిద్ధి ఆ రోజుల్లో.

## ప్రజావైద్యశాల స్థాపన:

22-6-1951 గుంటూరులోని సాంబశివపేట నందు ప్రజావైద్యశాల ప్రారంభమైంది. తనకు అభిమానమైన ప్రొఫెసర్ రమణమూర్తి గారు ముఖ్య అతిధిగా విచ్చేశారు అనతికాలంలోనే మంచి వైద్యులుగా పేరు సంపాదించుకున్నారు. హాస్పిటల్ పరికరాలు కొనుగోలుకు చిన్ననాటి మిత్రుడు నందిపాటి నారాయణ గారు ఆర్థిక సహాయం చేసారు తరువాత కొత్తపేట ఓల్డ్ క్లబ్ రోడ్డులో డాక్టరు ద్వారకాబాయి హాస్పిటల్ అమ్మకానికి వస్తే, అప్పుచేసి ఆ హాస్పిటల్ కొన్నారు ఇంటికి పెద్ద కొడుకు కనుక ముగ్గురి తమ్ముళ్లను డాక్టర్ కోర్సు చదివించారు. పెద్ద తమ్ముడికి చదువు అబ్బలేదు ఊళ్లోవుండి వ్యవసాయం చేసాడు వైద్యం వ్యాపారంగా చేయనందువల్ల రోగుల్లో మంచి పేరు సంపాయించుకున్నారు. డాక్టరు గారి పలకరింపు ప్రభావాన్ని చిలవలు పలవలుగా చెప్పుకోనేవారు.

## వైద్యరంగం:

డాక్టరు గారి ప్రధాన వృత్తి వైద్యం గనుక, అందునా శస్త్రవైద్య నిపుణుడు గనుక కొద్ది కాలంలోనే మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. గ్రామీణ పేదరికాన్ని దగ్గరగా చూచారు గనుక పేదలకు ఉచిత వైద్యం అందించాలని సంకల్పించుకున్నారు. జీవితాంతం అది పాటించారు. నిరుపేదలైతే మందులు కూడా తనేయిచ్చేవారు. వారి ముఖాల్లో ఆనందాన్నే తన సంపాదనగా భావించేవారు. మరొక గొప్ప నిర్ణయం విద్యార్థులెవరైనా వారి దగ్గర ఫీజు తీసుకోకపోవడం. చెఱుకూరి వెంకటేశ్వరావు రెండు లక్షలు కాలేజికి విరాళమిస్తూ, "మీరు నేను బి.ఎ. చదివేటప్పుడు రెండు జ్వరం బిళ్లలు నాకు ఉచితంగా ఇచ్చారు. కనుక నేను ఇప్పుడు 2 లక్షలతో రుణం తీర్చుకుంటున్నాను" అని సభలో చెప్పారు. ఇలాటి అనుభవాలు కోకొల్లలు.

మరొక గొప్ప లక్షణం రోగాన్ని బట్టి శ్రద్ధేగాని. ధనిక పేద తారతమ్యం లేకుండా వైద్యం చేసారు. చివరివరకు హాస్పిటల్లో ప్రత్యేక రూముల సౌకర్యం చేయలేదు. ఇప్పటిలాగా కంప్యూటర్ డాక్యుమెంటేషన్ లేకపోయినా 25 ఏళ్లనాడు వైద్యం చేయించుకున్న పేషంట్ వస్తే, జబ్బు వివరాలు, జరిగిన చికిత్స చెప్పగల జ్ఞాపకశక్తి వున్నవారు, రోగనిర్ధారణలో ఇప్పటి వలె డాక్టరు సదాశివరావు గారు స్కానింగ్ లేక పోయినా, సేకరించిన లక్షణాలను బట్టి నిక్కచ్చిగా రోగనిర్ధారణ చేసి తగిన చికిత్స చేసేవారు. విద్యుత్తు సౌకర్యలేని రోజుల్లో పెట్రోమాక్స్ లైట్ల వెలుతురులో సర్జరీలు చేసారు. ప్రముఖ రాజకీయవేత్త గొట్టిపాటి బ్రహ్మయ్య గారికి, వారి ఇంట్లోనే సర్జరి చేసిన ఘనత డాక్టరు గారిది.

1970-80ల మధ్య 200 పడకలతో జనరల్ హాస్పిటలను తలపించేది సర్జరీయే గాకుండా అన్ని రోగాలకు చికిత్స చేసేవారు. అందువల్ల మెడిసిన్ పూరైన స్టూడెంట్స్ ఎప్రెంటిస్లుగా చేరి అనుభవం గడించు కొనేవారు మెళకువలు నేర్పేటప్పుడు తేలుకొండిలాగా కుట్టి విషయాలు నేర్పేవారు. వాళ్లకు ఆలోచన రేకెత్తించడానికే ఈ పని చేసేవారు. ఒక రోజు గుంటూరు మెడికల్లో చదివిన విద్యార్థి "గేటుకు

ఎదురుగా వున్న విగ్రహం ఎవరిది అని అడిగాడు" అతను అమాయకంగా ఎవరిదో నండీ నాలుగేళ్ల నుండి చూస్తూనే వున్నాను" అనగానే డాక్టరు గారు కోపం కొంత తమాయించుకొని పరిసరాలు క్షుణ్ణంగా పరిశీలించకుండా వైద్యుడుగా ఎలా సక్సెస్ అవుతావు అని అనునయంగానే చివాట్లు పెట్టారు. అప్పటినుండి అతనిలో వచ్చిన మార్పు డాక్టరు గారికే ఆశ్చర్యమేసింది. అతను ప్రస్తుతం అమెరికాలో స్థిరపడి స్వంత విమానం కొనుక్కునే స్థాయికి ఎదిగాడు.

డాక్టరు గారు హస్తవాసిమంచిది. గుంటూరులోనూ చుట్టుపట్ల పట్టణాలలోనూ అనేక హాస్పిటల్స్ తన చేతుల మీదుగా ప్రారంభించారు. క్రొత్తలో వారికి సర్జరీలలో సహాయం కూడా చేసేవారు. వైద్యం విస్తరించాలనే దృక్పథం డాక్టరు గారిది. ఈర్ష్యా ద్వేషాలు లేని వ్యక్తి "మట్ట చెట్టు నీడన మరొక చెట్టు మొలవదనే" నానుడిని ఛేదించి ఎంతో మంది డాక్టర్లను తను ప్రోత్సహించారు.

గుంటూరు గవర్నమెంటు హాస్పిటల్లో ఆనరరీ సర్జన్గా చేసిన కాలంలో గూడా మెడికల్ విద్యార్థుల మెప్పు పొందారు. ఉత్తమ వైద్యులుగా ప్రతివారు ఎదగాలనే అభిలాష డాక్టరు గారిది. వైద్యం చేయించుకున్న వారి కుటుంబాలలో ప్రతి ఫంక్షన్కు వెళ్లేవారు వారితో పాటు ఊళ్లోవాళ్ల ఆనందానికి అవధులుండేవి కావు. వైద్యుడుగా కాక ఆత్మ బంధువు పరిగణించేవారు.

**విద్యారంగం:**

విద్యార్థి దశనుండే విద్యా సంస్థల పరిశీలన, అభివృద్ధికి మార్గాలు అన్వేషించేవారు. తన ప్రాక్టీసు ఉచ్ఛస్థితిలో వున్న రోజుల్లో సమాజ గుర్తింపు పొంది విద్యా సంస్థల నిర్వహణకు పట్టణంలోని పెద్దలు ఆహ్వానించడం జరిగింది. కుల వివక్ష అధికంగా వున్న రోజుల్లో కమ్మ విద్యార్థులకు రూములు అద్దెకు యిచ్చేవారు కాదు. అందువల్ల కమ్మ హాస్టల్కు తన సహకారం కావలిసివచ్చింది. తరువాత పాటిబండ్ల సీతారామయ్య హైస్కూల్ అధ్యక్ష భాధ్యతలు నిర్వహించి గుంటూరు పట్టణంలో ప్రముఖ విద్యా సంస్థగా తీర్చిదిద్దారు. 1968లో జాగర్లమూడి కప్పుస్వామి చౌదరి కళాశాల (జె.కె.సి) ఏర్పడిన తరువాత యాజమాన్య సభ్యులంతా ఏకగ్రీవంగా కార్యదర్శి పదవికి ఎంపిక చేసారు. తన దార్శినికత ప్రదర్శించి. కళాశాలను రాష్ట్రంలోనే అత్యుత్తమ కళాశాలగా తీర్చిదిద్దారు. ప్రతిశాఖలోనూ అధిపతిగా పేరూ, అనుభవమున్న అధ్యాపకులను అధిక జీతమిచ్చి ఆహ్వానించారు వారికి సహాధ్యాయులుగా గ్రామీణ ప్రాంత యువ ఫోస్టు గ్రాడ్యుయేట్లను నియమించి భోధనను పిల్లల, తల్లి దండ్రుల మెప్పు పొందేటట్లు చేయగలిగారు. మంచి ఫలితాలు సాధించారు. అధికార దర్పం ప్రదర్శించకుండా అందరితో చనువుగా వుండేవారు ఒక సుహృద్భావ వాతావరణం నెలకొల్పారు. ప్రిన్సిపాల్ రోసయ్య గారితో కలిసి అత్యుత్తమ గ్రంథాలయాన్ని నిర్మించారు. ఈ అనుభవంతో సాంకేతిక విద్య పై దృష్టి మరల్చి రాయపాటి రంగారావు, జాగర్లమూడి చంద్రమౌళి (ఆర్.వి.ఆర్ అండ్ జె.సి) ఇంజనీరింగ్ కాలేజి భాధ్యతలు స్వీకరించి,

దేశంలోనే **మొదటి 100 ర్యాంకులలో** స్థానం వుండేటట్లు కృషి చేసారు. ప్రస్తుతం కాంపస్ సెలెక్షన్లలో ఆర్.వి.ఆర్ అండ్ జె.సి.మేటి

1967 లోనే ఏర్పడిన "నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటి"ని కార్యదర్శిగా, అధ్యక్షుడిగా వుండి మరికొన్ని విద్యాసంస్థలు స్థాపించడం జరిగింది. ఆ సంస్థలు

1 గురుకుల విద్యావనం హైస్కూల్ పేరేచర్ల,
2 రాయపాటి రంగారావు బి.ఇడి కళాశాల,
3. కొండబోలు లక్ష్మీ ప్రసాద్ పబ్లిక్ స్కూల్,
4. జాగర్లమూడి చంద్రమౌళి కాలేజ్ ఆఫ్ లా,
5. చేబ్రోలుహనుమయ్య ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫార్మాసూటికల్ సైన్స్ స్, చౌడవరం. అన్ని సంస్థలు మంచి విద్యా ప్రమాణాలతో నడవడం సంతోషించవలసిన విషయం.

డాక్టరు గారిని ఎవరో అడిగారు "**మీ పరిపాన విజయ రహస్యమేమిటి**" అని డాక్టరు గారు తన సహజ ధోరణిలో "**పని చేసుకునే వారికి అడ్డం పడకుండటమే**" ప్రధాన సూత్రం అందువల్లనే ఉ ద్యోగులందరికి డాక్టరు గారంటే వల్లమాలిన అభిమానం.

కళాశాలల నిర్వహణ అనుభవంతో ఆంధ్ర, నాగార్జున విశ్వ విద్యాలయాలలో పరిపాలనా సభ్యులుగా తమ సేవలను అందించారు. కీలకనిర్ణయాలలో క్రియాశీలకంగా వ్యవహరించారు. పలువురి మన్నలను పొందగలిగారు. ఇంత అనుభవమున్నా క్రొత్త విషయాలను తెలుసుకునే సహృదయం వుండటం విశేషం. వైద్యరంగంలో వచ్చినంత గుర్తింపు విద్యారంగంలో రావడం డాక్టరుగారి ప్రత్యేకత.

**సాహిత్యరంగం:**

పరిపూర్ణ వ్యక్తిత్వం పఠనం వల్లనే వస్తుందనేది డాక్టరు గారి విశ్వాసం. తెలుగు సాహిత్యం పై అభిరుచి కలిగించిన వారు హైస్కూలు ఉపాధ్యాయులు మిన్నెకంటి గురునాధ శర్మ గారు, శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి గారు. ఇంటర్మీడియట్లో ప్రిన్సిపాల్గా వ్యవహరించిన బుద్ధిరాజు రామచంద్రరావు గారు.

డాక్టరు గారు ఇష్టంగా భారతం, రామాయణం, వసుచరిత్ర మను చరిత్రలు చదివారు. ఆధునిక సాహిత్యం పై కూడా అభిరుచి పెంచుకున్నారు. తుమ్మల సీతారామమూర్తి, దువ్వూరి రామిరెడ్డి, గుర్రం జాషువాల కవితలు తనపై ప్రభావం చూపాయని స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నారు.. మనసులో ఒక సంకల్పం కలిగి ఒక్కరే చదవడం కన్న పదిమందికి వినపించడం మంచిదని సాహిత్య సమావేశాలకు అంకురార్పలు చేసారు వెంటనే గుంటూరులోని కవులను సాహితీవేత్తలను దసరా రోజు సమావేశపఱచి గుర్రం జాషువా గారిచే "సాహితీ సదస్సు" గా నామకరణం చేయించారు. తను అధ్యక్షునిగా, యువకవి

కొల్లా కృష్ణారావు కార్యదర్శిగా ప్రతినెలా రాష్ట్రంలోని పేరున్న కవులను పిలిచి సమావేశాలు ఏర్పాటు చేయ నిశ్చయించారు. యువకవుల కవితలను కూడా ప్రోత్సహించడం ఈ సాహితీ సదస్సు ఆశయం సాహితీ సదస్సు సమావేశాలలో పాల్గొన్న కొందరి ప్రముఖుల పేర్లు:

1 తుమ్మలసీతారామమూర్తి
2 గుఱ్ఱం జాషువా
3 దివాకర్ల వెంకటావధాని
4 వాసమాబలై వరదాచార్యులు
5 ఉత్పల సత్యన్నారాయణ
6. కాళోజి నారాయణరావు
7. ఏటుకూరి వెంకటనరసయ్య
8 సి. నారాయణ రెడ్డి
9 నాయని కృష్ణ కుమారి
10 బి.వి.నరసింహారావు
11 బుర్రకధ ఫేమ్ షేక్ నాజర్
12 మరుపూడి కోదండరామి రెడ్డి
13 పుట్టపర్తి నారాయణాచార్యులు
14 రాజన్న కవి
15 రామలక్ష్మి ఆరుద్ర
16 మాధవరాయ శర్మ
17. జంధ్యాల పాపయ్యశాస్త్రి
18 నాగళ్ల గుళ్లప్రసాదరావు.
19 బేతవోలు రామబ్రహ్మం
20 ప్రసాదరాయ కులపతి

ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 17 తేది మాత్రం ముఖ్యవక్తగా ఒక మహిళను పిలవడం సాంప్రదాయం. ఈ తేదీకున్న ప్రత్యేకత దివంగత ఆశా జన్మదినం ఆశా, డాక్టర్ దంపతులకు మేనకోడలు. పిన్న వయస్సులో అకాల మరణం చెందింది. ఆశాకు సాహిత్యం అంటే ఎనలేని అభిరుచి. అందుకే ప్రత్యేక సదస్సు, జయప్రద గారు సమావేశాల అనంతరం అతిధులకు విందు భోజనాలు ఏర్పాటు చేసేవారు. డాక్టరు గారు రాజకీయరంగ ప్రవేశం చేసిన తరువాత, సాహితీ సదస్సు తన ఉ నికిని కోల్పోయింది.

**రాజకీయరంగం:**

డాక్టరు గారు ఆచార్య రంగా గారి అభిమాని, అందువల్ల కాంగ్రెస్కు వ్యతిరేక ధృకృధంతో వుండేవారు. ప్రత్యక్ష రాజకీయాలో పాల్గొనకపోయినా కృషీకార్ లోక్ పార్టీ, స్వతంత్ర పార్టీ, అభ్యర్ధులను ఎన్నికల్లో సమర్ధించేవారు. ఇంధిరాగాంధీ ఎమర్జన్సీ విధించిన తరువాత వచ్చిన ఎన్నికల్లో జనతాపార్టీ అభ్యర్ధిగా, కాకలు తీరిన కేంద్రమంత్రి కొత్త రఘురామయ్యపై గుంటూరు పార్లమెంటుకు పోటీ చేశారు. ఓడిపోయినా, జాతీయ గాయకులమెప్పు పొందగలిగారు ఆ తరువాత తన రాజకీయ గురువైన ఆచార్య రంగా గారి పై పోటీ చేయవలసివచ్చింది. ప్రచారంలో ఎదురుపడినప్పుడు పాదాభివందనం చేసేవారు. పోటీదార్లను శత్రువులుగా గాక కేవలం ప్రత్యర్ధులుగా చూసే సంస్కారం పాటించారు. కొంత విరామం తరువాత అన్న నందమూరి తారకరామారావు పిలుపు మేరకు పెదకూరపాడు అసెంబ్లీకి పోటీ చేసి గెలిచి ఆ నియోజక వర్గాన్ని ఎంతో అభివృద్ధి చేసారు ముఖ్యంగా కృష్ణానది. ప్రక్కనే పారుతున్నా నీటిపారుదల లేని వ్యవసాయ భూములకు లిఫ్ట్ ఇరిగేషన్ సౌకర్యాలు కల్పించి మెట్ట, మాగాణి సాగుకు సహకరించారు.

గ్రామీణ రవాణా సౌకర్యం కొలఅకు అనేక రహదార్లు నిర్మించారు. ప్రత్యర్థులతో మాట్లాడి గ్రామాల్లో కక్షలు కార్పణ్యాలు తగ్గించారు. అన్యోన్యంగా బ్రతకటానికి బాటలు వేశారు.

నందమూరి తారక రామారావు గారితో వున్న చనువు వల్ల సమావేశాల్లో మనసులో మాట నిర్భయంగా చెప్పేవారు మహానాడులో తాను చేసిన సూచనలు రామారావు గారికి కష్టం కలిగిస్తాయని అందరూ భావించారు. డాక్టరు గారు చేసిన సూచన, ఏమంటే మహానాడు మండుటెండలలో మే 28 తేదీన గాకుండా అనుకూలమైన సమయంలో జరుపదామని దానికి రామారావు గారు సానుకూలంగానే స్పందించారు. కానీ 'ఈనాడు' రామోజీరావు ఇదే విషయంపై డాక్టరు గారి ధైర్య సాహసాన్ని కీర్తిస్తూ మరుసటి రోజు స్వదస్తూరితో ఎడిటోరియల్ వ్రాశారు.

ఐదేళ్ల కాలంలో ఒక్క అవినీతి ఆరోపణ గాని, ఆశ్రిత పక్షపాతం గానీ లేకుండా ప్రత్యర్థులు కూడా ప్రశంసించే రాజకీయ జీవితం గడిపారు సామాన్యుడు కూడా సరాసరి వచ్చి సమస్యలు చెప్పుకునే వెసులుబాటు ఆ ఐదేండ్లకాలంలో కల్పించారు. రాజకీయానికి క్రొత్త నిర్వచనం పలికారు.

**సామాజిక రంగం:**

వైద్య రంగంలో మిగిలిన రంగాలకన్నా, ప్రతిభా వంతులైన డాక్టర్ల మధ్య ఈర్ష్య అసూయలు సహజంగానే ఎక్కువ వుంటాయి కానీ డాక్టరు గారు వీటికి అతీతం తన కన్నాముందు ప్రాక్టీసు పెట్టిన డాక్టర్లను గౌరవించారు. తన తరువాత వచ్చిన వారిని తగిన సలహాలిచ్చి ప్రోత్సహించారు. అవసరమైతే క్లిష్టమైన శస్త్ర చికిత్సలు తనే వేళ్లి చేసేవారు. తను ఆదర్శంగా వున్నందువల్ల ఎక్కువమందికి మార్గదర్శకులయ్యారు. స్నేహనికి అధిక ప్రాధాన్యమిచ్చేవారు. మెడిసిన్ చదివేటప్పుడు సహచరులు యతిరాజులు, ప్రతాప్ కుమార్. కృష్ణమూర్తి, వీరయ్య, వీరరాఘవయ్యలు చివర వరకు మిత్రులుగానే వున్నారు. పేద, ధనిక తేడా లేకుండా ఆప్యాయమైన పలకరింపు ఎక్కువమందిని ఆలోచింపజేసింది, అనుకరింపజేసింది. ఎందుకంటే శిఖరం లాంటి వ్యక్తిత్వం వున్న సామాన్యుడి లాగా ప్రవర్తించడం. ఆశ్చర్యం కలిగిస్తుంది. డబ్బు సంపాదనపై దృష్టి లేకపోవడం. ధన సంపాదన కన్నా జన సంపాదన గొప్ప అని గుర్తించడం, దాన్ని జీవితమంతా పాటించడం, మహాత్ముడి లక్షణమే గదా! ఉన్నదానిలో అవసరానికి, అవసరమైన వారికి దానం చేయడం డాక్టరు గారిలో గొప్ప లక్షణం డాక్టరు గారు నాకు తెలుసు, డాక్టరు గారికి నేనంటే అభిమానం, మా యింటిలో పంక్షనుకు వచ్చారు అని మురిసి పోయే జనం కోకొల్లలు డాక్టరు గారి బ్రాండ్ ప్రతి ఒక్కరికి గౌరవపడం డాక్టర్లందరి చే "డాక్టరు గారు" అని పిలిపించుకునే ఏకైక డాక్టర్ డాక్టర్ కాసరనేని సదాశివరావు, డాక్టరుగారి మంచి తనానికి పరాకాష్టగా నిలిచింది. ఆయన అంతిమయాత్ర మూడు రోజులు ఒక దివ్యక్షేత్రాన్ని సందర్శించినట్లు జనం రావడం, మూడవ రోజు సాగిన యాత్రలో ఇంటి వద్ద నుండి స్మశానం వరకు ఇసుకేస్తే రాలనంత జనం, పదిహేను

మంది ప్రజా ప్రతినిధులు స్మశానం వలకు కాలినడకన వాహనాన్ని అనుసరించడం గుంటూరు. పట్టణంలో సభూతోనభవిష్యతి.

**డాక్టరు గారి విలువైన పలుకులు**

**వైద్యం:**

వైద్యం అందరికి అందుబాటులో వుండాలి.
రోగి ఆర్థిక స్థితిని బట్టి ఫీజు వసూలు చెయ్యాలి.
వైద్యం వ్యాపారదృష్టితో గాకుండా మానవతాదృష్టితో చెయ్యాలి.
గ్రామీణులకు వైద్య సౌకర్యాలు విస్తరించబడాలి.
అనవసర పరీక్షలతో రోగులను యిబ్బంది పెట్టకూడదు.

**విద్య:**

అధ్యాపకుల నియామకాల్లో ప్రతిభ కన్నా విద్యార్థులపై శ్రద్ధకు ప్రాధాన్యమివ్వాలి. పట్టణ ఉద్యోగుల కన్నా, పల్లెటూళ్ల నుండి వచ్చిన వారు నిష్కపటత్వంతో నమ్మకంగా పని చేస్తారు. చదువుకు ఒక నిర్దిష్ట సిలబస్ వుంటుంది కానీ బుద్ధికి అలాంటి పరిమితులుండవు గనుక ఎక్కువ బుద్ధులు నేర్పండి.

**జనరల్:**

ధన సంపాదన కన్నా జనసంపాదన గొప్పది.
రాజకీయంలో ప్రత్యర్థులే గాని శత్రువులు ఉండరాదు.
పుస్తక పఠనం ప్రతి ఒక్కరి ప్రవృత్తి కావాలి.
పరిసరాల పరిశీలన విద్యలన్నిటి కన్నా ఎక్కువ జ్ఞానాన్నిస్తుంది.



# విజయవంతమైన సాధారణ అభ్యాసకుడిగా ఎలా ఉండాలి

డా. కె. సదాశివరావు ఎం ఎస్

**పరిచయం:**

విజయవంతమైన సాధారణ అభ్యాసకుడిగా ఉండటం చాలా క్లిష్టమైన సమస్య, నియమాలను నిర్దేశించలేము. ఇది బహుశా సాధన పదార్థం, మానవుడు (శరీరం, మనస్సు) అనేక రకాలను కలిగి ఉంటుంది – మానసిక, స్వభావ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక మొదలైన అనేక రకాల రోగులతో వ్యవహరించడం సహజం. ఒక అభ్యాసకుని విజయానికి దారితీసే అనేక అంశాలు పాత్ర పోషిస్తాయి. నేను ఈ అంశాలలో కొన్ని ముఖ్యమైన వాటితో వ్యవహరించడానికి ప్రయత్నిస్తాను. స్థలం, బహుముఖ ప్రజ్ఞ కోసం నేను పిడివాదం లేకుండా క్లుప్తంగా ఉంటాను.

**విజయవంతమైన ప్రాక్టీషనర్ ముందస్తు అవసరాలు:**

1) జ్ఞానము నిస్సందేహంగా ఎవరైనా సాధారణ అభ్యాసకునిగా ఉండాలనుకునే వారు ఏ నిపుణుడి కంటే బహుముఖ జ్ఞానాన్ని పొందాలి. ప్రతి శాఖలో నిపుణుడి జ్ఞానాన్ని పొందడం సాధ్యం కానప్పటికీ, ప్రాథమికమైనది.

ప్రతి శాఖలో జ్ఞానం ఖచ్చితంగా, ఖచ్చితమైనదిగా ఉండాలి. ప్రతి శాఖలో తగినంత అనుభవం సమానంగా అవసరం. లో నిపుణులను గమనించడం విలువ సంస్థ, సాధారణ ఆచరణలో సీనియర్ సహోద్యోగులు, అన్ని రకాల కేసులతో వ్యవహరిస్తారు ఎందుకంటే అప్రెంటిస్ కాలంలో వారితో వ్యవహరించడం సాధ్యం కాదు.

2) ప్రాక్టీషనర్ దృక్పథం తప్పనిసరిగా అతని జీవిత లక్ష్యం అనారోగ్యంతో బాధపడేవారితో వ్యవహరించడమే కాకుండా ప్రతి ఇతర

కార్యకలాపాలకు లోబడి ఈ వృత్తిని ఒక అభిరుచిగా లేదా సైడ్ బిజినెస్‌గా స్వీకరించలేని విధంగా ఉండాలి. అతను ఏదైనా (వినోదానికి సంబంధించిన అభిరుచి) కలిగి ఉండవచ్చు. కానీ సాధారణ అభ్యాసంతో ఇంటర్‌ఫేస్ చేయకూడదు.

3) ప్రాక్టీషనర్ సామాజిక స్థితి ప్రారంభంలో అతని ఖాతాదారులను పొందడంలో పాత్ర పోషిస్తుంది, సహజంగానే ప్రభావవంతమైన, సామాజికంగా మంచి స్థానంలో ఉన్న కుటుంబం నుండి వచ్చిన అనుభవం లేని వ్యక్తి త్వరలో గొప్ప వ్యక్తులకు పరిచయం అయ్యే అవకాశం ఉంది. కోర్సు అతని తరువాతి విజయం అక్కడ వారితో వ్యవహరించడంలో అతని సామర్థ్యం, నైపుణ్యంపై ఆధారపడి ఉంటుంది

4) రోగి పట్ల వైఖరి అనేది ఒక అభ్యాసకుని విజయాన్ని నిర్ణయించడంలో చాలా ముఖ్యమైన అంశం. అతని రోగులు మొదట మానవులు, తరువాత అనారోగ్యంతో ఉన్నారని తరువాతివారు గుర్తుంచుకోవడం మంచిది. కష్టాలు అన్ని వర్గాల ప్రజలకు ఒకే విధంగా ఉంటాయి, బహుశా తక్కువ స్థితిలో ఉన్నవారిలో ఎక్కువ మంది ఉంటారు, ఎందుకంటే బాగా శ్రద్ధ తీసుకోబడదు అనే భయం బాధలను మరింత తీవ్రతరం చేస్తుంది కాబట్టి ప్రతి రోగికి చికిత్స చేయడంలో మానవ, సున్నితమైన విధానం అవసరం.

5) సమాజం పట్ల బాధ్యత అనేది పూర్తిగా యాదృచ్ఛికంగా, అవకాశంతో ఒక వైద్యుడు అవుతాడు, దీని ప్రకారం వ్యవసాయం, గ్రామీణ కళలు, చేతివృత్తుల వంటి ఇతర వృత్తులకు భిన్నంగా ఎవరూ మధ్యస్థ వ్యక్తిగా జన్మించరు. మొదలైనవి, ఎక్కువగా వంశపారంపర్యంగా ఉంటాయి. వైద్య పురుషులు ప్రభుత్వానికి (అంటే) ప్రజలకు చాలా ఖర్చుతో తయారు చేస్తారు. కాబట్టి ఆయనకు సహజంగానే ప్రజల పట్ల ఒక బాధ్యత వచ్చింది

నాగరిక దేశాలలో వైద్యుడి సామాజిక స్థితి చాలా ఎక్కువగా ఉంటుంది. మనలో కూడా ఇది చాలా ఎక్కువగా ఉంది, ప్రతి అభ్యాసకుడు సమాజానికి తన విధులు, బాధ్యతల గురించి చాలా స్పృహ కలిగి ఉండాలి, వాటిని మనస్సాక్షిగా నిర్వర్తించాలి.

6) ప్రాక్టీషనర్ పాత్ర అతని కెరీర్‌ని ప్రభావితం చేస్తుంది పాత్ర సమగ్రత సహజంగానే రోగులలో విశ్వాసాన్ని జోడిస్తుంది, అభ్యాసకుడిలోని

దుర్గుణాలు ముఖ్యంగా గ్రామీణ, సెమీ–అర్బన్ ప్రాంతాలలో పెద్ద వర్గాల ప్రజలను దూరంగా ఉంచుతాయి. ఏదైనా రంగం తీవ్రమైన లేదా బాధ్యతాయుతమైన చర్య.

7) శరీరాకృతి, వ్యక్తిగత స్వరూపం సహజంగానే ప్రకృతి బహుమతులు. ఆకట్టుకునే వ్యక్తిత్వం ఒక ఖచ్చితమైన ప్రయోజనం అతని వ్యక్తిగత అలవాట్లు పరిశుభ్రత, ధర్మబద్ధమైన సరళత వంటివి అతని విజయాన్ని ప్రభావితం చేసే అంశాలు.

8) ఆర్ట్ ఆఫ్ డిటాచ్‌మెంట్ సర్ విలియం ఓస్లెర్ వైద్య వృత్తికి సలహా ఇచ్చినట్లుగా, ఈ శతాబ్దపు ప్రారంభంలోనే, ఒక వైద్యుడు ఆధునిక జీవితంలోని వివిధ విలాసాలు, మళ్లింపులను ఆస్వాదించలేడు, ఎందుకంటే అతని కాలానికి సంబంధించిన పిలుపులు చాలా అత్యవసరమైనవి, విభిన్నమైనవి. అతను కొన్ని విలాసాలను వదులుకోవడానికి సిద్ధంగా ఉండాలి

## II. సాధారణ ప్రవర్తన

1) ఉదార వైఖరి. మనుషులు మంచి మనసు కలిగి ఉంటారు. వైద్యుడు తన సేవలకు సమాజం చాలా గొప్పగా రివార్డ్ చేస్తుంది, ఈ సత్యాన్ని కొంతకాలం తర్వాత ఆచరణలో గ్రహించవచ్చు, దీనిని ద్రవ్య వేతనం మాత్రమే పరిగణించవచ్చు, ఈ సత్యాన్ని గ్రహించలేరు, అతను ఎక్కడికి వెళ్లినా కృతజ్ఞతలు తెలిపే వ్యక్తులను చూస్తాడు. మార్గాల సంఖ్య. కొంతమంది వ్యక్తులు అనుకోకుండా ప్రవర్తిస్తే, అతను దానిని హృదయపూర్వకంగా తీసుకోకుండా తన ఉదారవాద, దాతృత్వ వైఖరిని కొనసాగించాలి.

2) సమయపాలన, లభ్యత క్లినిక్‌లో లేదా ఇంట్లో రోగి శారీరక బాధలతో పాటు ఆందోళనను పెంచే వరకు వేచి ఉండే వైద్యం కంటే మరే ఇతర వృత్తికి ఎక్కువ సమయపాలన అవసరం లేదు. వైద్యుడు ఏదైనా అత్యవసర పరిస్థితికి హాజరవుతున్నట్లయితే, రోగి తన అవకాశాన్ని దాచడానికి పట్టించుకోడు. అయినప్పటికీ, సామాజిక క్లబ్‌లు లేదా కాల్‌లలో డాక్టర్ ఆలస్యం చేయడంతో అతను తిరిగి రాలేదు.

వైద్యుడు ఎల్లప్పుడూ క్లినిక్‌లో లేదా ఇంట్లో అందుబాటులో ఉండాలి, అతను కొంత సమయం పాటు దూరంగా ఉండవలసి వస్తే, అతను సమాచారాన్ని వదిలివేయాలి. కేసు తీవ్రతతో సంబంధం లేకుండా అతని పారితోషికంతో సంబంధం లేకుండా వృత్తిపరమైన కాల్‌ని తిరస్కరించడం వైద్యుడు చాలా కష్టం.

3) ప్రాపంచిక జ్ఞానం: రోగులు వివిధ వృత్తికి చెందినవారు, వారి సందర్శనల సమయంలో వారి వృత్తుల గురించి కొంత సమాచారాన్ని పోయడం వలన ప్రతి ఇతర వృత్తిలో ఏదైనా నేర్చుకోవడానికి వైద్య వృత్తి గొప్ప అవకాశాలను అందిస్తుంది. లక్షణాలు అంటే మానసికమైనా లేదా శారీరకమైనా, రోగికి ఒకే ఒక ప్రయోజనం లభిస్తుంది, అంటే అతని బాధల ఉపశమనం.

ప్రాక్టీషనర్ అతని నుండి అనేక ప్రయోజనాలను పొందుతాడు, వ్యాధి ప్రక్రియను ప్రభావితం చేసే వివిధ కారకాల గురించి వేతన అనుభవ జ్ఞానం వంటి అనేక ప్రయోజనాలను పొందుతాడు. నిజానికి నా ఉపాధ్యాయుల్లో ఒకరు పేషెంట్‌కు చెల్లించాల్సిన బాధ్యత ఎక్కువగా ఉందని చెప్పేవారు, అతనికి ట్రాకియోటమీ చేసే మొదటి అవకాశం ఎవరు ఇచ్చారు.

4) సహోద్యోగుల మధ్య సంబంధాలు ఇద్దరు అభ్యాసకులు చాలా అరుదుగా బాగానే ఉంటారు, ముఖ్యంగా వారిద్దరూ విజయవంతం అయినప్పుడు. ఇలాంటి రాష్ట్రం మన దేశంలో, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో ఉండడం దురదృష్టకరం. అభ్యాసకుల మధ్య చాలా అసహ్యకరమైన పోటీలు రోగులు ఇచ్చిన సమాచారంపై ఆధారపడి ఉంటాయి, ఇది అన్ని సంభావ్యతలోనూ తప్పు.

ఏదైనా గాయం లేదా అవమానానికి తీవ్రంగా ప్రతిస్పందించడం అనేది ఒక ప్రాథమిక ప్రవృత్తి, బదులుగా, మరింత సూటిగా చెప్పాలంటే, జంతు ప్రవృత్తి. అన్ని రకాల మానవులతో వ్యవహరించే వృత్తికి చెందిన వైద్యుడు అటువంటి ప్రాథమిక ప్రవృత్తులపై సంయమనాన్ని పెంపొందించుకోవాలి. ప్రతిచర్య ప్రాథమిక ప్రవృత్తికి లొంగిపోవడం మన విద్య, సంస్కృతికి అనర్థం. కొంచెం ఆత్మపరిశీలన చేసుకుంటే అది తనకు, ఇతరులకు ఎంత హానికరమో అర్థం చేసుకోవచ్చు. అంతిమంగా ఇది ఇద్దరికీ హానికరం అని నిరూపిస్తుంది, వారి గౌరవం, గౌరవాన్ని ప్రతిబింబిస్తుంది.

## క్షేత్ర లక్ష్మి

మినుపట్టి నలుదెసల్ మెఱసిపోయినగాని
కనుజెప్పగొట్టడా కర్మయోగి
మండు వేసవి నిప్పు చెందుచుండినగాని
కాయమ్ము దాపడా కష్టజీవి
ఆరుగాలము లేమిదై కృశించిన గాని
పడిపంచ ద్రొక్కడా భాగ్యశాలి
చుట్టపక్కా బిల్లు చూఱగొన్నను గాని
తనను దానెఱుగదా ధర్మరాజు

విశ్వమాదమరచి విషమిచ్చు చున్నను
దోసిలొగ్గి కనులు మూసినాడు
వెనుక ముద్దు లేని మనవంటి వారల
వెంతమంది నుద్ధరింప గలడో!
బట్టతడుపు జల్లు పని కుంపు గావించె
గోంద్రమేర దున్నుకొనెడి వాడే?
తడపచుట్టి మేడి తలకిందులై పోయె
అబ్బుమోప కద్దు లంకె వేసి

**–ఏటుకూరి వెంకట నరసయ్య**



# డాక్టర్ పేషెంట్ సంబంధం
# నైతికతను ప్రోత్సహించాల్సిన అవసరం

డాక్టర్ కె వాసుదేవరావు
NRI Medical College

ప్రపంచంలోని అన్ని వృత్తులలో, వైద్యం ఉత్పత్తి ఎల్లప్పుడూ చాలా గౌరవంగా ఉంటుంది. ప్రాచీన కాలం నుండి, వైద్య పురుషులు, మహిళలు అనారోగ్యం ప్రభావాలను తగ్గించడానికి లేదా నయం చేయడానికి నివారణలు, ఆపరేషన్లతో ముందుకు వచ్చారు, ఆరోగ్యం, దీర్ఘాయువును పెంపొందించడంలో వారి సహకారం శతాబ్దాలుగా అసాధారణమైనది. ఇది R.L. స్టీవెన్సన్ వంటి వ్రాతపూర్వకంగా "డాక్టర్ మన నాగరికత పుష్పం" అని వ్యాఖ్యానించడానికి ప్రేరేపించింది.

ఆరోగ్య సంరక్షణ డెలివరీలో ఒక ముఖ్యమైన ప్రాంతం "డాక్టర్–రోగి సంబంధం" ఇది తగ్గుముఖం పడుతుందని చెప్పడానికి ఇటీవలి కాలంలో పుష్కలంగా వ్యాఖ్యలు చేస్తున్నారు. సమస్యను చాలా వివరంగా అధ్యయనం చేసిన కొందరు అధికారులు అవసరమైన పరిష్కారాలను కూడా సూచించారు.

1951లో గుంటూరులో తమ 'పీపుల్స్ నర్సింగ్ హోమ్' స్థాపించిన డాక్టర్ సదాశివ రావు, డాక్టర్ జయప్రదాంబ గుంటూరు జిల్లా, పొరుగు ప్రాంతాల ప్రజలకు మార్గదర్శక సేవలందించారు. వారి సహాయం కోరిన రోగులందరికీ వారు అత్యుత్తమ శ్రద్ధ, సంరక్షణను అందించారు. వారు ఎల్లప్పుడూ లో ఉంచుతారు.

డాక్టర్ సదాశివ రావు గారికి వారు అందించిన విలువ, నైతికత కారణంగా గొప్ప గౌరవం "ఎలా విజయవంతమైన జనరల్ ప్రాక్టీషనర్గా మారాలి II అనే అంశంపై ఒక అద్భుతమైన సులువుగా వ్రాశారు. సమాజం ఈ సులభమైనది నేడు మరింత ఔచిత్యాన్ని కలిగి ఉంది.డాక్టర్–పేషెంట్

సంబంధానికి సంబంధించిన కొన్ని సమస్యలను, నైతికతను ప్రోత్సహించాల్సిన అనివార్యమైన అవసరాన్ని పరిశీలిద్దాం.

వైద్యం ఒక కళగా ఉండేది. అనేక శతాబ్దాల పాటు సుశ్రుత చరకా, హిప్పోక్రేట్స్, గాలెన్, పారాసెల్సస్, అవిసెన్నా ఈ కళను పరిపూర్ణం చేశారు, వైద్యం చేసే కళ అనేక తరాల వోటర్లకు శిక్షణ ఇచ్చారు, తర్వాత వైద్యం 17వ శతాబ్దం చివరలో, 18వ శతాబ్దం ప్రారంభంలో హార్వేలో ఒక శాస్త్రంగా రూపాంతరం చెందింది. పికరింగ్. పాశ్చర్, క్లాడ్ బెర్నార్డ్ ఔషధం శాస్త్రీయ అంశాలకు బలమైన పునాదులు వేశారు. "కారణం, ప్రభావం ఫ్రాన్సిస్ బేకన్ నోవమ్ ఆర్గానమ్ ఒక మార్గదర్శక కాంతి. భౌతికశాస్త్రం, రసాయన శాస్త్రం పురోగతి ఔషధం ఒక అనుభావిక క్రాఫ్ట్ నుండి శాస్త్రీయ క్రమశిక్షణగా మార్చుకోవడానికి సహాయపడింది, కొలతకు ప్రాముఖ్యత ఇవ్వబడింది, వైద్యులు ఉష్ణోగ్రత, పల్స్‌ను కొలవడం ప్రారంభించారు. రేటు, రక్తపోటు, రక్తంలో గ్లూకోజ్ మొదలైనవి.

1950ల ప్రారంభంలో వైద్యం ఒక సాంకేతికతగా మారింది కాబట్టి, ఎలక్ట్రో కార్డియోగ్రఫీ గుండె–ఊపిరితిత్తుల ఔషధం, కృత్రిమ మూత్రపిండము, EEG, auloanalysers రేడియేషన్ థెరపీ గణనీయమైన విప్లవానికి నాంది పలికాయి క్రమంగా అవయవ మార్పిడి అనేది ఒక సాధారణ సంఘటనగా మారింది. ఇమేజింగ్ అల్ట్రాసోనోగ్రఫీ, CT, MRI, DSA, PET, థాలియం స్కాన్‌ల ద్వారా ఆసుపత్రుల వైద్య దృశ్యాన్ని పూర్తిగా మార్చివేసింది. CABG, స్టీరియోటాక్టిక్ సర్జరీ, లాపరోస్కోపిక్ ప్రక్రియలు, జాయింట్ రీప్లేస్‌మెంట్‌లు, ఇతర అనేక నవల శస్త్రచికిత్సలు మెడిసిన్‌ని ఇంజనీరింగ్‌లో ఒక శాఖగా మార్చేశాయి. 20వ శతాబ్దపు చివరి త్రైమాసికం (1975 నుండి 2000 వరకు) మరొక ముఖ్యమైన పరివర్తనకు సాక్ష్యంగా ఉంది. వైద్యం వ్యాపారంగా మారింది. ప్రపంచవ్యాప్తంగా హెల్త్ కేర్ డెలివరీ సిస్టమ్, 'ఫీ ఫర్ సర్వీస్', 'కాస్ట్ ఎఫెక్టివ్‌నెస్', 'మెడికల్ ఎకనామిక్స్', 'హెల్త్ ఇన్సూరెన్స్', 'కార్పొరేట్ హెల్త్ సెక్టార్', 'ప్రైవేట్ ఎంటర్‌ప్రైజ్', 'పబ్లిక్ ప్రైవేట్ పార్టనర్‌షిప్'కి అత్యంత ప్రాధాన్యత ఇవ్వడం ప్రారంభించింది., 'అమాల్గమేషన్స్', 'టేక్ ఓవర్', –వ్యాపారం, వాణిజ్యానికి అవసరమైన అన్ని కందెనలు. మార్కెట్ ప్లేస్ ఈ పరిభాష 1970కి ముందు వినబడలేదు. MBA సంస్కృతి ఆరోగ్య సంరక్షణపై తన స్థావరాలను విస్తరించింది.

మునుపటి పరివర్తన మానవజాతిపై కొన్ని ప్రయోజనాలను కలిగి ఉంది, అదే విధంగా, అవి చాలా పెద్ద హానిని కలిగించాయి. మునుపటి రూపాంతరాలు మానవజాతికి కొన్ని ప్రయోజనాలను అందించడంలో సందేహం లేదు. డాక్టర్, రోగి మధ్య సంబంధం వ్యక్తిత్వం లేకుండా మారింది. వైద్యుడు కేవలం పరిశోధకుడిగా లేదా ప్రిస్క్రిప్టర్‌గా లేదా ఆపరేటర్‌గా గుర్తించబడ్డాడు, వినియోగదారువాదం ఆరోగ్య రంగంలోకి ప్రవేశించింది, మానవతా విలువలు క్రమంగా క్షీణించబడుతున్నాయి, విస్తృతంగా చెప్పాలంటే రోగులు తమ వైద్యులు మూడు లక్షణాలను ప్రాసెస్ చేస్తారని అంచనా వేస్తారు.

1 సామర్థ్యం 2. అనుకూలత 3. లభ్యత.

వైద్యవిధానంలో ఈ మూడూ విశిష్టమైన పాత్రను పోషిస్తున్నాయి, అధిక స్పెషలైజేషన్, హైటెక్ మెడిసిన్ ఈ రోజుల్లో సామర్థ్యం లక్షణం' ప్రశంసనీయ స్థాయిలో ఉంది. కానీ మిగిలిన రెండు ఒకటి అంటే స్నేహం, లభ్యత లేదా ఎక్కువ శాతం వైద్యులు లేకపోవడం. ఇది చాలా గొప్ప విషయం, వైద్యుడు రోగి బంధం నుండి ఉద్భవించిన అనారోగ్యంపై హిప్పోక్రేట్స్ తీవ్ర ప్రభావాన్ని గుర్తించాడు. "కొంతమంది రోగులు తమ పరిస్థితి ప్రమాదకరంగా ఉందని స్పృహలో ఉన్నప్పటికీ, వైద్యుని మంచితనంతో సంతృప్తి చెందడం ద్వారా వారి ఆరోగ్యాన్ని పునరుద్ధరించుకుంటారు

ఆదర్శ వైద్యుడు అంటే ఆదర్శ సంభాషణకర్త. పదాలు మందు అంత శక్తివంతమైనవి పదాలకు రెండు రకాల శక్తి ఉంటుందని గ్రహించాలి

1. వైద్యం చేసే శక్తి
2. ప్రాణాంతక శక్తి

వైద్యుని మాట శరీర క్రియల అంతరంగాన్ని ప్రభావితం చేస్తుంది. ఇది ఉత్తమ చికిత్సా సాధనం. బెన్సన్, బ్రాడ్, నార్మన్ కజిన్స్ నిర్వహించిన అనేక శాస్త్రీయ అధ్యయనాలు ఈ పరిశీలనకు మద్దతునిచ్చాయి. రోగనిర్ధారణ, రోగ నిరూపణకు సంబంధించిన కొన్ని పదాలు వ్యాయామం, ఫలితంపై ప్రతికూల ప్రభావం చూపుతాయి. కొన్నిసార్లు రోగి అనారోగ్యం వైద్యుని దుర్మార్గపు ఉచ్చారణల ద్వారా తీవ్రమవుతుంది. నైపుణ్యం కలిగిన కమ్యూనికేటర్ శారీరక బాధల భయాందోళనలను, కోలాహలాన్ని నిరోధించవచ్చు.

మైలురాయి శీర్షికలో "ది వరల్డ్ యాస్ ఎ ఫిజియోలాజికల్ అండ్ థెరప్యూటిక్ ఫ్యాక్టర్ (1959). ప్లాటోనోవ్ కొన్ని వ్యాఖ్యలు చేశాడు, ఇది రాబోయే కాలమంతా నిజం అవుతుంది "రోగి అధిక నాడీ కార్యకలాపాల వ్యవస్థలో ఉత్పన్నమయ్యే ప్రతిచర్య స్వభావం పెద్ద కొలతపై ఆధారపడి ఉంటుంది. ఖచ్చితంగా వైద్యుడిపైనే అంటూ కొనసాగించాడు.

"వైద్యుని వ్యక్తిత్వం రోగుల పట్ల అతని మర్యాద. అతని స్వరం, అతని భావోద్వేగ స్థితి, ఇది అతను తన రోగుల పట్ల ప్రవర్తనను నిర్ణయిస్తుంది లేదా చాలా బలమైన, ముఖ్యమైన ఉద్దీపనల అన్ని సముదాయాలను చాలా శక్తివంతమైన, ముఖ్యంగా భావోద్వేగ ప్రతిచర్యలను రేకెత్తిస్తుంది. రోగి వ్యవస్థ నార్మన్ కజిన్స్ తన క్లాసిక్ పుస్తకం "ది హీలింగ్ హార్ట్"లో చాలా ఓపికగా వ్యాఖ్యలు చేసారు, ఇది వైద్యులందరూ ఆత్మపరిశీలనలో మునిగిపోయేలా చేస్తుంది, అతని ప్రకారం, రోగులకు అవసరమైన స్వచ్ఛమైన వైద్య సామర్థ్యం వెనుక లక్షణాలు ఉన్నాయి, వారి వైద్యులలో వారు కోరుకునే భరోసాను వారు కోరుకుంటారు. చూసుకున్నారు, కేవలం చూసారు కాదు. వారు చెప్పేది వినాలని వారు కోరుకుంటారు,

వారు వైద్యుల ఆలోచనలలో ఉన్నారని వారు భావించాలని కోరుకుంటారు, సంక్షిప్తంగా, రోగులు లేదా భావోద్వేగ అవసరాల వ్యర్థాల సేకరణ ఆ భావోద్వేగ అవసరాల పరంగా ఎక్కువ ఆఫర్‌ను కలిగి ఉన్న వైద్యుడు ఇది వ్యక్తి వైద్యుడు, వైద్యుని ఉనికి – వైద్యుడు వైద్యం కోసం వాతావరణాన్ని సృష్టించే దానికంటే ఎక్కువగా, తరచుగా చేసే దానికంటే ఎక్కువ, వైద్యుడు పునరుద్ధరణకు పూర్తి స్టాప్‌ను సూచిస్తాడు వైద్యుడు లైఫ్‌లైన్‌ని కలిగి ఉంటాడు. వైద్యుడి మాటలు, అతను ప్రిస్క్రిప్షన్‌లు మాత్రమే కాదు ఆ లైఫ్ లైన్ కు జోడించబడింది.

రోగితో డాక్టర్ గడిపిన సమయం, డాక్టర్ రోగి సంబంధంపై ముఖ్యమైన ప్రభావం చూపుతుంది, శారీరక పరీక్ష, పురోగతిని సమీక్షించడం, చేసిన విధానాలు, డిశ్చార్జ్‌లో క్రియాశీలంగా ఉన్న చరిత్రను హ్యారీలో పూర్తి చేయకూడదు. ఈ కార్యకలాపాలకు తగిన సమయం కేటాయించడం వలన మంచి వైద్యుడు–రోగి సంబంధాన్ని సానుకూలంగా ప్రోత్సహిస్తుంది, పోస్ట్–ఆపరేటివ్ కేర్ ICU, CCU వంటి ఎంపిక చేసిన ప్రాంతాలలో వైద్యుడు గడిపిన సమయం ప్రయోజనకరమైన ప్రభావాన్ని కలిగి ఉంటుంది., ఆపరేషన్ చేసిన రోగుల పురోగతిని అంచనా వేయండి

కుటుంబ వైద్యులు దాదాపు అంతరించిపోయారు. కుటుంబ ఆచరణలో ఎల్లప్పుడూ మరింత పరస్పర చర్య, మరింత వ్యక్తిగత అనుబంధం ఉంటుంది. కుటుంబ అభ్యాసాన్ని పునరుద్ధరించాల్సిన అవసరం ఎంతో ఉంది కుటుంబ సాధనలో పోస్ట్ గ్రాడ్యుయేట్ కోర్సులు ప్రారంభించాలి. అన్ని, అనేక ఫిర్యాదుల కోసం బహుళ రిఫరల్‌ల అభ్యాసం రోగులను వారి వైద్యుల నుండి దూరం చేస్తోంది.

ఈ పుస్తకంలో "ది హార్స్ అండ్ బగ్గీ డాక్టర్, డాక్టర్ ఆర్థర్ హెర్జియర్ డాక్టర్, అతని రోగుల మధ్య ఉన్న బంధాన్ని తీవ్రంగా వివరించాడు. రోగి భుజంపై ఉన్న వైద్యుని చేయి మంచితో చీకటికి ఆశ్రయం.

శాస్త్రీయ శిక్షణ, ఆధునిక పద్ధతుల సరైన అన్వయంతో కుటుంబ వైద్యుడు మీ విస్తృతమైన వ్యాధులను ఎదుర్కోగలడు – ఇన్ఫెక్షన్ నుండి ఇన్ఫెక్షన్ వరకు, మలబద్ధకం నుండి కంకషన్ వరకు ర్యాగింగ్ వరకు కనీస మొత్తంలో గరిష్ట ఆరోగ్య సంరక్షణ అందించబడుతుందని గుర్తించడం చాలా అవసరం. ఔషధం వైద్యులు ఈ అంశంలో విస్తృత ఎంపిక, వివరణను కలిగి ఉన్నారు. ప్రిస్క్రిప్షన్ A4 పేజీకి విస్తరించడం పరిపాటిగా మారింది. చాలా సార్లు రోగి మోతాదు, అడ్మినిస్ట్రేషన్ సమయంలో గందరగోళంలో పడిపోతాడు, అతను లేదా ఆమెకు మందుల సరైన ఉపయోగాల గురించి డాక్టర్తో చర్చించడానికి తక్కువ సమయం లభిస్తుంది.

ఆహారం విషయంలో రోగికి ఇవ్వాల్సిన సలహాలను వైద్యులు పెద్దగా పట్టించుకోరు, సంపూర్ణ వ్యాఖ్యలు రోగికి ఏ విషయంలోనూ సహాయం చేయవు పోషకాహార పరిశోధనలు డిన్నర్ ప్లేట్‌ను చాలా అరుదుగా పరిశోధిస్తాయి, ఫలితంగా ఆహారాన్ని ఔషధంగా ఎలా ఉపయోగించాలో ప్రజలకు తెలియదు. వారు 1915 నాటికే మాయో క్లినిక్ వ్యవస్థాపకుడు చార్లెస్ మాయో ఇలా అన్నారు. "రోగాలకు సాధారణ

ప్రతిఘటన ఎప్పుడూ మాత్రల పెట్టెల నుండి రాదు. తగిన ఆహారం అనేది సాధారణ ప్రతిఘటన ఊయల, సాధారణ రోగనిరోధక శక్తి ప్లేగ్రౌండ్, మంచి ఆరోగ్యం వర్క్‌షాప్, దీర్ఘాయువు ప్రయోగశాల" టమోటా, అరటి, ఉల్లిపాయ, వెల్లుల్లి, పసుపు, అల్లం ఉపయోగాలు చాలా ఆరోగ్య ప్రయోజనాలను అందిస్తాయని చూపించడానికి ఈ రోజుల్లో చాలా సాక్ష్యాలు ఉన్నాయి, వైద్య వృత్తుల సభ్యులు ఈ విషయాలపై చాలా తక్కువ శ్రద్ధ చూపుతారు. కనీస ఖర్చుతో గరిష్ట ఆరోగ్య సంరక్షణను అందించవచ్చని గ్రహించడం కూడా చాలా ముఖ్యం. వైద్యులు ఏదైనా ఔషధాన్ని సూచించే ముందు లేదా పరిశోధనను సూచించే ముందు రోగి ఆర్థిక సామర్థ్యం గురించి జాగ్రత్తగా ఆలోచించాలి.

ప్రపంచ ప్రఖ్యాత కార్డియాక్ సర్జన్ అయిన డెంటన్ A. కూలీ వార్డులలో, "డాక్టర్ స్వయంగా ఇన్వెంటరీని తీసుకోవాలి, రోగుల పరిస్థితిలో తనను తాను ప్రొజెక్ట్ చేసుకోవడానికి ప్రయత్నించాలి సాధారణ రోజువారీ మర్యాద, దయ చాలా చిన్న గొడవలు లేదా అపార్థాలను నివారిస్తుంది. పేల్చివేయండి లేదా దావా వేయండి. డాక్టర్ మరింత మానవుడిగా కాకుండా మరింత మానవత్వంతో, మరింత దయగల, మరింత ఓపికగా, తక్కువ ఆకస్మికంగా మారాలి.

ప్రతి వైద్యుడికి మంచి జ్ఞాపకశక్తి ఉండాలి. డాక్టర్ చిరునవ్వుతో ధరించాలి, మీరు ఎల్లప్పుడూ పేషెంట్‌ని పేరుతో సంబోధించాలి. ప్రతి వైద్యుడు కొన్ని సూత్రాలను పాటించాలని సాగర్ ధన్వంతరి పట్టుబట్టారు అవి "సుచిమాన్', 'ధృతిమాన్', 'కృతిమాన్', 'స్మృతిమాన్' ప్రతి వైద్యుడు మంచి వైద్య రికార్డులను నిర్వహించడం తప్పనిసరి. ఇది సమయం తీసుకుంటుంది, ఖరీదైనది కావచ్చు.

కానీ రికార్డులు అసాధారణంగా ఉపయోగకరంగా ఉంటాయి, మంచి రికార్డును నిర్వహించినట్లయితే, పరిశోధన నకిలీని నివారించవచ్చు డాక్టర్ సమయానుగుణంగా డేటా కంప్యూటరైజేషన్ ఆరోగ్య సంరక్షణలో ముఖ్యమైన భాగం.

వృద్ధులకు, శారీరక వైకల్యం ఉన్నవారికి వైద్యులు హృదయాల్లో ప్రత్యేక స్థానం కల్పించాలి. కొన్ని వర్గాల ప్రజలపై శ్రద్ధ, కనికరంతో వ్యాయామం చేస్తే వైద్యులు తమకు తాముగా మంచి అభిప్రాయం కలిగి ఉంటారు. రైతులు, విద్యార్థులు, ఉపాధ్యాయులు మొదలైన సమూహాల పట్ల దయతో, శ్రద్ధగా వ్యవహరించడం ద్వారా తన ఊహను ఎలా ప్రదర్శించాలో వ్యక్తిగత వైద్యుడు నిర్ణయించుకోవాలి, సైన్స్, కళల సంతోషకరమైన సమ్మేళనం అద్భుతాలు చేస్తుందని వైద్యులు గుర్తుంచుకోవాలి. అంతిమంగా, మానవుని ఆత్మ పట్ల వైద్యుని గౌరవమే అతని సైన్స్ విలువను నిర్ణయిస్తుంది కరుణ, వైజ్ఞానిక నైపుణ్యం, మానవతావాదం, "జీవితం పట్ల గౌరవం" ప్రపంచంలోని అన్ని వైద్య పురుషులు, స్త్రీల లక్ష్యాలుగా ఉండాలి.

## వీరగంధము

వీరగంధము దెచ్చినారము
వీరుడెవ్వడొ దెల్పుదీ!
పూసి పోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో!!
తెలుగుబావుట కన్ను చెదరంగ
కొండవీటను నెగిరినప్పుడు
తెలుగువారల కత్తిదెబ్బలు
గండికోటను గాంచినప్పుడు
తెలుగువారల వేడినెత్తురు
తుంగభద్రను కలిసినప్పుడు
దూరమందున నున్న సహ్యజ
కత్తినెత్తురు కడిగినప్పుడు

ఇట్టి సందియ మెన్నడేనియు
బుట్టలేదు రవంతయున్
ఇట్టి ప్రశ్నల నడుగువారలు
లేకపోయిరి సుంతయున్
నడుముగట్టిన తెలుగుబాలుడు
వెనుక తిరుగం డెన్నడున్
బాసయిచ్చిన తెలుగుబాలుడు
పాఱిపోవం డెన్నడున్
ఇదిగో! యున్నది వీరగంధము
మైనలందుము మైనలందుము
శాంతిపర్వము జదువవచ్చును
శాంతిసమరం బైనపిమ్మట

**–'కవిరాజు' త్రిపురనేని రామస్వామి చౌదరి**



# నా ఉపాధ్యాయులుగా నా తల్లిదండ్రులు

డా. రామబాల

మా చదువులు లేదా హోంవర్క్‌లో సహాయం చేయడానికి నా తల్లిదండ్రులు నాతో కూర్చున్నట్లు నాకు గుర్తు లేదు.

అదే సమయంలో, వారు నాకు బోధించని క్షణం నాకు గుర్తు లేదు.

ఏదో ఒకటి!

వారు మాకు మాటలు లేదా చేతల ద్వారా కాకుండా ఉదాహరణ ద్వారా బోధించినందున ఇది పారడాక్స్ కాదు.

కలిసి భోజనం చేస్తూ కూర్చోవడం లేదా కారులో ఎక్కడికో ప్రయాణం చేయడం విద్యాపరమైనది.

మా నాన్నగారు ఎప్పుడూ మమ్మల్ని ప్రశ్నలు లేదా సమస్యలు వేస్తూ సమాధానమివ్వమని అడిగారు, అదే ఆయన బోధనా విధానం. గుర్తుంచుకోవడం ద్వారా మీరు ఏమి నేర్చుకున్నారో, మీరు తర్వాత మర్చిపోవచ్చు. మీరు ఆలోచించినది, సమాధానం వచ్చినది మీ అభ్యాసంలో భాగమవుతుంది.

మా అమ్మ మాకు గొప్ప వ్యక్తుల కథలు, ముఖ్యంగా దేశభక్తి, వీరత్వపు కథలు చెప్పేది. ఆమె తన సొంత వీరోచిత పనులను ఎప్పుడూ ప్రస్తావించలేదు. మేము వాటిని ఇతరుల నుండి నేర్చుకున్నాము, ప్రధానంగా ఆమె మరణం తర్వాత.

ఉదాహరణకు, ఆమె గాంధీ ఉద్యమంలో చురుకుగా ఉన్నారు. కానీ, కమ్యూనిస్టు ఉద్యమం ఉవ్వెత్తున ఎగిసిపడుతున్న సమయంలో, వామపక్ష భావజాలం ఉన్న ప్రతి యువకుడు వేటాడబడ్డాడు; ఆమె పుట్టిన గ్రామాలు, సమీపంలోని యువకులందరినీ సైన్యం లక్ష్యంగా చేసుకుంది. వారిని బయటకు లాగారు.

వారి ఇళ్లను అవమానించారు, హింసించారు. మిలిటరీ వచ్చి అబ్బాయిలు అటకపై దాక్కున్నప్పుడు నా తల్లి ఒక బంధువు ఇంటికి వెళ్లడం జరిగింది. మిలిటరీ తలుపు తట్టినప్పుడు, మా అమ్మ ధైర్యంగా బయటికి వచ్చి వారికి ఇంగ్లీషులో (ఆ రోజుల్లో ఇంగ్లీషులో మాట్లాడటం ఒక మహిళ అరుదైన ఘనత) అని చెప్పింది, ఇంట్లో మహిళలు మాత్రమే ఉన్నారని మిలటరీ ఆకట్టుకుంది. ఆమె జీవితంలో అబద్ధం చెప్పింది బహుశా అదే.

ఆమె తల్లి శ్రీమతి తులసమ్మ కూడా అంతే ధైర్యం. చెన్నైలో అండర్‌గ్రౌండ్‌లో ఉన్న కమ్యూనిస్టు నేతలకు ఆమె ఆహారం తీసుకువెళ్లేవారు. పోలీసులు ఆమెను అడ్డుకోవడంతో.. ఆస్పత్రిలో ఉన్న తన కుమారుడికి ఆహారం తీసుకెళ్తున్నానని వివరించింది.

మా చిన్నతనంలో, మా నాన్నగారు ఉబ్బసంతో చాలా అనారోగ్యంతో, దాదాపు నెల రోజులు మంచం పట్టినప్పుడు కూడా, మా అమ్మ ఆశ, హృదయాన్ని కోల్పోకుండా అతనిని, అభ్యాసాన్ని కొనసాగించింది. ఆమె నిజమైన స్థితప్రజ్ఞ'

ఇతర పట్టణాలకు ప్రయాణిస్తున్నప్పుడు, మా నాన్న పంటలు, చెట్లను గుర్తించమని, స్థానిక ఆర్థిక వ్యవస్థ, జీవనోపాధికి అవి ఎలా ముఖ్యమో వివరించమని అడిగేవాడు. సాగునీటి ప్రాజెక్టులు అభివృద్ధి చెందకముందు జీవితం ఎలా ఉండేదో చెప్పారు. అతను సర్ ఆర్థర్ కాటన్‌కు గొప్ప ఆరాధకుడు.

స్వాతంత్ర్యం కోసం పోరాడి, తమ సమయాన్ని, డబ్బును త్యాగం చేసి తమ గ్రామాలను బాగుచేసుకున్న గ్రామాల ప్రజల గురించి వారిద్దరూ మాకు చెప్పేవారు. ఆ రోజుల్లో ముఖ్యంగా బాలికలకు విద్య అనేది ఒక ప్రత్యేక హక్కు అని, అది ఒక అర్హత కాదని వారు ఎత్తిచూపారు. మన గ్రామాల్లో కనీసం దార్శనికులైన కొందరు పెద్దలు ఇచ్చిన వరం. ఉదాహరణకు తురుమెళ్ల వెంటనే గుర్తుకు వస్తుంది.

చదువుకునే రోజుల్లో, నేను పరీక్షల్లో బాగా స్కోర్ చేయనప్పుడు వారు నన్ను తిట్టినట్లు నాకు గుర్తు లేదు. కానీ నేను ఎక్కువ స్కోర్ చేసినప్పుడు, నేను ఎలా మెరుగ్గా రాణించగలనని మా నాన్న నన్ను ఆలోచింపజేస్తారు, అది నన్ను తదుపరిసారి ఉన్నత గ్రేడ్‌ల కోసం ఆకాంక్షించేలా చేసింది.

నేను స్టేట్ ఎగ్జామ్స్‌లో బాగా రాణించినప్పుడు వారు ఎప్పుడూ బహుమతులు లేదా ట్రీట్‌లు ఇవ్వలేదు, నేను నా చివరి పాఠశాల పరీక్షలో (XII తరగతి) టాప్ ర్యాంక్ సాధించినప్పుడు వారి గర్వాన్ని చూసి తగినంత ప్రతిఫలం లభించింది.

ఆ సమయంలో IITలు, BITS వెలుపల అందుబాటులో లేని స్వచ్ఛమైన శాస్త్రాలు, కంప్యూటర్ సైన్సెస్ కూడా చేయడానికి నేను సిద్ధంగా ఉన్నాను. నా తల్లి నాకు వైద్యం చేయమని ఉద్బోధించింది, ఇది గొప్ప వృత్తి కాబట్టి తోబుట్టువులందరూ కలిసి పనిచేసే మల్టీస్పెషాలిటీ స్పెషాలిటీ హాస్పిటల్ ఆసుపత్రిని కలిగి ఉండాలనే తన కలను వ్యక్తం చేసింది.

మహిళలకు మెడిసిన్, టీచింగ్ మాత్రమే వృత్తులు అని నాన్న వివరించారు. ఇతర శాఖల కఠినతలను శారీరకంగా తట్టుకోలేని మహిళలకు కూడా కంప్యూటర్లు, ఎలక్ట్రానిక్స్ సమానంగా నిర్వహించగలవని నేను అతనితో వాదించినప్పటికీ ఇంజనీరింగ్. చివరికి యుద్ధంలో ఓడిపోయాను

అయితే, COVID మహమ్మారి సమయంలో అతని మాటలు నాకు తిరిగి వచ్చాయి, ఎందుకంటే ఉద్యోగ అభద్రత వల్ల ప్రభావితం కాని వృత్తులు ఈ రెండు వృత్తులు, ఆహార ఉత్పత్తిదారులు మాత్రమే!

మెడికల్ చదివే సమయంలో, నాకు క్లాసులు లేనప్పుడల్లా వెళ్లి తనతో కలిసి పని చేయమని ప్రోత్సహించేవారు. దీని ద్వారా, అనాటమీ నిర్మాణాలు ఫార్మాలినైజ్డ్ మాంసం పీచు స్టాండ్‌లు కాదని నేను చాలా నేర్చుకున్నాను, అయితే రోగికి ఏ వ్యాధి ఉందో మాత్రమే కాకుండా రోగికి ఎలాంటి వ్యాధి ఉందో చూడమని ఓస్లర్ చెప్పినట్లుగా గౌరవంగా చికిత్స చేయాల్సిన అవసరం ఉంది. వ్యాధి.

అతను MS గ్రాడ్యుయేట్లు తనతో నేర్చుకునేందుకు పనిచేస్తున్నప్పటికీ అతను నన్ను శస్త్రచికిత్సలో సహాయం చేసేవాడు. అతను వారితో శస్త్రచికిత్స క్లిష్టమైన భాగాన్ని నిర్వహించి, నా సహాయంతో మూసివేయడం మొదలైన సాధారణ భాగాన్ని పూర్తి చేయమని వారిని కోరాడు.

శస్త్రచికిత్స చేస్తున్నప్పుడు, అతను శస్త్రచికిత్స చరిత్ర గురించి సాధారణ ప్రశ్నలు అడుగుతాడు.

పీపుల్స్ నర్సింగ్ హోమ్‌లో, వైద్యం, శస్త్రచికిత్సకు సహకరించిన గొప్ప పురుషులు, స్త్రీల చిత్రాలు ఉన్నాయి, ఒకసారి అతను తనకు సహాయం చేస్తున్న సర్జన్‌ని థియేటర్ వెలుపల వేలాడుతున్న వ్యక్తి పేరు చెప్పమని అడిగాడు. అతను సమాధానం చెప్పడంలో విఫలమైనప్పుడు, యాంటీబయాటిక్స్ అందుబాటులోకి రావడానికి ముందు రోజులలో శస్త్రచికిత్స ఫలితాన్ని విప్లవాత్మకంగా మార్చిన శస్త్రచికిత్సలో ఉపయోగం కోసం అసెప్టిక్ గ్లోవ్స్‌ను అభివృద్ధి చేసిన మొదటి సర్జన్ విలియన్ హాల్‌స్టెడ్ అని అతను వివరించాడు. క్యాన్సర్, కొకైన్, కరేజ్' విలియం హాల్‌స్టెడ్ గురించిన పుస్తకం, నేను అతని లైబ్రరీలో చదివాను. సర్జన్ శిక్షణలో పరిశీలన చాలా ముఖ్యమైన భాగమని కూడా ఆయన హైలైట్ చేశారు. దీన్నే ఈ రోజుల్లో విద్యావేత్తలు 'సిట్యుయేషనల్ అవేర్‌నెస్' అంటారు.

నేను పరీక్షలు రాస్తున్నప్పుడు ఎగ్జామినర్లను కలవడానికి అప్పుడప్పుడు వచ్చేవాడు. అతను నా కోసం ఉన్నాడని భావించి నేను చాలా బాధపడ్డాను, తరువాత ప్రొఫెసర్లలో ఒకరు అదే బ్యాచ్‌లో ఉన్న తన స్నేహితుడి కొడుకు కోసం సిఫార్సు చేయడానికి వస్తున్నారని నాకు చెప్పారు. నా ప్రొఫెసర్ అతనిని 'మీ కూతురు ఎలా

ఉంది?' అని అడిగినప్పుడు, అతను స్పష్టంగా నవ్వుతూ, ఆమె మంచిగా ఉంటే, ఆమె పాస్ అవుతుంది అని చెప్పాడు. లేకపోతే ఆమె నేర్చుకుంటుంది.

అతను ఎప్పుడూ విద్యాపరంగా విఫలం కానప్పటికీ, వైఫల్యానికి అతని వైఖరి అది.

అప్పట్లో మాకు మెడికల్ కాలేజీలో గౌరవ ఆచార్యులు – డాక్టర్ చల్లపల్లి సాంబశివరావు, డాక్టర్ ఉప్పలపాటి వెంకటరత్నం మెడిసిన్, డాక్టర్ కె. సదాశివరావు, డాక్టర్ మద్దినేని గోపాలకృష్ణ సర్జరీలో బోధించేవారు. విద్యార్థులు పోస్ట్ చేయడానికి చాలా ఆసక్తిగా ఉన్నారు.

వారి బోధన విస్తృత అనుభవంపై ఆధారపడి ఉందని, మరింత ఆచరణాత్మక జ్ఞానాన్ని అందించిందని వారు కనుగొన్నందున వారి వార్డులు. నన్ను మా నాన్నగారి వార్డులో చేర్చినందుకు చాలా సంతోషించాను కానీ మా నాన్న నాతో ఇలా అన్నారు "ఏమైనప్పటికీ మీరు నా నుండి నేర్చుకుంటున్నారు, డాక్టర్ గోపాలకృష్ణ చాలా మంచి సర్జన్, మీరు అతని నుండి కొన్ని నైపుణ్యాలను నేర్చుకోవచ్చు కాబట్టి మీరు అతనిని అభ్యర్థించమని నేను సూచిస్తున్నాను. తన సహచరులకు గొప్పతనం, గౌరవం.

నా సర్జరీ పోస్టింగ్ చేస్తున్నప్పుడు, నేను ఇంట్లో కుట్టుపని, ముడి వేయడం ప్రాక్టీస్ చేసేవాడిని, నేను లెదర్‌పై ప్రాక్టీస్ చేస్తే కుట్టు వేయడం మరింత వాస్తవికంగా ఉంటుందని మా అమ్మ నాకు పాయింటర్ ఇచ్చింది, నేను పాత లెదర్ కథనాలపై అలా చేశాను. నేను కొంత సౌకర్యంతో చేస్తున్నప్పుడు మా నాన్నగారు, నా ఎడమచేత్తో కూడా చేసి చూడాలని అన్నారు, అలా నన్ను 'సవ్యసాచి'గా మార్చారు.

ఏదైనా బాగా చేస్తే సరిపోదని, చేసే పనిలో రాణించాలని ఆయన నాకు చెప్పే విధానం.

మెడిసిన్ చివరి సంవత్సరంలో ప్రధాన సబ్జెక్టులకు ప్రైజ్ పరీక్షలు ఉండేవి. చాలా మంది మెరుగైన విద్యార్థులు ఉన్నందున నేను పతకాలు పొందడం లేదని భావించి నేను ఈ పరీక్షలకు హాజరు కావడానికి ముందుకు రావడం లేదు. 'పరీక్షకు హాజరైన ప్రతి ఒక్కరూ పతకం సాధించలేరు కానీ ఆ స్థాయిలో పోటీ పడగలరన్న విశ్వాసం ఉండాలి' అని మా నాన్న నన్ను పరీక్షకు ప్రోత్సహించారు.

మెరిట్ సర్టిఫికేట్‌లతో మెడిసిన్, సర్జరీ రెండింటిలోనూ నేను పతకాలు పొందలేకపోయాను.

నేను పోస్ట్ గ్రాడ్యుయేట్ సీట్లకు దరఖాస్తు చేస్తున్నప్పుడు, నేను శస్త్రచికిత్స, మెడిసిన్ కోసం దరఖాస్తు చేసాను. నేను Obs & Gynaec కోసం దరఖాస్తు చేయనందుకు నా తల్లి నిరాశ చెందింది. ఇన్ని సంవత్సరాలుగా ఆమె సాధన చూసిన స్పెషాలిటీకి కావాల్సిన ఓపిక నాకు లేదని వివరించాను.

ఆడవాళ్లకు సర్జరీ చేసేంత సత్తువ లేదని మా నాన్నగారు నన్ను సర్జరీ చేయనీయకుండా చేశారు. చాలా మంది ప్రసూతి వైద్యులు సర్జన్‌ల కంటే ఎక్కువ స్టామినా కలిగి ఉండవలసి ఉంటుందని, వారికి ఇష్టం

వచ్చినప్పుడు ఆపరేషన్ చేయలేరని, వారికి అవసరమైనప్పుడు కూడా, ఒకటి కాదు రెండు జీవితాలు ప్రమాదంలో ఉన్నందున వారు ఎక్కువ ఒత్తిడికి గురవుతున్నారని నేను సమాధానం ఇచ్చాను.

నేను ఎట్టకేలకు కార్డియాలజీ చేయాలనే ఉద్దేశ్యంతో జనరల్ మెడిసిన్ తీసుకున్నాను, ఇది విధానాల పట్ల నా ఆప్టిట్యూడ్‌ను సంతృప్తిపరుస్తుంది, స్వచ్ఛమైన శాస్త్రాల మేధో ప్రేరణను ఇస్తుంది.

నా కెరీర్‌లోని ప్రతి దశలో, నా తల్లిదండ్రులు వారి స్వంత ఉదాహరణ, తెలివైన సలహాతో నా ఎంపికలను ప్రభావితం చేశారు. విజయం అంటే సంపద లేదా కీర్తి కూడబెట్టడం కాదని, ఒకరి స్వంత సామర్థ్యాన్ని నెరవేర్చుకోవడం, సూత్రాలకు కట్టుబడి ఉండటం అని కూడా వారు నాకు నేర్పించారు.

'Sathyam Vada – Dharmam Chara'





# 'హీలింగ్ రేస్' 'ఎయిలింగ్ మిలియన్స్.

డా.పి.రామమోహనరావు
సంజీవి నర్సింగ్ హోం, నిజామాబాద్

**ఉపోద్ఘాతం:**

తెలిసినవాళ్ళు ఎవరు కనిపించినా, బాగున్నారా? అని అడుగుతాం ఎదురుగా మనిషి ఆరోగ్యంగా కనిపిస్తున్నా ఆ ప్రశ్న అడుగుతూనే వుంటాం. ఆ ప్రశ్నలోనే ఆ రోగ్యానికున్న ప్రాముఖ్యత తెలిసిపోతుంది. అందుకే 'ఆరోగ్యమే మహాభాగ్యం' అనే సామెత ప్రాచుర్యం చెందింది. 'ఆరోగ్యం అంటే మనిషి శారీరకంగా, మానసికంగా, సాంఘికంగా బాగుండటం అంతే గాని కేవలం వ్యాధి లేకపోవడం మాత్రమే కాదు'. ఈ నిర్వచనం ప్రపంచ ఆరోగ్యసంస్థ చెప్పినదే మరి. దశాబ్దాలు గడిచిపోతున్నా ఆరోగ్యరంగం, వైద్య విజ్ఞానం కొత్త టెక్నాలజీతో అభివృద్ధి చెందుతున్నా, వైద్య సదుపాయాలు సామాన్య ప్రజానీకానికి ఇంకా దూరం గానే వున్నాయన్నది కళ్ళముందున్న నిజం. వైద్యశాస్త్రం ఎంతో అభివృద్ధి చెందుతూ కొత్త మనిషినే సృష్టించే ప్రయత్నంలో వుంటే, మన దేశంలోని ఎనభై శాతం ప్రజలు ఆహారలేమి. అంటువ్యాధులు, దోమలు, నల్లులు, పిచ్చికుక్కలతో పోరాడుతున్నారు. భారత రాజ్యాంగం ప్రజల 'ఆరోగ్యసంరక్షణ 'రాజ్యం' ప్రాథమిక విధి అంటే, ఐక్యరాజ్య సమితి 2000 సం. నాటికే అందరికీ ఆరోగ్యం అన్నది. ఐక్యరాజ్య సమితి నినాదం సిల్వర్ జూబ్లీనీ, భారత రాజ్యాంగం గోల్డెన్ జూబ్లీని పూర్తి చేసుకున్నాయి. అదే సమయంలో ప్రజారోగ్యం, వ్యాపార సరుకై, ఆరోగ్యం అద్దాల మేడలోకి, ప్రజలు రోడ్డు మీదికి చేరడం పూర్తయింది.

అలా ఎందుకని: ఆరోగ్యాన్ని కాపాడటం, అనారోగ్యం రాకుండా చూడటం, వచ్చిన అనారోగ్యానికి వైద్యం చేయడం ఈ మూడు అంశాలను సరిగా నిర్వహించగలిగినప్పుడే పౌర సమాజం

ఆరోగ్యంగా ఉంటుంది. కానీ నేడు రోగానికి వైద్యం' అనే మూడవ అంశం మీదనే ఎక్కువ కేంద్రీకరణ జరగడం వలన వైద్యుల మీద ఒత్తిడి పెరుగుతుంది.

పైన చెప్పిన మూడు అంశాలను ఆచరణలో పెట్టి ప్రజల ఆరోగ్యాన్ని రక్షించే బాధ్యత ప్రభుత్వానిదేనని భారత రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు చెబుతున్నాయి అంతేకాక ప్రాథమిక హక్కులతో ఉన్న 21వ నిబంధనను వివరిస్తూ మన సుప్రీంకోర్టు జీవించే హక్కు' అంటే 'ఆరోగ్యంగా జీవించే హక్కు కూడా అని వివరించింది. ఆరోగ్యంగా ఉండాలంటే లేదా అనారోగ్యాన్ని నుండి కాపాడుకోవాలంటే, రక్షిత మంచినీరు, సరియైన పౌష్టిక ఆహారం, పరిసరాల పరిశుభ్రత, మురుగు కాలువల నిర్వహణ, మరుగుదొడ్ల సౌకర్యం, పనిచేసే దగ్గర సరియైన వాతావరణం లాంటి ఎన్నో అంశాలను ప్రభుత్వమే నిర్వహించాల్సి ఉంటుంది. మరి వ్యాధిగ్రస్తులకు చికిత్స సందించడంలో కూడా ప్రభుత్వం గణనీయమైన పాత్ర వహించవలసి ఉంటుంది బ్రిటన్ లాంటి పాశ్చాత్య దేశంలో వైద్యం, విద్య పూర్తి బాధ్యత ప్రభుత్వానిదే

కొన్ని ప్రశ్నలు: ప్రభుత్వరంగ ఆసుపత్రులు బలహీనపడటం అనే అంశాన్ని ప్రయివేటురంగంలోని అసుపత్రులు తమ స్వార్థ ప్రయోజనాలకు వాడుకుంటున్నారనే వాదం అక్కడక్కడ వినిపిస్తుంది అయితే ప్రభుత్వ రంగ ఆసుపత్రులు బలపడకపోవడానికి కారణలు ప్రయివేటు ఆసుపత్రులా? అలా అనుకోవడం హాస్యాస్పదం కాదా? నిజంగా దానికి కారణం ప్రభుత్వ ఆసుపత్రులలో బిల్డింగులు, పరికరాలు సమకూర్చుకున్నారు. మరి దానివలన ఎంత ప్రయోజనం జరిగిందో రోజూ ప్రభ్వుత్వ ఆసుపత్రులకు వెళ్ళే సామాన్య జనానికి తెలియాలి. ఇంకా కూడా మరికొన్ని కోట్లు ఖర్చుపెట్టి గ్రామాలలో ఆరోగ్య పరిస్థితులను మెరుగుపర్చటానికి ప్రభుత్వం ప్రణాళికను సిద్ధం చేసింది. ఎన్ని ప్రణాళికలు వేసినా ఫలితం అనుకున్నంతగా లేకపోవటానికి అమలులో చిత్తశుద్ధి లోపమా?

అసలు ప్రయివేటు రంగానికి, ప్రభుత్వరంగానికి పోటి ఉండవలసిన అవసరం ఉందా? కొన్ని సర్వేల ప్రకారం మొత్తం జనాభాలో 20 శాతంకి పైగా ఏ పరిస్థితులలోనూ ఆర్థిక స్తోమత లేక ప్రభుత్వరంగ ఆసుపత్రులకే వెళ్తారు. ఒక 30 శాతం మంది అచ్చంగా ప్రయివేటు ఆసుపత్రులకు వెళ్తారు. మిగిలిన 50 శాతం మంది అప్పులు చేసి అయినా ప్రయివేటు రంగానికి వెళ్తున్నారు. ఒక వేళ ప్రభుత్వరంగం బాగుంటే వీరిలో సగం ప్రభుత్వ ఆసుపత్రులకు వెళ్ళే అవకాశం లేదా?

ఇదంతా ఒక వైపు. మరొక వైపు ప్రజలలో ఉన్న అజ్ఞానం, అమాయకత్వం వలన, అనవసరంగా పరీక్షలు చేయించుకొనడం, ఎక్సరేల కోసం అడగటం, సూది మందు కోరుకోవడం జరుగుతుంది.

చదువుకున్నవారు కూడా ఎక్కువ మందులు కావాలని కోరుకోవడం కూడా చూస్తున్నాము. ఇవి పోగొట్టడం, ఎవరి బాధ్యత?

గతంలో ప్రభుత్వ ఆస్పత్రులలో గాని, ప్రయివేటు ఆస్పత్రులలోగానీ, చికిత్స చేయటం ఒక నైతిక బాధ్యతగా ఉండేది. రోగులు వైద్యులపై గౌరవం, విశ్వాసం కలిగి ఉండేవారు. మెడికల్ కాలేజీలలో సీనియర్ ప్రొఫెసర్లు, వైద్య విద్యార్థులకు శ్రద్ధగా బోధించడమేకాక రోగుల పట్ల వైద్యులకుండవలసిన నైతిక బాధ్యతను గురించి కూడా వివరించేవారు వైద్యం ఎక్కువ భాగం ప్రభుత్వ ఆస్పత్రులలోనే జరుగుతూ ఉండేది. కాని ఈ రోజున ఆ పరిస్థితి లేదు. వైద్య కళాశాలల సంఖ్య పెరుగుతుందే కాని, లోపల ఉండవలసిన వాతావరణం ఉండడంలేదు. అంతేకాక మారుతున్న పరిస్థితుల కనుగుణంగా (ప్రైవేటు రంగంలో వైద్యశాలల రూపురేఖలు మారిపోతున్నాయి. అంతర్జాతీయ స్థాయిలో, పెద్ద పెద్ద ఆస్పత్రులు కార్పోరేట్ రంగంలో వచ్చేశాయి. అంత పెట్టుబడి ప్రైవేటుగా పెట్టినప్పుడు లాభం అనే ఆలోచన రాక తప్పదు. ఈనాడు చేయించుకోగలిగితే (ఆర్థికంగా) మన దేశంలో చేయలేని వైద్యం లేదు ఇది ఒక గొప్ప విజయమే. ఇది నాణేనికి ఒక వైపు, మరొకవైపు దేశ జనాభాలో మూడవ వంతుగా ఉన్న బీదవారికి నూతన వైద్య చికిత్సలు అందుబాటులో లేకుండా పోతున్నాయి. ప్రభుత్వ రంగంలో వైద్యులకు హేతుబద్ధంగా జీతాలు, ఇతర సదుపాయాలు పెంచి, ఆసుపత్రులలో కనీస వసతులు ఏర్పరచి, కావలసిన మందులు ఇతర పరికరాలను సమకూర్చి, కొన్ని ఖచ్చితమైన నిబంధనలు విధించి వాటిని పాటించేటట్లు ప్రభుత్వమే చేయవలసి ఉంటుంది. కానీ అలా జరగడం లేదు అందువలననే సామాన్యులకు ప్రభుత్వ ఆస్పత్రులమీద నమ్మకం పోయింది. ప్రభుత్వ ఆస్పత్రికి వెళ్ళే 'సాహసం' చేయలేక, ప్రైవేటు వైద్య 'సేవల్ని' భరించలేక తికమక పడుతున్నాడు సామాన్యుడు. గ్రామాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి ఒక సామాన్యుడు వైద్యానికి వెళితే, ఒక సారి వైద్యుడు ఉండడు. ఆయన ఉంటే మందులు ఉండవు. ఒకవేళ ఉన్నా మందులు ఇచ్చేవారు లేక ఇతర వైద్య సిబ్బంది ఉండరనేది అనేక మంది గ్రామీణ ప్రాంత రోగులు చెప్పే ఫిర్యాదు.

డాక్టర్లు సంఖ్యాపరంగా తక్కువ లేకపోయినా సరియైన పంపకం జరగకపోవడం కూడా వైద్యలోపానికి ఒక కారణం అవుతుంది.

గత 15, 20 సం.రాలుగా వైద్యం కొరకు సమాజం పెట్టే ప్రతి వంద రూపాయల ఖర్చులో 70 రూ. ప్రైవేటు రంగానికి వెళుతుందని సర్వేలు తెలుపుతున్నాయి.

అయితే పెరిగిన బాధ్యతను నిభాయించడానికి (ఫీజులు తీసుకున్నా కూడా) సరియైన వాతావరణం ఈనాడు కనిపించడం లేదు. అటు ప్రజానీకంలో నిరక్షరాస్యత, అజ్ఞానం, మూఢనమ్మకాలు, పేదరికం ఎక్కువ వుండటం వలన పరిస్థితిని సరిగ్గా అర్థంచేసుకోక పోవడం, సమయానికి వైద్యం చేయించుకో(లేక)ర పోవడం, మందులు సరిగా వాడలేక పోవడం జరుగుతుంది కాగా జరిగిన ప్రతి వ్యతిరేక సంఘటనకు, లేక దుర్ఘటనకు వైద్యుడ్ని బాధ్యుణ్ణి చేసి వ్యక్తిగతమైన నష్టం లేక ఆసుపత్రికి నష్టం కలుగజేస్తున్నారు. మరొక్కపక్క తక్కువ సమయంలో ఎక్కువ ఆదాయాన్నించి గాని, వైద్యరంగం

వ్యాపారమయమైపోయి "పెట్టుబడి లాభం లెక్కలు పెరిగినందువలన గానీ, అనారోగ్యకరమైన పోటీలు: పెరిగినందువలన గానీ వైద్యుడు–రోగి మధ్య సంబంధాలు పటిష్టంగా ఉండటం లేదు.

అత్యంత వేగంగా విస్తరిస్తున్న అధునాతన వైద్య పరిజ్ఞానం, ఎంత పెద్ద జబ్బునైనా లొంగదీసుకునే అవకాశాన్ని కల్పిస్తుండగా, మరొకవైపు ఆ అవకాశాన్ని అందిపుచ్చుకునే శక్తి కొద్దిమంది మాత్రమే. కలిగి ఉంటున్నారు. ఖర్చు పెట్టలేని వాడు కూడా ఆరోగ్యంగా ఉండాలనే అనుకుంటారు. తక్కువ ఖర్చుతో అధునాతన వైద్యం కావాలనుకుంటున్నాడు. తనకు కూడా ఆ శక్తిని కల్పించాలని ప్రభుత్వాన్ని సమాజాన్ని కోరుతున్నాడు. సాధ్యంకానప్పుడు కోపాన్ని ద్వేషాన్ని పెంచుకుంటున్నాడు.

చివరకు జరుగుతుందేమిటంటే మానవ సంబంధాలు చెడిపోతున్నాయి. వైద్యరంగంపైన అనుమానం పెరుగుతుంది. అది ఏ రకంగానూ మంచిది కాదు.

కనుక ఏం చేయాలి – ప్రభుత్వరంగం పటిష్టం కావాలి మొదటి ఉదహరించిన, ప్రభుత్వ పరంగా చేయవలసిన అంశాలన్నింటినీ ప్రభుత్వం అత్యవసరంగా, గుర్తించి నిర్వహించాలి. ఆరోగ్యం ప్రజలందరి ప్రాథమిక హక్కు అని గుర్తించాలి. అలాగే ప్రైవేటు రంగంలో వ్యాపార లక్షణంతో పాటు రోగిని, రోగి కుటుంబ పరిస్థితిని కూడా అర్థంచేసుకోవాలి తన శక్తి మేరకు కృషి చేస్తున్న విషయం అవతలి వారు గుర్తించేటట్లు ప్రవర్తించాలి. ప్రజలు వైద్యులపై విశ్వాసాన్ని పెంచుకోవాలి. పాఠశాల స్థాయిలో ఆరోగ్య విద్య పెరగాలి.

ఇప్పుడిప్పుడే విస్తరించుకుంటున్న ఇన్సూరెన్స్ రంగాన్ని వైద్య రంగానికి ఏరకంగా ఉపయోగించ వచ్చునో ప్రభుత్వం పరిశీలించి, దానిలో దాగి ఉన్న లోపాలను సరిచేయాలి. ముఖ్యంగా బీద జనానికి ఉపయోగపడేటట్లుగా ప్రభుత్వమే చూడాలి.

అవసరమైన మేరకు ప్రైవేటు రంగాన్ని ప్రభుత్వం నియంత్రించాలి జనంలో వైద్య పరిజ్ఞానం పెంచటానికి మీడియా, ముఖ్యంగా కంప్యూటర్ పరిజ్ఞానం ఉపయోగ పడాలి. ద్వారా వైద్యానికి, రోగికి రోగి కుటుంబానికి మధ్య స్నేహ సంబంధాలు పెరగాలి.

అప్పుడే కోట్లాది అనారోగ్య పీడితులకు వైద్య రంగం ఒక ఆశాకిరణం అవుతుంది. వైద్యులకు కూడా చికిత్స చేయడంలో సంతృప్తి కలుగుతుంది.

## వైవిధ్యభరిత వ్యక్తిత్వానికి అక్షర నివాళి!

శ్రీమతి మల్లవరపు రాజశ్రీ
శ్రీమతి మల్లవరపు శాంతిశ్రీ

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారి (–2012) ఆత్మకథ 'సదాశివమ్' జనవరి 2008లో పేదల పక్షపాతిగా, విద్యా అభివృద్ధి దోహదకుడిగా, కుటుంబ ప్రతిభగల పెద్దగా సాగిన ఆయన జీవన ప్రస్థానం వైవిధ్యభరితము అది చదివితే మనకర్థం అవుతుంది.

వారి కుటుంబంతో మాకు చిన్నతనం నుంచి అవినాభావ సంబంధముంది. ఆయన కుమార్తెలు రమాబాల, ఉమాబాల, ఉషాబాల, మేము ఆ రోజుల్లో పెద్ద కాన్వెంటుగా పిలవబడే సెయింట్ జోసెఫ్ కాన్వెంటులో కలసి చదువుకున్నాము. అంతేకాకుండా సదాశివరావుగారు, జయప్రదాంబగారు మా కుటుంబ వైద్యులు. ప్రతి చిన్న అనారోగ్య సమస్యకి వారి దగ్గరికి పరుగెత్తే వాళ్ళం!

సదాశివరావు గారిలో నాకత్యంత అమితంగా నచ్చిన విషయం తెలుగు సాహిత్యం పట్ల ఆయనకున్న ఆసక్తి, అనురక్తి అభిరతి. సాహిత్యం పట్ల మక్కువ ఉన్న నాకు ఆయనలోని ఈ కోణం ఆకర్షణీయంగా, ప్రశంసనీయంగా కన్పించేది. వైద్యుడుగా ఆయనకు ఎక్కువ సమయం దొరక్కపోయినా, వీలయినంత వరకు సాహిత్యంతో సంపర్కం ప్రయత్నం ముదావహం! నేను జె.కె.సి కళాశాలలో చదువుతున్నప్పుడు, ఆ తర్వాత ఆయన ఆధ్వర్యంలో, ప్రోత్సాహంతో ఎన్నో సాహిత్య సమావేశాలు జరుగుతుండేవి. వివిధ సాహిత్య ప్రక్రియలలో నిష్ణాతులైన ఎందరో కవులు, రచయితలు, విమర్శకులు వాటిలో పాల్గొనేవారు. వారి సాహిత్య చర్చలు అద్భుతంగా ఉండేవి. వాటి ప్రభావం చక్కని పునాదులు వేసి నన్ను సాహిత్య ప్రేమికురాలిగా మార్చాయి. ఇప్పుడు కొద్దో గొప్పో తెలుగులో రాయగలుగుతున్నానంటే అప్పటి వాసనలు నన్ను చుట్టుకుని వదలకపోవడమే!

ఇక మా అక్క రాజశ్రీ చెప్పిన రెండు సంఘటనలు గురించి కూడా ఈ సందర్భంలో రాయడం సముచితం. అవి ఆయన, ఆయన సతీమణి జయప్రదాంబగారి ఔదార్యాన్ని, సేవానిరతిని వెల్లడిస్తాయి. కాబట్టి! ఒకసారి రాజశ్రీ తన పిల్లలతో సినిమాకి వెళ్ళే ప్రయాణం పెట్టుకుని రిక్షాలో వెళుతుండగా, కొత్తపేట మలుపులో యాక్సిడెంటయింది. అది మధ్యాహ్నం మూడు గంటల సమయం. సరిగ్గా ఆ సమయంలోనే డాక్టరు దంపతులు హాస్పటల్ పని పూర్తిచేసుకుని ఇంటికి వెళ్తున్నారు. మా అక్కని, పిల్లల్ని చూసి, వెంటనే కారాపి, విషయం తెల్సుకుని, వారి కార్లో హాస్పట్కి తీసుకెళ్ళారు. పిల్లలకి చిన్న,చిన్న దెబ్బలు మాత్రమే తగలటం వలన ఫస్ట్ ఎయిడ్ చేశారు. మా అక్కకు ఎడమచేతి మణికట్టు దగ్గర దెబ్బ తగిలింది. ఎక్సరే తీయించి, ఫ్రాక్చర్ అని తెల్సుకొని ప్లాస్టర్ వేశారు. తిరిగి వారిని తమ కారులో ఎక్కించుకుని ఇంటి దగ్గర దింపిన పిదప ఇంటికెళ్ళారు. లంచ్ చెయ్యడం ఆలస్యమయినా పట్టించుకోకుండా వైద్య సహాయం అందిచడం వారి అంకితభావానికి తార్కాణం!

ఆ రోజుల్లో మా నాన్నగారు మల్లవరపు ఇన్నయ్యగారు తెలుగుదేశం పార్టీలో చేరి తనకు చేతనయినట్లు పార్టీకి సహాయసహకారాలు అందించేవారు రింగ్ రోడ్డు మీదున్న మా "గండికోట" ఇంటిని పార్టీ ఆఫీసుకి అతి తక్కువ రేటుకి అద్దెకిచ్చారు. కానీ పార్టీ ఆయనకు రెండు సంవత్సరాలు అద్దె ఇవ్వలేదు. ఈ విషయం సదాశివరావు గారి దృష్టిలోకి వచ్చింది. ఇన్నయ్యగారు అనారోగ్యం కారణంగా, వయస్సు పైబడిన కారణంగా వ్యాపారం మానుకున్నారని, ధనవంతులైన పార్టీ సహాయకులను ఒప్పించి, చందాలు వసూలు చేసి కొంతలో కొంతైనా సర్దగలిగారు, సరైన సమయంలో అదుకోగలిగారు. ఆయన చేసిన ఈ సహాయాన్ని మా నాన్నగారు పలుమార్లు జ్ఞాపకం చేసుకోవడం నాకిప్పటికీ గుర్తుంది!

అటువంటి గొప్ప వ్యక్తి గురించి నాలుగు వాక్యాలు రాసే అవకాశం నాకు కలగడం నా అదృష్టంగా భావిస్తాను. నేను నా చదువు కోసం ఢిల్లీ వెళ్ళడం, చదువు పూర్తయి అక్కడే ఉద్యోగం రావడం, వివాహం జరగడం వలన డాక్టరు గారి కుటుంబం గురించి అన్యాపదేశంగా వినడమే తప్ప ప్రత్యక్షంగా చూడలేదు. ఆయన మరణ వార్త విన్నప్పుడు మనస్సు విచారగ్రస్తమైంది. ఇప్పటికీ పేదవారి పట్ల ఆయన కనబరచిన సానూభూతిని గురించి అందరు చెప్పకుంటారు. ఆయన జీవితం ఆదర్శమయం! మనందరికీ ఆచరణీయం!



# నాకు తెలిసిన సదాశివరావు తాతయ్య

వాసిరెడ్డి బాంధవి
తెనాలి

డా. కాసరనేని సదాశివరావు గారు ప్రజావైద్యునిగా, విద్యాదాతగా, రైతుబాంధవునిగా, సాహిత్యాభిమానగా, కళాపోషకునిగా మాజీ శాసనసభ్యునిగా, ఈ సమాజానికి ఆయన చేసిన సేవలు కరతళామలకం రూపంలో అజానుబాహులు ముక్కుసూటితనం, బోళాతనంతో కూడిన నిఖార్సయిన వ్యక్తిత్వం ఆయనది.

నాకు తెలిసి సదాశివరావు తాతయ్య గొప్ప స్నేహజీ మా తాతయ్య డా కొడాలి వీరయ్యగారి మిత్రులు కాకర్ల సుబ్బారావుగారు, కొడాలి పాపారావుగారు, కుర్రా వీరరాఘునయ్యగారు మొదలగు వారు విశాఖపట్టణం వైద్యకళాశాలలో సహవిద్యార్థులు అపూర్వ స్నేహం వీరిది. రూపంలో స్వభావంలో వ్యత్యాసాలున్నా వీరందరి భావజాలం ఒకటే నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి ఎటువంటి ప్రలోభాలను రాజీ పడని విలువలతో కూడిన మహోన్నత వ్యక్తిత్వాలు వీరిని హేతు బద్ధమైన ఆలోచనలు, క్రమశిక్షణ, సమయపాలనందీగి కదలికతో గడియారం ముల్లు తిప్పుకునేవాడని నానుడి) నిబద్ధత, ఆరోగ్యకరమైన జీవనశైలి వీరందరిది. వృత్తిలో ప్రవృత్తిలో సురచిరస్థాయిని ప్రతిష్టించుకున్నారు దివికేగినా. న్ని ఆచరించి ఆ ప్రాంత ప్రజల హృదయాలలో వృత్తిలో ఎంత బిజీగా ఉన్న సేదతీరడానికి తరుచూ కలుసుకునేవారు. వారి సందడికి కొదవే లేదు మా తాతయ్య, సదాశివరావు తాతయ్య గలగలా మాట్లాడేవారు చదివిన చదవాల్సిన పుస్తకాలు, కాలేజీలో వేసిన షేక్స్పియర్ నాటకాలు, చెడుగుడు పోటీలు,

ఓ ఆటగాడు రాకపోతే తాతయ్యతో సదాశివరావు తాతయ్య వెళ్లి ఆ టోర్నమెంట్ గెలిపించా రంట హాస్టల్ నుండి సీతమ్మధార కొండ మీదగా సదాశివరావు గారు వీరయ్య గార్లు వీరరాఘవయ్య గారు కాలినడకతో వెళ్లి చూసిన భానుమతి గారి సినిమాలు, సోషలిస్ట్ యంగ్ లీగ్ జాయింట్ సెక్రటరీ గా JP గారి విశాఖపట్టణ పర్యటనని తాతయ్య పర్యవేక్షిస్తుంటే సదాశివరావుతాతయ్య వెన్నంటి ఉ బడటం, తెన్నేటి తో సత్సంగం, సదాశివరావు తాతయ్య క్లాసుమేట్ కి ఓ సబ్జెక్టు ఉండి పోవటంతో ఈ మిత్ర త్రయం అంతా కలిసి తాతయ్యకి అప్పజెప్పారంట ఎప్పుడూ ప్రథముడిగా ఉండే తాతయ్య ఆయనకు పేపర్ చూయిస్తూ ఒక ప్రశ్నకు జవాబు పూర్తి చెయ్యలేదంట. దాంతో కొప్పర్తి కృష్ణమూర్తి గారికి అర మార్కు ఎక్కువొస్తే బీ బాలపరమేశ్వరరావు గారికి 20 మార్కుల తేడాతో మూడో స్థానం లో ఉన్నారంట... ఇలా ఎన్నో మధుర స్మృతుల అపురూప స్నేహం వీరిది.

ఊహ తెలిసి తెలియని ప్రాయం నుండి, తాతయ్య ఒళ్ళో కూర్చుని వీరి సంభాషణలను ఆసక్తిగా వినటం బీ పెద్దయ్యాక వారి సంభాషణల్లో ఆసక్తితో పాలుపంచుకునే భాగ్యం కలగటం, నా పూర్వజన్మ

hác. It's the golden period in my life With all their influence & inspiration, I am as I am.

పుట్టించింది బ్రహ్మయినా అమ్మ గర్భం నుండి భూమి మీదకు వచ్చింది జయప్రదాంబా సదాశివరావు గార్ల చేతుల మీద తెనాలి నాగార్జున క్లినిక్ లో అందుకే వాళ్లంటే నాకు చాలా ఇష్టం. కలిసినప్పుడల్లా ఎంతో ఆప్యాయంగా నా భుజం చుట్టూ చెయ్యి వేసి అందరికీ పెద్దమ్మాయి, సాగర్ కూతురు అంటూ అప్పుడు తాతయ్య పడుతున్న కంగారుకి ఇద్దరం వచ్చి సిజేరియన్ ఆపరేషన్ చేసామంటూ ఇదంతా చెప్పేవారు. అలాంటి సందర్భంలో లోక్ సత్తా JP గారు మీ కెరీర్ లో ఎన్ని వందల సిజేరియన్ ఆపరేషన్లు చేసారని అడిగితే, నాడు తప్పనిసరిగా చెయ్యాల్సి వస్తే చేసేవాళ్ళం అంటూ మారిన వైఖరులను ప్రస్తావించారు.

అందుకేనేమో నాకు ఆయన దగ్గర చనువెక్కువ నా పైనెస్ ని పక్కన పెట్టి, ఎంతమందిలో ఉ న్నా, సదాశివరావు తాతయ్యా అంటూ వెళ్లేదాన్ని "Dr. Kodali Veeriah Educational Academy ప్రారంభోత్సవం ఆయన చేతుల మీద జరగటంబీ అలాగే బాధిత మహిళల కోసం నేను పెట్టిన " సఖి – హెల్ప్ లైన్ ప్రారంభోత్సవానికి JP గారితో కలిసి అసుకోకుండా రావటం నా అదృష్టం.

తెరిచిన పుస్తకం లాంటి తాతయ్య సదాశివరావు రాతయ్యలతో కాసేపుంటే నడిచే గ్రంథాలయాల విశ్వవిద్యాలయాలా అనిపిస్తుంది. ఆంధ్రా నాగార్జున విశ్వవిద్యాలయాల్లో సిండికేట్, సెనేట్ సభ్యులుగా. v5 కాలేజీ (మరి కొన్ని కాలేజీలకు తాత్కాలికంగా) పాలకవర్గ అధ్యక్షులుగా ఉండటం అలాగే సదాశివరావు శాతయ్య నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ ' స్థాపించి తన భార్య పేరుతో జయప్రదాంబా డిగ్రీ కాలేష్ పెట్టి విద్యాదాతగా కొనియాడబడ్డారు.

1978 అసెంబ్లీ ఎన్నికలో జనతా పార్టీ టికెట్ తో స్వల్ప ఓట్ల తేడాతో పరాజయం పొందారు. NTR గారు ఒత్తిడి చేసినా 1983లో నిరాకరించి తిరిగి NTR పట్టుబట్టడం తో 1985 లో మాత్రమే ఇద్దరూ శాసనసభ్యులుగా ఎన్నికయ్యారు.

వైద్య పట్టా రాగానే ఎందరో డాక్టర్లు వీరి దగ్గర ఉండటం ఆ పై వీరి సలహాతో వీరి చేతుల మీదుగా హాస్పిటల్స్ పెట్టుకున్నవారు కోకొల్లలు.

14 సంవత్సరాలకే రాజకీయారంగేట్రం చేసి పటులింత్తై అన్న చందాన ఆకాశ హర్మ్యాలను ముద్దాడి కూడా వృత్తి మరి కుటుంబ బాధ్యతల కారణంగా తాతయ్య రాజకీయాన్ని, సేవ సాంఘిక సామజిక వ్యవహారాలను ప్రవృత్తిగా చేసుకున్నారు. బహుముఖ ప్రజ్ఞాశాలుర యిన ఈ మిత్రులు తమ పునాదులపై వేరొకరిని నిలిపి తమ శక్తిసామర్థ్యాలతో వెన్నుదన్నుగా నిలిచి ఓ మనిషి ఇన్ని పనులు చేసారంటే వారి లో దాగిఉన్న శక్తికీ జేజేలు.

ఈ మిత్రులకు రంగులో రూపంలో స్వభావంలో ఎంత వ్యత్యాసాలున్నా వీరు దివంగతులై ఇన్ని సంవత్సరాలయ్యినా ఇప్పటికీ ఎందరి హృదయాల్లోనో గుడి కట్టుకుని ఉండటం ముదావహం.

ఈ మధ్య రెసిడెన్సీ చేస్తున్న ఓ. బాబు తాతయ్య గురించి ఎంతో ఎక్సయిట్మెంట్ తో చెప్తుంటే అడిగాను తాతయ్యని చూడలేదంటున్నావు. మరి అంత అభిమానం ఏంటని.

మా ఫామిలీ కి ఆయన గాడ్ ఫాథర్ మా ఇంట్లో చదువు, ఉద్యోగం వైద్యం, అమెరికా వెళ్ళటానికి డబ్బు మరే అవసరం లేక కష్టం వచ్చినా ఆయన దగ్గరికి పరిగెత్తేవాళ్ళంట..

చిన్నతనం నుండి వీళ్ళ గురించి ఇలా ఎన్నో వింటూ పెరిగాము వాళ్ళ అడుగుజాడల్లో నడుస్తూ వారు వెదజల్లిన సౌరభాలను వ్యాప్తం చేస్తే మన జన్మ ధన్యమే. అదే వారికిచ్చే నిజమయిన నివాళి.





# స్నేహసంస్కారి సదాశివరావు గారు

చంద్రలత
నవలా రచయిత్రి

కొందరు ఆదర్శాలను ఊహిస్తారు మరికొందరు ఆదర్శాలను కలగంటారు. ఇంకొందరు ఆ ఆదర్శానికి ఒక రూపు నిర్మాణం చేసే ప్రయత్నం చేస్తారు.

అతి కొద్దిమంది మాత్రమే ఆ ఊహించిన, కలగనిన, నిర్మించిన ఆదర్శ జీవితాన్ని జీవిస్తారు. అలా, తన ఆదర్శాలోచన. లే ఉచ్చ్వాస నిశ్వాసాలయిన అరుదైన వ్యక్తి డాక్టరు సదాశివరావు గారు.

డాక్టరు సదాశివరావు గారు నాన్న గారి సన్నిహితులుగా మా కుటుంబానికి పరిచయం. వారితో నాన్న గారు, కోటపాటి మురహరిరావు గారి పరిచయం ఏనాటిదో! దాదాపు డెబ్బైఏళ్ళనాటి సంగతి.

గూడవల్లి అనే పల్లెటూరినుంచి మొట్టమొదటి సారి గుంటూరు పట్నం వచ్చిన, ఒక పదహారు పదిహేడేళ్ళ రైతుబిడ్డడు, ఇంటరు మొదటి సంత్సరం విద్యార్థి, జ్వరాన పడ్డాడు. ఏ.సి. కాలేజీ విద్యార్థులంతా ముక్తకంఠంతో ఒక విశ్వ వైద్య మాంత్రికుడి పేరుని సూచించారు. వారు డాక్టరు సదాశివరావు గారు.. ఇలాంటి పల్లెటూరి విద్యార్థులంటే ఆ డాక్టరు గారికి ప్రత్యేక కొద్ద ఉండేదట. వారి జబ్బుకు మందివ్వడం తో పాటు మంచీ మర్యాద చెప్పేవారట. చదువు మీద దృష్టి నిలపమని చెప్పివారట. క్రమశిక్షణల నియమావళిని కందగా పట్టించేవారట, దారి తప్పినవారిని మండలించేవారట. పట్టణ వ్యామోహంలో పడవర్లని హెచ్చరించే వారట అన్నిటికీ మించి, ఏ వేళలో అయినా, ఈ విద్యార్థులకు ఉచితంగా వైద్యం చేసి, మందులిచ్చి పంపేవారట.

అలా జూనియర్ కళాశాల విద్యార్థికి ఒక వైద్యునిగా మొదలయిన పరిచయం. ఆ తరువాత స్నేహంగా కొనసాగింది.

మరో కవిరాజు త్రిపురనేని రామస్వామి గారి శతజయంతోత్సవః పండుగ కార్యనిర్వాహకులలో నాన్నగారు ముఖ్యులు, ఉపరాష్ట్రపతి కె ఆర్ నారాయణన్ గారు ముఖ్య అతిధి అప్పుడు కవిరాజు త్రిపురనేని

సముద్ర సాహిత్యాన్ని అచ్చువేసి వేళ. ఒక చిక్కు సమస్య వచ్చింది. త్రిపురనేని గారి కుమార్తె, శ్రీమతి చౌదరాణి గారి వద్ద ప్రచురణ అనుమతి పొంద వలసి వచ్చింది.

అదేమో. ఎం.జి.ఆర్ మరణాంతర మద్రాస్ నగరం అంతా అట్టుడుకి పోతోంది. ఎక్కడి రవాణాలు అక్కడ నిలిచి పోయాయి. రాకపోకల మీద కట్టడులు. అప్పుడు నాన్న గారు, మద్రాసు వెళ్ళి, చౌదరాణి గారితో మాట్లాడి, ఒప్పించి, ముద్రణను కొనసాగించేలా చేశారు.

ఖచ్చితమైన ప్రోటోకాల్ తో నిర్వహించవలసిన కార్యక్రమం అది అనేక మందిని ఒక తాటి పై నిలబెట్టి, నడవవలసిన సందర్భం. ఎన్నో చిన్న పెద్ద అవాంతరాలు వస్తూనే ఉండేవి. ఎప్పటికప్పుడు పరిష్కరించుకొంటూ ముందుకు నడవాల్సి వచ్చేది. ఈ కార్యక్రమ నిర్వహణ కాలాన, నాన్నగారికి డాక్టర్ గారితో మైత్రి ఏర్పడింది.

ఒక విద్యార్థిగా డాక్టర్ గారి పట్ల నాన్నగారికి కలిగిన అపారమైన గౌరవానికి ఈ కార్యక్రమ నిర్వాహకులుగా సాన్నిహిత్యం ఏర్పడింది. రాసురాను వారి స్నేహం బలపడింది. మరింత క్రియాశీలకమైంది.

విద్యార్థిగా ఉన్నప్పుడే వ్యా గారి విధానంతో పాటు డాక్టరమ్మ గారి గట్టితనమూ నాన్నగారికి పరిచయం అయ్యాయట. వారి కాలాని వైద్య విద్యలో పట్టబద్రులైన అతి కొద్దిమంది మహిళలో జయప్రదాంబ గారు ఒకరు అటు వైద్యురాలిగా వాణిస్తూనే, ఇటు అమ్మగా వారు సమర్ధవంతంగా నిర్వర్తించిన బాధ్యతలను నాన్న గారు తరచు ప్రస్తావించేవాడు. స్వయంగా సదాశివరావు గారు వారి వివాహ నిర్ణయాన్ని, దాంపత్య సాహచర్యాన్ని గురించి చెప్పేవారట. డాక్టర్ ౩౦ ఔదార్యానికి, సాహిత్యమూ రాజకీయాలు జతయ్యాక, మరి ఆ మాత్రం గట్టితనం లేనిదే. కుటుంబమంతా వైద్యులుగా తీర్చిదిద్దబడేవారా?" అనేవారు నాన్న గారు.

ఎంతోమంది విద్యార్థులు వైద్యులవడంలో మార్గదర్శిగా ఉన్న డాక్టర్ గారు, తమ బిడ్డలు తీర్చిదిద్దడంలో జయప్రదాంబ గారిచే ముఖ్యమైన పాత్ర అని తరుచు చెప్పేవారట. అందుకే మహిళాకళాశాలకు వారి పేరునే పెట్టారు.

"జీవితమంతా వైద్యవృత్తిలో ఉన్నారు. కుటుంబమంతా వైద్యులు. వైద్య సంబంధ సంస్థలు కాకుండా, విద్యాసంస్థలపై ఎందుకు మొగ్గు చూపారు? ఎవరైనా నచ్చచెప్పారా?" అని సూటిగా డాక్టరు గారినే అడిగాను ఒక మారు. "మా అమ్మ!" డాక్టర్ గారు తమదైన నిరాదంబర శైలిలో అన్నారు. "మా అమ్మ 'చదువుకో చాలు! ఆ చదువే అన్నీ చూసుకుంటుంది? అనేది"

అలా, ఒక అమ్మ భావన, మరొక అమ్మ ఆదరణ, మా అమ్మ ఆదరణ, డా జయప్రదాంబ మహిళా డిగ్రీ కళాశాల మహిళా కళాశాల, సరోజినీదేవి వసతిగృహం గా రూపొందడంలో పునాదులయ్యాయి.. నాన్నగారు మంచి వక్త కార్య దక్షులు డాక్టర్ గారు చాలా సూటిగా, తేటగా, సూక్ష్మంగా మాట్లాడే వారు, తెగేసినట్లుగా నాన్నగారికి వారి తీరు, నచ్చేది 'డాక్టర్ గారు ఉన్నది ఉన్నట్టుగా చెబుతారని, కార్యాచరణకు అది ముఖ్యం' అని అనేవారు.

వారి బృందంలో ఎవరికైనా పొసగని విషయాలు తలెత్తినప్పుడు, రావెల సాంబశివరావు గారి చే అభిప్రాయబదాలు తలెత్తినపుడు డాక్టర్ గారి అనుభవం పెద్దంతరంగా నిలబడేది. చెణుకులు అతుకులు

డాక్టర్ గారు తరుచు త్రిపురనేని, ఉన్నవ గార్ల స్నేహసంబంధాల గురించి చెప్పేవారు. స్వంత అభిప్రాయాలున్న ఇద్దరు మేదావుల మైత్రి ఎంతటి చమత్కారాలను సృష్టించగలదో అంటూ, తమలోని భిన్నత్వాన్ని పరస్పరం గౌరవించుకొంటూ ముందుకు సాగిన తీరు గురించి వారు తరుచు ప్రస్తావించేవారు.

సరిగ్గా అటువంటి పరస్పర గౌరవంతో కూడిన మైత్రే నాన్న గారిదీ సదాశివరావు గారిది... డాక్టర్ గారు నాన్నగారికన్నా వయస్సులో పదేళ్ళు పెద్దవారు, చదువులో, కార్యాచరణలో, సంస్థాగత నిర్వహణ అనుభవంలో.. డాక్టర్ గారు అన్నిటా పెద్ద. ఆ పెద్దరికపు భావన లేకుండా, స్నిహహస్తం దాచిన వారి సంస్కారానికి నాన్న గారితో పాటు మనమూ ముగ్ధులమవ్వాల్సింది.

భిన్నవృత్తులలో ఉన్నా, వారి ప్రవృత్తులే వారి సావాసానికి బలమైన పునాదులయ్యాయి. వారిద్దరూ నిరంతర పాఠకులు, ఆదర్శవాదులు కార్యనిర్వాహకులు కలిసి కలలు కనిన వారు పరస్పర గౌరవంతోనే వారు అన్ని పనులు చేయగలిగారు. ఎలాంటి అరమరికలు లేకుండా, తమ ఆదర్శాలను సాకారం చేసుకోగలిగారు. వాటిని నిలబెట్టుకోవడమూ, కొనసాగించడమే. వారి స్నేహానికి మన నివాళి, అలాంటి ఒక అపురూప స్నేహసంబంధాన్ని తలుచుకొంటూ, వందేళ్ళ సదాశివరావు గారికి వందనాలు.

వినమ్రంగా, గౌరవంతో.

# కవిత్వం పాండిత్యం

పి. ఆర్. ప్రకాశరావు

ఎల్లోపతి వైద్యంలో ప్రధాన భాగం అయిన మెడిసిన్ సర్జరీలలో మెడిసిన్ పాందిత్యం పండిందని సర్జరీ కవిత్వం లాంటిదని డాక్టర్ గారు విశ్లేషించారు. పాండిత్యం సాధనతో కేవలం సాధనతో సాధ్యం కానిది కవిత, వనిత కోరిరావాలన్నారు కవికి స్వభావసిద్ధమైన నేర్పు తప్పనిసరి అవసరం ఆనాటికి కంటి వైద్యం తప్ప ఏ విభాగము ప్రత్యేకతను అందువలన డాక్టర్ గారు చేయని ఆపరేషన్ లేదు. స్త్రీలకు చేసే ఆపరేషన్లు కొన్ని డాక్టర్ గారు, దా దమ్మ గారు కలిసి చేసేవారు. రోజూ రెండు మూడు ఆపరేషన్లు సర్వసాధారణం. వాటిలో మీ vasectomy o nefroctomy, mastectomy వరకు సర్వసాధారణం. M.B.B.S PASS అయిన డాక్టర్లు అనుభవం కొరకు కొంత కాలం డాక్టర్ గారి వద్ద పనిచేసేవారు. అలాంటివారు ఒకరు తర్వాత మరొకరు వచ్చేవారు ఒక సినిమా యాక్టర్ కు బ్రెస్ట్ పెరుగుతున్నందున ఆపరేషన్ చేసి కండ తీసి వేశారు. ఆ సినిమా యాక్టర్ కోరిక ప్రకారం మచ్చ పడకుండా కుట్లు వేశారు డాక్టరు గారు. కవిత్వం సంతరించుకోలేదు.

రాష్ట్ర ప్రభుత్వం, డాక్టర్ గారిని G. G.H లో Honarary Surgen గా నియమించింది. ఈ పదవీకాలంలో రెండు ఘటనలు గుర్తించుకోదగినవి. తన అసిస్టెంట్ ఒక ఆపరేషన్ పూర్తి చేయకముందే, డాక్టర్ గారు రెండు ఆపరేషన్లు పూర్తి చేశారు ఆపరేషన్ చేస్తుండగా డాక్టర్ గారిని గమనించిన వారికి తొందరపాటు కనపడదు మరి ఇంత వేగం ఎలా వస్తుందని నేను అడిగాను. ప్రాక్టీస్ తో వస్తుందన్నారు. మరొకసారి డాక్టర్ గారి తో మీరు క్యాల్షియం ఇచ్చేటప్పుడు బొటన వేలు కదిలినట్లే కనబడదన్నారు. ఎంత మంచి కాంప్లిమెంట్ ఇచ్చావయ్యా అన్నారు. ఆ మంచి నాకు తెలియటం లేదన్నాను. సర్జన్ కు స్టడీ కంటే కావలసిందేముంది అన్నారు. హాస్పిటల్ లో ముగ్గురు కాంపౌండ్లు ముగ్గురు నర్సులు ఉ ంండేవారు. వారిలో జీవ మణెమ్మ అనే ఆమె ఉద్యోగ విరమణ తర్వాత ప్రతి నెల ఫస్ట్ తేదీన వచ్చి జీతం తీసుకోమన్నారు అలా అయిన వారికి నిండు జీతం ఇవ్వడం ప్రపంచంలో మరెక్కడ లేదు. అన్నపూర్ణమ్మ అనే నర్సు రిటైర్డ్ అయిన తరువాత, ఆమె బంధువు జోషి అనే లాయర్ వచ్చి నెలనెల ఇచ్చే జీతానికి మారుగా కొంత మొత్తం ఒకేసారి ఇస్తే ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుందన్నాడు. ఆయన కోరికను మన్నించారని అనుకుంటాను, దసరా, సంవత్సరాది, శివరాత్రి పండుగలకు కాంపౌండ్లో నర్సులు వాచ్మెన్లు ఇంటికే పిలిచి భోజనం పెట్టేవారు. దసరా పండుగకు ఒక జత బట్టలు ఇచ్చేవారు. వాటిని డాక్టరమ్మ గారే కొనేవారు. డాక్టర్ గారి చరిత్రలో సాహితీ సదస్సు, నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ చెప్పుకోదగినవి. వాటిపై ప్రత్యేక వ్యాసాలు రాగలవని ఆశిస్తున్నాను. రాజకీయ జీవితం తెలుగుదేశం మహానాడులో కొద్ది నిమిషాలే మాట్లాడినా అది ఈనాడు దినపత్రికలో ప్రముఖముగా ప్రచురించబడినది. దానిపై సంపాదకీయం కూడా వచ్చింది. ముగింపు జీవితం చివరి రోజులు ఒంటరిగానే గడిపారు. వారి సోదరి ఒక ఆమె గృహనిర్వాహణ చూసేవారు. పొద్దున్నే లేచి ఒకరోజు గడిచింది. అనుకోవటమేనని నాతో ఒకరోజు అన్నారు. 91 సంవత్సరాల నుండి నేను నా మాట ఎంత బరువైనదో అని అనుకొంటున్నాను.



# మా గురువు గారికే గురువు

కుర్రా శివ కుమారి
గుంటూరు.

నా పేరు శివకుమారి పుట్టింది గుంటూరు జిల్లా పొన్నూరు ప్రక్కన ఒక గ్రామం. పెరిగింది కర్ణాటక, ఉద్యోగం ఆంధ్రా, తెలంగాణ సదాశివరావు గారిని గురించి మాట్లాడే స్థాయి నాకు లేదు కానీ స్మరించుకునే అర్హత మాత్రం ఉంది అని గర్వంగా చెప్పగలను ఎందుకంటే వారు మా గురువుగారు పాతూరి కోటేశ్వరరావు గారికే గురువు, దైవం. పితృ సమానులు, అంతటి పెద్దాయన గురించి రాసే అవకాశం రావడం నా అదృష్టం.

తల్లి, తండ్రి, తోబుట్టువులు చుట్టాలు ఎవరినీ మనము ముందుగా ఎంచుకునే అవకాశం లేదు. చదువు చెప్పే గురువులు కూడా తరగతి గదులతో పాటు మారుతూనే ఉంటారు. జీవితానికి దిశా నిర్దేశం చేసే గురువును ఎంచుకొనే అవకాశం మన చేతుల్లోనే ఉంది. అలా మాస్టారు ఎంచుకున్న గురువుగారే సదాశివరావు గారు. వారి గురించి కర్ణాటకలో ఒక మారుమూల చిన్న క్యాంపులో నివసించే మేము చాలా విన్నాము.

కర్ణాటకలో కన్నెగంటి పాపారావు గారి దగ్గర వారి 650 ఎకరాల వ్యవసాయ క్షేత్రంలో సూపర్వైజర్స్ గా పని చేయించటానికి, ఆంధ్రాలో వివిధ ప్రాంతాల నుండి కొందరిని పెంపిక చేసేవారు. వారిలో మా తల్లిదండ్రులు కూడా ఉన్నారు ఉద్యోగుల పిల్లల చదువులకి, విషయం పరిజ్ఞానానికి దూరం కాకూడదు అని వారే చొడవ తీసుకుని మాకు అన్ని వసులు, విషయాలు ఎంతో చెప్పేవారు రామాయణ, మహాభారతాల నుండి రాష్ట్రస్థాయి, జిల్లా స్థాయిలో వివిధ రంగాలలో గొప్ప వారి గురించి మాకు చెప్పేవారు వారికి సదాశివరావు గారి గురించి ప్రత్యేక అభి ఉండేది. మా తాత గారికి దానికి కారణం సదాశివరావు గారు విద్యా వైద్య రంగాలలో పేర విద్యార్థులకు చేసే నిస్వార్థమైన సేవ అనే చెప్పాలి.

ఆ రోజుల్లోనే 1950 అనుకుంటారు. మా తాతగారు వ్యవసాయ విద్యలో రాష్ట్రస్థాయిలో మంచి ర్యాంక్ సాధించారని చెప్పుకునేవారు ఆయన చదువును చూసి పెద్దింటి సంబంధం మా తాతగారి వెంటబడి పిల్లనిచ్చారు అని చెప్పుకునేవారు అందుకేనేమో విద్య, వైద్య రంగాల్లో ఎనలేసి సేవలు చేసిన సదాశివరావు గారి గురించి ఆయన చేసిన వైద్య విధానం గురించి ఎంతో అభిమానం గా చెప్పేవారు.

11961లో ప్రజా వైద్యశాల పేరుతో పేదలకు గ్రామీణులకు అతి తక్కువ ఫీజుతో వైద్యం అందించి మంచి పేరు గడించారని చెప్పేవారు ఆ రోజుల్లోనే గోల్డ్ మెడల్ సాధించినందువల్ల తెలివైన వైద్యులని ప్రచారం జరిగింది.

కృష్ణా, గుంటూరు, ఒంగోలు, నెల్లూరు జిల్లాల్లో ఉన్న పెద్ద పెద్ద హాస్పిటల్స్ ఒకప్పుడు ఆయన అమృత హస్తాలతో ప్రారంభించి ఆశీర్వదించినవే అని గొప్పగా చెప్పేవారు. ఇండియన్ మెడికల్ అసోసియేషన్లో (ఐఎంఏ) సెక్రెటరీగా ప్రెసిడెంట్ గా, పనిచేసి అభివృద్ధికి ఎంతో తోడ్పడ్డారు అని వ్యక్తిగా, మానవతావాదిగా, సమాజానికి తనవంతు సేవకి ఎప్పుడు ముందుండేవారిని చెప్పేవారు.

మేము ఆంధ్రాకి వచ్చి స్థిరపడి విజ్ఞాన్ లో ఉద్యోగం కోసం పాతూరి కోటేశ్వరావు, గారిని కలిసినప్పుడు పాపారావు గారి పేరు చెప్పగానే ఉద్యోగం ఇచ్చారు. కొన్ని రోజులకి తెలిసింది నేను గురువు దైవంగా భావించే కోటేశ్వరరావు మాస్టారు గారికి సదాశివరావు గారు గురువే కాదు, దైవ సమానులని జె. కె. సి. కాలేజీలో ఉద్యోగం కోసం కోటేశ్వరావు మాస్టారు వెళ్ళినప్పుడు ఎలాంటి రికమండేషన్ లేకుండా పల్లెటూరు నుండి వచ్చిన తనకి ఉద్యోగ అవకాశం ఇచ్చి పెద్ద దిక్కులా అక్కున చేర్చుకున్నారని విజ్ఞాన్ సమావేశాల్లో మాస్టారు గారు అనేక సార్లు చెప్పేవారు.

నీకు పెళ్లి అయ్యిందా అని అడిగిన సదాశివరావు గారి ప్రశ్నకు, పిల్ల ఎదగలేదు అని మా మాస్టారు చెప్పిన సమాధానంలో నిజాయితీ, అమాయకత్వం కనిపించాయామో, లేక నా ఆశయాలకు, సేవా దృక్పథానికి వారసుడు దొరికాడు అనిపించిందో తెలియదు గానీ, వారి బంధానికి ఆ రోజే పునాది పడిందట. మా పెద్దాయన సదాశివరావు గారి మీద పెంచుకున్న అభిమానానికి అవధులు లేకుండా పోయాయి. వారి పెద్దబ్బాయి డాక్టర్ కిరణ్ గారు కూడా సదాశివరావు గారు అంటే ప్రాణం. అనే చెప్పాలి. వారి వైద్య విధానం కూడా దగ్గరి పోలిక అనిపిస్తుంది. పేదవారికి ఉచిత వైద్యం, ప్రేమగా పలకరించి ధైర్యం చెప్పే విధానం. అనాధ పిల్లలకి ఫ్రీ చదువు మొదలగు విషయాలలో సదాశివరావు గారి వారసత్వం తీసుకున్నారేమో అనిపిస్తుంది.

డాక్టర్ గారి వృద్ధాప్య దశలో, కోటేశ్వరరావు మాస్టారు ప్రతిరోజు వెళ్లి డాక్టరు గారిని చూసేవారని మాత్రమే తెలుసు కానీ, ఎంత అనేది సదాశివరావు గారి మరణించిన తర్వాత వారి పేరు మీద కళాసమితి స్థాపించి చేసి ప్రతి సంవత్సరం ఉత్సవాలు క్రమం తప్పకుండా నిర్వహిస్తున్నారు.

ఒకసారి ముఖ్యఅతిథిగా, డాక్టర్ యర్రా నాగేశ్వరరావు గారు మాట్లాడుతూ పెద్దాయన సదాశివరావు. గారు అంటే కోటేశ్వరరావు గారికి అమితమైన భక్తి అని చెప్పారు.

వారు ఆపరేషన్ చేయించుకుని హాస్పటల్లో విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు మాస్టారు గారు డాక్టరు గారి కాళ్లు పట్టటం చూశాను. దానికి మాస్టారు బదిలిస్తూ వారు నాకు వారు తండ్రి, దైవ సమానులని అన్నారు ఆ సంఘటన చెప్పి ప్రేక్షకులకు కళ్ళ నీళ్లు తెప్పించడమే కాకుండా అందరూ నిల్చుని సభ మారుమ్రోగేలా చప్పట్లు కొట్టేలా చేశారు.

మరొక మారు, డాక్టర్ గారికి సహాయకుడిగా ఉన్న తమ్ముని కుమారుడు బయటకు వెళ్లి రావటం ఆలస్యం అవ్వటం వలన యూరిన్ పాస్ చేస్తారా అని అడిగారట సదాశివరావు గారిని మాస్టారు గారు మొహమాటపడి వస్తాడులే అని చెప్పారట. అప్పుడు మాస్టారు గారు తన చేతులతోనే గురువుగారి యూరిన్ పట్టారట.

ఒక ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్, కొన్ని వేల మంది స్టూడెంట్స్, వందల మంది స్టాఫ్, వి.ఐ.పి లు, వి.వి.ఐ.పి.లు ఆయనను కీర్తిస్తుంటే, ఆయన ఒక సామాన్యుడిలా యూరిన్ పట్టడం డాక్టరు గారి కళ్ళల్లో చెమ్మ చూసి, మా నాన్న నా చేత సేవ చేయించుకోకుండానే మరణించారు. ఆ అదృష్టం ఈ రూపంలో దక్కినందుకు సంతోషిస్తున్నాను. మీరు బాధపడకండి అని డాక్టర్ గారికి ఉపశమనం కలిగించారట. అది వాళ్ళిద్దరి మధ్య ఉన్న ఆత్మీయ బంధం.

సదాశివరావు గారు వీలునామా వ్రాసి సాక్ష్య సంతకం మాస్టారుతో పెట్టించారట. అది మాస్టరు గారు ఎప్పుడూ గొప్ప పురస్కారంగా భావిస్తారు. ఇప్పటికీ ఎన్నోసార్లు ఆయన ఆనందంతో చెప్పటం నేను విన్నాను. మొన్న జరిగిన మాస్టారి "గురువందన" సభలో చెప్పి నాలుగు వేల మందికి హర్షాతిరేకం కలిగించారు. అంతటి శిష్యుడిని పొందటం సదాశివరావు గారి అదృష్టమా, గురువుగా సదాశివరావు గారు దొరకటం మా మాస్టారు అదృష్టమా. ఇదే ఆదర్శనీయమైన అనుబంధం.

ఇలాంటి విలువలు, సేవా దృక్పథం ఉన్న మహానుభావులు ఉన్న కాలంలో మనం కూడా సంచరించటం, వారితో మెలగడం ఒక గొప్ప అనుభూతి, వరంగా భావించాలి..

ఇలాంటి ఉత్సవాలు నిర్వహించి డాక్టర్ గారిని మరో వంద ఏళ్లు జీవింపజేసే ప్రయత్నం చేస్తున్న శతజయంతి సంచిక నిర్వాహకులకు పాదాభివందనాలు.

# నా శస్త్ర చికిత్స గురువు

డాక్టర్ సుబ్బారావు చదలవాడ
యునైటెడ్ కింగ్‌డమ్

నేను 4వ సంవత్సరం మెడికల్ స్టూడెంట్‌గా ఉన్నప్పుడు డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు నాకు గురువు (గౌరవ సర్జరీ ప్రొఫెసర్). ఆయన మాకు సర్జరీ సూత్రాలను బోధించారు. మెడికల్ స్టూడెంట్‌గా నేను అతని హాస్పిటల్ పీపుల్స్ నర్సింగ్ హోమ్‌ని సందర్శించేవాడిని. మెడోర్ సారుతో నాకు మంచి సాన్నిహిత్యం ఉంది, నా హౌస్ సర్జన్ సంవత్సరంలో డాక్టర్ గారు సాయంత్రాల్లో తన ఆసుపత్రిలో చేరమని నన్ను ఆహ్వానించారు. అక్కడ నేను పేషెంట్ కన్సల్టేషన్స్‌లో చేరతాను, అతని వార్డు రౌండ్‌లను అనుసరించాను, ఆపరేషన్ల సమయంలో అతనికి సహాయం చేస్తాను. నేను అతని నుండి ప్రేరణ పొందాను, సాధారణ సర్జన్‌గా మారాలనే నా ఆసక్తి, సంకల్పానికి ఇది ప్రారంభ స్థానం. నేను నా పోస్ట్ గ్రాడ్యుయేషన్ కోసం మాస్టర్ ఆఫ్ సర్జరీ ప్రోగ్రామ్‌లో చేరాను, నేను 1974లో నా ఎంఎస్‌లో ఉత్తీర్ణత సాధించాను, డాక్టర్‌గారితో నాకు పరిచయం ఉన్న సమయంలో, నేను సర్జరీలో నా నైపుణ్యాలను మెరుగుపరుచుకున్నాను, నేను మంచి సర్జన్‌గా మారడం, ఎప్పుడు ఆపరేట్ చేయాలి, ఎప్పుడు చేయాలో నేర్చుకున్నాను. అత్యంత ముఖ్యమైన పాఠం కాదు.

డాక్టర్ గారు నుండి వివిధ శస్త్రచికిత్సా నైపుణ్యాలు, జీవన నైపుణ్యాలను నేర్చుకునే అవకాశం నాకు లభించింది, అతను చాలా సహాయకారిగా, పరిపూర్ణమైన పెద్దమనిషి, అద్భుతమైన జనరల్ సర్జన్, కష్టాల్లో ఉన్న ఎవరికైనా సహాయం చేసేవాడు. అతని పేషెంట్ కన్సల్టేషన్ రుసుము చాలా తక్కువ, అతను పేద ప్రజలకు ఎటువంటి రుసుము లేకుండా చికిత్స చేసేవాడు

డాక్టర్ గారు వివిధ విద్యా (నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ ద్వారా), సాహిత్య, రాజకీయ కార్యక్రమాలలో కూడా పాల్గొన్నారు.

చాలా మంది వైద్యులు ఒకటి నుండి రెండు సంవత్సరాలు M. B.B.S లేదా M.S ఉత్తీర్ణులయ్యాక డాక్టర్ గారితో కలిసి పనిచేశారు, పట్టణాలు, గ్రామాలలో ప్రాక్టీస్ చేయమని వారిని ప్రోత్సహించారు. డాక్టర్ గారు ఆంధ్ర ప్రదేశ్ అంతటా అనేక ఆసుపత్రులను ప్రారంభించారు, ఆ వైద్యులు వారి కమ్యూనిటీలకు సేవ చేస్తూ వారి జీవితాలలో విజయం సాధించారు. ఈ ప్రారంభోత్సవాల కోసం నేను డాక్టర్ గారితో పాటు వివిధ పట్టణాలు, గ్రామాలకు వెళ్లేవాడిని, వారి ఉనికి వారి స్వతంత్ర వృత్తి, జీవనోపాధిని ఏర్పరుచుకునే వారికి విశ్వాసాన్ని, ధైర్యాన్ని, మార్గదర్శకత్వాన్ని ఎలా ఇస్తుందో నేను చూశాను.

నేను ఐదు సంవత్సరాలు M.S తర్వాత డాక్టర్ గారితో, మా అత్తగారితో (డాక్టర్ జయప్రదాంబ గారు) పనిచేశాను. వారు తమ కుటుంబం, రోగులు, ఆసుపత్రికి ఎంత అంకితభావంతో ఉన్నారో, వారు ఒకరికొకరు అపారమైన మద్దతునిచ్చారో నేను గమనించాను. తర్వాత నేను వెల్లూరు (యూరాలజీ), పాండిచ్చేరిలో సర్జికల్ రిజిస్ట్రార్‌గా కొంతకాలం పనిచేశాను. డాక్టర్ గారు, మా అత్తగారు తన రాజకీయ జీవితాన్ని ప్రారంభించినప్పుడు వారికి సహాయం చేయడానికి నేను పీపుల్స్ నర్సింగ్ హోమ్‌కి తిరిగి వచ్చాను.

ఇక నా జీవితంలో రెండో అధ్యాయం మొదలైంది. నేను ఆగస్ట్ 1974లో డాక్టర్ గారి కుమార్తె డాక్టర్ ఉమాబాలాను వివాహం చేసుకున్నాను, 1979లో యూరాలజీ (ఎండోస్కోపిక్ సర్జరీ)లో నైపుణ్యం సాధించడానికి UKకి విదేశాలకు వెళ్లాలని నిర్ణయించుకున్నాను. నా కుటుంబం కొంతకాలం తర్వాత నాతో చేరింది, మేము మొదట మా పిల్లల చదువుల కోసం UKలో స్థిరపడాలని నిర్ణయించుకున్నాము. నేను UKలో గత 44 సంవత్సరాలుగా జనరల్ ప్రాక్టీస్, యూరాలజీలో పని చేస్తున్నాను, కానీ నేను ఇప్పుడు యూరాలజీ నుండి రిటైర్ అయ్యాను, మా ఇద్దరు కుమార్తెలు సుమన, తులసి వైద్యులు జనరల్ ప్రాక్టీషనర్లుగా పనిచేస్తున్నారు (మొదటిది ఆస్ట్రేలియాలో స్థిరపడింది, రెండవ కుమార్తె లండన్‌లో పని చేస్తోంది), ఇద్దరూ కూడా తమ తాత వలె వైద్య విద్యలో పాలుపంచుకున్నారు.

నేను కొన్ని రోజుల క్రితం నా పెద్ద కుమార్తె సుమనను ఆమె బ్యాగ్‌లో స్టెతస్కోప్ కలిగి ఉండగా అడిగాను, ఆమె ప్రతిస్పందన నేను మెడికల్ స్కూల్ నుండి గ్రాడ్యుయేట్ అయినప్పుడు నా స్టెత్‌ను వీలైనంత వరకు నా దగ్గర ఉంచుకోమని టాటా చెప్పింది. వైద్య సంరక్షణ, నేను ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండాలి.

గుంటూరు జిల్లాలో, ఇతర ప్రాంతాలలో డాక్టర్ గారు అనే పదం ప్రధానంగా డాక్టర్ కాసరనేని సదాశివరావును సూచిస్తుంది.

ప్రజలు ఇప్పటికీ ఆయనను గుర్తుంచుకుంటారు, అక్టోబర్ 2023లో ఆయన శతజయంతి వేడుకలు జరుపుకోవడం ఆయన ప్రభావానికి నిదర్శనం. ఇతరులకు ఆదర్శంగా నిలిచాడు.

డాక్టర్ గారు నా సర్జికల్ గురుగా, సహోద్యోగిగా, నా ప్రియమైన మామగారిగా నా జ్ఞాపకాలను నేను ఎంతో ఆదరిస్తున్నాను.



# "డాక్టర్ గారు" ప్రతిబింబాలు

రామ్ కృష్ణ పాండా మాంట్రియల్, కెనడా
అక్టోబర్ 2023

ఎదుగుతున్నప్పుడు, ఎవరైనా "డాక్టర్ గారు" అనే పదాన్ని ప్రస్తావిస్తే, అది తక్షణమే కుటుంబ వైద్యుడని అర్థం, అనారోగ్యంతో ఉన్న కుటుంబ సభ్యులందరినీ ఆదుకునేవాడు, 60వ దశకం ప్రారంభంలో నేను 'డాక్టర్ గారూ'ను మొదటిసారి కలిశాను. ఈ పదానికి ప్రపంచంలో ఒకే ఒక్క వ్యక్తి అర్థం వచ్చింది, డాక్టర్ కాసరనేనిసదాశివ రావు గారు. అయితే ఆయన భార్య డాక్టర్ జయప్రదాంబ 'డాక్టరమ్మగారు. ఈ పదాలు వారి వృత్తిపరమైన పొట్టితనానికి సంబంధించిన పదాలు మాత్రమే కాదు, వ్యక్తిగతంగా వారి ఆప్యాయతను అనుభవించిన తర్వాత చాలా ఎక్కువ ప్రతిధ్వనించే పదాలు.

నేను గుంటూరులో మా అత్త, కోడళ్లను (దివంగత అనుమోలు కృష్ణ వర్ధనరావు కుటుంబం) సందర్శించేవాడిని, డాక్టర్‌గారి కుటుంబం, అతని కుటుంబం గురించి నాకు తెలుసు, అప్పుడు చాలా సన్నిహిత కుటుంబ స్నేహితులు. గుంపులో పెద్దవాడైనందున, వారి పిల్లలు–రామబాల, ఉమాబాల, రమేష్, ఉష, సురేష్‌లకు నేను అన్నయ్యను అయ్యాను. రమేశ్ మా చెల్లెలితో నాకు బావమరిది అయ్యాక ఆ మాట నిజమైంది. అత్తగారు డా. శ్రీ వల్లి అనుమోలు. మా మధ్య ఆప్యాయత, ఆప్యాయత ఈ రోజు వరకు కొనసాగుతుంది, ఎప్పటికీ ఉంటుంది. నేను గుంటూరు వెళ్లినప్పుడల్లా డాక్టర్‌గారి కుటుంబాన్ని పరామర్శిస్తూనే ఉంటారు. మేము కలిసి గొప్ప కుటుంబ సెలవుల జ్ఞాపకాలను కలిగి ఉన్నాము, బంధాలను సుస్థిరం చేస్తాము.

వైద్య నిపుణుడిని కానందున, నా జ్ఞాపకాలు, డాక్టర్‌గారి జ్ఞాపకాలు భిన్నమైన కోణం నుండి ఉన్నాయి. నేను అతనిని తన సమయాన్ని, శక్తిని వెచ్చించిన వ్యక్తిగా చూశాను, అతనిని ఆరాధించే రోగుల కోసం మాత్రమే కాకుండా, అతని సహాయం లేదా సలహా అవసరమయ్యే తక్షణ కుటుంబాలు లేదా సమాజాలలో ఎవరికైనా అతని రిజర్వ్ విధానం వెనుక, తాదాత్మ్యం, అపరిమితమైన హృదయం ఉంది. ఇవ్వడానికి, సహాయం చేసే సామర్థ్యం. అతని జీవితాంతం దాదాపు అతని జీవితాంతం వరకు అతని వైపు చూడగలిగే అదృష్టం నాకు కలిగింది. గుంటూరు సందర్శన అంటే ఎప్పుడూ ఆయనతో మరిచిపోలేని సమయాన్ని గడపడానికి ప్రత్యేక సందర్శన. డాక్టర్ గారు చాలా అరుదైన వ్యక్తి, ఆయనతో సన్నిహితంగా మెలిగిన ప్రతి ఒక్కరికీ అతని జ్ఞాపకాలు చెక్కబడి ఉంటాయి.

ఈ చాలా ప్రత్యేకమైన పుట్టినరోజు నేను సతజయంతి ఆయనను, అతని సహకారాన్ని జరుపుకోవడానికి మాత్రమే కాదు, వాటిని మనం చేయగలిగిన ప్రతి విధంగా అనుకరించడానికి. భవిష్యత్ తరాలకు అతని ప్రత్యేక వారసత్వాన్ని అందించడానికి ఇది చాలా సరైన మార్గం.

# డాక్టరు దంపతులు

## డా. కాసరనేని సదాశివరావు
## డా. జయప్రదాంబ



# నా జ్ఞాపకాలు

డాక్టర్ వేమూరి రమేష్ బాబు

నేను 1967 నుండి 1970 సంవత్సరాల మధ్య గుంటూరు మెడికల్ కాలేజీలో సదాశివరావు గారి విద్యార్థిని, డాక్టర్ గోపాలకృష్ణయ్య గారు S–V, S–V1 యూనిట్లకు గౌరవ ఆచార్యులుగా, సర్జన్లుగా పనిచేసి గుర్తింపు పొందారని చెప్పుకోవడానికి చాలా గర్వంగా ఉంది. నా సీనియర్ క్లినికల్ ఇయర్‌లో డాక్టర్ సదాశివరావు గారి యూనిట్‌లో నేను తిరిగే రెండు ఉత్తమమైనవి, నేను, నా క్లాస్‌మేట్స్‌లో ఇద్దరు కనగల పార్థసారధి, చెనుమోలు సుబ్బారావుతో కలిసి కొత్తపేటలోని తన ప్రైవేట్ క్లినిక్‌కి వెళ్లేవారు, ముఖ్యంగా హౌస్ సర్జన్సీ సంవత్సరంలో అతను అతని శస్త్రచికిత్సకు సహాయం చేయడానికి, అతని ఇన్–పేషెంట్ రౌండ్‌లతో అతనిని అనుసరించడానికి మాకు అవకాశం ఇచ్చాము, మేము క్లినిక్ నుండి అతని అరుదైన రోజులలో మా స్వంతంగా ఇన్–పేషెంట్ రౌండ్‌లను కూడా చేసాము. కాబట్టి మేము అతని నుండి ప్రభుత్వ జనరల్ హాస్పిటల్‌తో పాటు అతని ప్రైవేట్ క్లినిక్‌లో నేర్చుకునే పూర్తి ప్రయోజనాన్ని పొందుతాము.

మా మధ్య ప్రత్యేకమైన చెప్పని సంబంధం ఉందని నేను భావించాను. అతనికి రమేష్ అనే కొడుకు ఉన్నాడు, నా పేరు కూడా రమేష్. అతనికి సమీర్ అనే మనవడు ఉన్నాడు, మా చిన్న కొడుకుకి సమీర్ అని పేరు పెట్టడానికి అతను పాక్షికంగా బాధ్యత వహిస్తాడు. డాక్టర్ సదాశివరావు గారు అమెరికా పర్యటనలో మిచిగాన్‌లోని ఫ్రాంక్లిన్‌లో మమ్మల్ని సందర్శించారు. అతను తన మనవడు సమీర్ నుండి డల్లాస్‌లోని డెట్రాయిట్, MIకి వెళ్లాడు, నేను M.S చేయడానికి పాక్షికంగా బాధ్యత వహిస్తాడు. నేను నా E.C.F.M.G ఉత్తీర్ణత సాధించినప్పటికీ యు.ఎస్ వెళ్ళే ముందు నా సీనియర్‌లతో నా హౌస్–సర్జెన్సీ ప్రారంభంలో.

డాక్టర్ సద్శివరావు గారికి వినయపూర్వకమైన ఆరంభం ఉండవచ్చు, కానీ కష్టపడి పని చేయడం, క్రమశిక్షణతో ఆయన తనని తానుగా మార్చుకున్నారు. మా నాన్న నుండి నేను నేర్చుకున్న అదే పాఠం, కష్టపడి పనిచేయడం, క్రమశిక్షణ మీరు జీవితంలో ఎక్కడికి వెళ్లాలనుకున్నా మిమ్మల్ని తీసుకెళ్తాయి. అతను సింపుల్ అండ్ డౌన్ టు ఎర్త్ పర్సన్. అతను పరిచయం ఉన్న వ్యక్తులను తెలుసుకోవడంలో నిజమైన ఆసక్తిని తీసుకున్నాడు. అలా ఆయనకు కృష్ణా, గుంటూరు జిల్లాల్లో చాలా కుటుంబాలతో పరిచయం ఉండేది.

అతను నిజమైన మానవతావాది, మంచి వైద్యుడు, మంచి సర్జన్. అతను చాలా ట్యూషన్ లేకుండా ఎక్కువగా స్వీయ–నిర్మితుడు. అతను తన రోగులకు తన సేవలకు తన రుసుమును నిర్ణయించడంలో తన రోగుల ఆర్థిక స్థితిని ఎల్లప్పుడూ పరిగణనలోకి తీసుకున్నాడు. అతను చాలా మంది యువ వైద్యులకు గ్రామీణ ప్రాంతాలు, చిన్న పట్టణాలలో వారి అభ్యాసాలను స్థాపించడంలో సహాయం చేశాడు. అతను ప్రాక్టికల్ సర్జన్, అతని శస్త్రచికిత్స రోగులకు ఉత్తమ ఫలితాలను పొందాడు. అతను తన జీవితకాలంలో కొంచెం సాధించాడు, భవిష్యత్ తరాలకు మంచి ఉదాహరణగా నిలిచాడు.

ఆయన ఆత్మకు ఎప్పుడూ శాంతి కలుగుతుంది!!



# గొప్పవ్యక్తి డాక్టర్ సదాశివరావు గారు

గూడూరు రాంబాబు అడ్వకేట్

ఒక వ్యక్తిగా, డాక్టర్ గా, మానవతావాదిగా, సామాన్య ప్రజానీకం ముఖ్యంగా రైతు కుటుంబాల మీద ఎంతో ఆదరణ చూపి వారికి ఆలోచన పరంగా, సామాజిక పరంగా, విద్యాపరంగా తనకు తోచినట్లు ఆయన జీవిత కాలంలో ఎంతో సహాయం చేసిన వ్యక్తి డాక్టర్ సదాశివరావు గారు.

నేను 1962 సెప్టెంబర్ 20న (సుమారు 61 సంవత్సరాలు) డాక్టర్ సదాశివరావు గారి హాస్పటల్లో నా రికార్డ్స్ లో ఉన్నది. నాకు తెలిసి చిన్నతనం నుండి ఏదో ఒక రుగ్మతలతో మా కుటుంబ సభ్యులు వారి హాస్పటల్లో ఇన్ పేషెంట్, అవుట్ పేషెంట్లుగా సాధారణంగా చికిత్స పొందేవారు మా తల్లి గారి తండ్రి పాలినేని వెంకటేశ్వర్లు గారు (రిటైర్డ్ తహసీల్దార్) వారి హాస్పటల్ దాదాపు రెండు నెలలు ట్రీట్మెంట్ తర్వాత చనిపోయినప్పుడు, దాదాపు నేను నిత్యం సైకిల్ మీద కొత్తపేటలోని వారి హాస్పటల్ కు క్యారేజ్ తీసుకుని వెళ్లడమో లేక ఏదో విషయంగానో వెళ్తూ ఉండేవాడిని. నేను అప్పుడు ఇంటర్మీడియట్ చదువుతున్నాను. డాక్టర్ గారి హాస్పటల్ కొత్తపేట చాలా పెద్ద కాంపౌండ్ లో ఉండేది, అప్పటికి గుంటూరులో హాస్పిటల్స్ తక్కువ విస్తీర్ణంలో బహుళ అంతస్తులు ఉండే కాలంలో ఒక శానిటోరియం లాగా ఉండేది. డాక్టర్ గారి హాస్పిటల్, డాక్టర్ గారి మనస్సుకు అద్దం పట్టేలా సింపుల్ గా, విశాలంగా హాస్పటల్ ఉండేది.

ఆయన మనుషులను స్వభావాలను బట్టి వారిని చాలా ఆదరణగా చూసేవారు. నేను 2000 వ సంవత్సరంలో కాంగ్రెస్ పార్టీ తరపున కార్పొరేటర్ గా పోటీ చేసాను అప్పుడు ఆ డివిజన్లో డాక్టర్ గారు. వారి భావజాలం జనతపార్టీ జనతా పార్టీ నాయకుడిగా గొప్ప పేరు రాష్ట్రస్థాయిలో సంపాదించి ఆ పార్టీ తరపున పార్లమెంటుకు, అసెంబ్లీక్ కూడా పోటీ చేశారు. అటువంటి వ్యక్తి పోలింగ్ బూత్ లో ఓటు వేసి నేను నీకు ఓటు వేశాను అని తెల్పిన గొప్ప వ్యక్తి తరువాత ఆయనను నేను కలిసినప్పుడు కూడా అప్పుడు తెలుగుదేశంలో ఉన్నారు. కార్పొరేషన్ ఎన్నికలంటే స్థానిక సమస్యల మీద, అందువల్ల పార్టీకి అతీతంగా నేను ఓటు వేసానులే అన్నారు. నేను గుంటూరులో లిక్కర్ వ్యాపారంలో స్థిరపడిన వ్యక్తిని వారు పెదకూరపాడు లో తెలుగుదేశం

టికెట్ మీద ఒకసారి గెల్చి రెండోసారి వారి ఎలక్షన్లో బయ్యవరంలో రీపోలింగ్ జరిగితే నేను పెద్ద పెట్టున జన సమీకరణ చేసి ఏమాత్రం రిగ్గింగ్ జరగకుండా ఆపగలిగాను.

నా తల్లి గారు శ్రీ. శే. గూడూరు సత్యకుమారి గారు ఉమెన్స్ కాలేజీలో లెక్చరర్ గా పనిచేశారు. ఆమె చదువుకునే రోజుల్లో ఆమెకు డాక్టర్ గారు మేనకోడలు 'ఆశ' అనే ఆమె బాగా సన్నిహితురాలుగా ఉండేది అని మా అమ్మగారు చెప్పేవారు. ఆ రోజుల్లో లక్ష్మీపురంలో డాక్టర్ గారి ఇల్లు, పండరీపురంలో మా తాత గారి ఇల్లు చాలా విశాలముగా (1800 గజాలలో) ఉండేవి. నేను చదువుకొన్న పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలు J.K.C College లో డాక్టర్ గారు ప్రెసిడెంట్ నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ ప్రెసిడెంట్ ఇట్లా ఎన్నో పదవులు చేస్తుండేవారు. ఆయన ధర్మరాజు.

నా భార్య గూడూరు శోభారాణి, నాగార్జున యూనివర్సిటీలో ఇంగ్లీషులో Ph.D., తీసుకొని గుంటూరులోనే ఎక్కడన్న పనిచేస్తానని అన్నప్పుడు J.K.C College లో ఇంగ్లీషు పూ+%లో చాలా సాధారణంగా నా భార్యను, డాక్టర్ గారు చేర్చుకున్నారు. ఆ భూ+% సెక్షన్ లో, నా భార్య ఒక సంవత్సరం పనిచేసింది. He is true academic lover of literature and love, a human doctor who gave life to thousands of people his in entire life.

డాక్టర్ సదాశివరావు గారి గురించి ఎంత చెప్పినా తక్కువే వారికి మొదటి నుంచి కాంగ్రెస్ వ్యతిరేకత వారికి అప్పటి జనతా పార్టీ నేషనల్ లీడర్స్, కమ్యూనిస్టులతో చాలా సన్నిహిత సంబంధాలు ఉండేవి. ఆయన మన రాష్ట్రంలో, ముఖ్యంగా మన గుంటూరు పట్టణంలో ఎంతో ఉన్నత, ఉదాత్త భావాలలో ఖ్యాతి గడించి నిష్క్రమించిన మహానుభావుడు. వారి శతజయంతి ఉత్సవాల సందర్భంగా నేను మనస్ఫూర్తిగా నివాళులు అర్పిస్తున్నాను.



డాక్టర్ సదాశివరావు గారు

## మాకు గురువు, మార్గదర్శకులు

డాక్టర్ కొసరాజు కళాధర్, గుంటూరు

సమాజంలో అనేక మార్పులు వస్తూ ఉంటాయి. అనేకమంది వైద్యులు కొట్టుకుపోకుండా కనీస విలువలు పాటిస్తూ వైద్యం చేస్తున్నారంటే డాక్టర్ సదాశివరావు గారి లాంటి డాక్టర్ల తో పరిచయం, అనుబంధమే అంటే అతిశయోక్తి కాదు. నా జీవితంలో 1962 నుండి వివిధ వైవిధ్యమైన సందర్భాలలో వారితో నాకు అనుభవం ఉంది. చదువుల కోసం రేపల్లె నుండి గుంటూరు కి మా కుటుంబం వచ్చి, కొత్తపేటలో ఇల్లు అద్దెకు తీసుకొని ఉన్నాము. అప్పటి నుండి వారు మాకూ కృష్ణ, గుంటూరు జిల్లాల్లో ఉన్న మా బంధువులకి ఫ్యామిలీ డాక్టర్. మా ఇల్లు వారి హాస్పిటల్ నుండి ఇంటికి వెళ్లే దారిలో ఉన్నందున, మాకు ఆరోగ్యం బాగా లేకపోతే రాత్రి 8:00 గంటలకు కూడా ఇంటికి వచ్చి చూసేవారు. ఆ రోజుల్లో వారి సర్జరీల గురించి కథలుగా చెప్పుకునేవారు. tonsillec- tomy కూర్చోపెట్టి చేశారని, కడుపులో గడ్డ వస్తే అలా మెలితిప్పి తీసేసే వారని చెప్పేవారు. 1967 లో గుంటూరు మెడికల్ కాలేజీలో చేరినప్పుడు వారు మాకు సర్జరీలో Honarary ప్రొఫెసర్ క్లాస్ లో ముందుకొచ్చి కూర్చో మనేవారు. G.G.H లో ఓ పి.లో ఎక్కువమంది స్టూడెంట్స్ వచ్చేవారు. ఆయన క్లినిక్స్ కి 1981లో నా ప్రాక్టీస్ సాంబశివపేట మూడో లైన్ లో ప్రజా వైద్యశాల పేరుతో ప్రారంభించారు. పైగా అది పెట్టింది డాక్టర్ గారు. 1951 లో ప్రాక్టీస్ పెట్టిన బిల్డింగులోనే పేరు కూడా అదే కాకపోతే ఇంగ్లీషులో ఆయనను హాస్పటల్ పేరు పీపుల్స్ నర్సింగ్ హోమ్. నేను పీపుల్స్ పాలి క్లినిక్ పేరు మీద రిజిస్టర్ చేయించాను. ఇప్పుడు ఆ బిల్డింగ్ కొన్నాను. నా స్వాధీనంలోనే ఉంది. ఆంధ్రప్రదేశ్ పౌర హక్కుల సంఘం జిల్లా కార్యదర్శిగా నేను పనిచేశాను. డాక్టర్ గారు ఆ సంఘానికి ముఖ్య సలహాదారుగా ఉన్నారు. కార్యవర్గ సమావేశాలు ఆ బిల్డింగ్స్ లోనే జరిగేవి. ఆ సమావేశాలకు వచ్చినప్పుడు డాక్టర్ గారు రూములన్నీ తిరిగి, తను అక్కడ ప్రాక్టీస్ చేసిన విషయాలు గుర్తు చేసుకునేవారు. 1975-77 ఎమర్జెన్సీ తరువాత, జరిగిన ఎన్నికల్లో ఆయన పోటీ చేసినప్పుడు రాజకీయాలతో సంబంధం లేకుండా డాక్టర్లు అందరం మద్దతు ఇచ్చాము. గవర్నమెంట్ హాస్పటల్ నుండి ప్రత్యేకంగా డాక్టర్లు పెద్ద ప్రదర్శన చేశారు. ఎమర్జెన్సీ ఎత్తివేసినా అనేకమంది వామపక్ష నాయకులు జైల్లో ఉండటం వలన సిపిఎం తరపున గుంటూరులో నన్ను ఇన్చార్జిగా నియమించారు. ఇక్కడ చిన్న సంఘటన చెప్పాలి. ఆ ఎలక్షన్లలో తిరగటానికి నాకు కారు, కొంత డబ్బు ఇచ్చారు. పని లేనప్పుడు కాదు అప్ప చెప్పటానికి ఇంటికి వెళితే, ఇది ఇస్తే మళ్లీ నీకు రాదు కాబట్టి పని ఉన్నా లేకపోయినా ఎలక్షన్ అయ్యే వరకు ఉంచుకోమన్నారు. ఎలక్షన్ అయిన రెండు రోజులు తర్వాత తీసుకున్న డబ్బుకి ఖర్చు చిట్టా వ్రాసి మిగిలిన డబ్బులు తిరిగి ఇచ్చాను. ఆయన నవ్వుతూ ఈ ఎన్నికల్లో డబ్బులు తీసుకు వెళ్ళటమే కానీ, వెనక్కి వచ్చినవి నీ ఒక్కడివే అన్నారు.

డాక్టర్ గారి పిల్లలు ఐదుగురు వారి కుటుంబాలతో కూడా నాకు పరిచయం ఉంది. ఎక్కువగా రమాబాల సురేష్ లతో చదువుకునే రోజుల నుండి. తరువాత ప్రాక్టీస్ చేస్తున్నప్పుడు మెడికల్ అసిస్టెంట్ గా కలిసి పని చేసాము ఎన్నో సందర్భాల్లో డాక్టర్ గారి ఇంటికి వెళ్లడం మాట్లాడటం జరిగేది. ఎప్పుడు కలిసినా మెడికల్ అసిస్ట్ న్స్ గురించి వివరాలు అడిగి తెలుసుకునేవారు.

వారు I.M.A లో సెక్రటరీగా, ప్రెసిడెంట్ గా పనిచేసి I.M.A అభివృద్ధికి తోడ్పడ్డారు. సదాశివమ్ వ్రాయడం కూడా నాకు భాగం ఉందని నేను భావిస్తాను 1999లో నా ఆరోగ్యం బాగాలేక హైదరాబాద్ కేర్ హాస్పిటల్ లో ఉన్నప్పుడు వారు నన్ను పలకరించడానికి వచ్చారు. అప్పుడు వారిని బయోగ్రఫీ వ్రాయమని, మీరే మాకు మార్గదర్శకులు అని చెప్పాను. ఒప్పుకోలేదు. ఎవరు చదువుతారు అన్నారు. మూడు నెలల తర్వాత నాకు ఫోన్ చేసి ఇంటికి రమ్మని పిలిచి నువ్వు చెప్పిన దానిమీద బాగా ఆలోచించాను. వ్రాద్దామనుకుంటున్నా నువ్వు రికార్డర్ తీసుకొచ్చి నేను చెప్తాను రికార్డు చెయ్యి అన్నారు. దాన్ని వ్రాయటానికి ఎవరినైనా చూడమన్నారు అలాగే అని కొండవీటి చిన్నయసూరి ని (కొండవీటి వెంకట కవి గారి కుమారుడు) అప్పట్లో నాగార్జున యూనివర్సిటీ ప్రొఫెసర్ ని అడిగాను.

తరువాత ఆయనకు హైదరాబాద్ ట్రాన్స్ఫర్ అయ్యి అది ఆగింది. ఇక ఆ తరువాత డాక్టర్ జగ్గంపూడి రామారావు గారు బాధ్యత తీసుకోవడం సదాశివం మన చేతుల్లోకి రావడం ఒక చరిత్ర. డాక్టర్ సదాశివరావు, డాక్టర్ చల్లపల్లి సాంబశివరావు, డాక్టర్ ఏ శంకర్రావు (మానసిక వైద్యులు లాంటి) అనేకమంది మానవతావాద వైద్యుల కారణంగానే మాలాంటి వారు జీవితాంతం కనీస విలువలు కాపాడుకుంటూ మేము వారి మూలంగా మా కుటుంబాలు బాగుపడ్డాం. వారి పరిచయం మాకు గర్వకారణం.



# గొప్ప స్ఫూర్తి ప్రదాత

డా. గోపాలకృష్ణ గోఖలే హృద్రోగ నిపుణులు

డాక్టర్ సదాశివరావు గారు మా అన్నయ్య డాక్టర్ రామశేషయ్య గారికి 1974లో నా ఇంటర్మీడియడ్ ప్రవేశ కొరకు పరిచయమయ్యారు టెన్త్ క్లాసులో పరీక్షలప్పుడు జ్వరపడినందువల్ల ఫస్ట్ క్లాస్ వచ్చినా మార్పులు ఎక్కువగా రాలేదు. అప్పుడు గుంటూరు జె. కె. సి కాలేజీలో అడ్మిషన్లు దొరకడం కష్టంగా ఉండేది. డాక్టరు గారు ప్రిన్సిపాల్ రోశయ్య గారికి ఒక లెటరు రాసి మా చేతికిచ్చారు. అక్కడికి వెళ్లితే రోశయ్య గారు క్రింద నుంచి పై దాకా చూసి జుట్టు దువ్వుకోవడం చేతగాదా అని మందలించి మరికొన్ని ప్రశ్నలు వేసి చివరకు సీటు ఇచ్చారు. ఇంటర్మీడియట్ బాగా చదివి, గుంటూరు మెడికల్ కాలేజీలోనే సీటు సంపాదించుకున్నాను. డి జి పి గా రిటైరయిన మాలకొండయ్య గారు నా క్లాస్ మేట్. తను బాపట్ల ఎగ్రికల్చరల్ కాలేజీ చేరారు.

డాక్టర్ గారు, కళాశాల కార్యదర్శి అయినందున ప్రతిరోజు సాయంత్రం వచ్చేవారు. కాలేజీ ప్రాంగణమంతా తిరుగుతూ, లెక్చరర్లుతో మాట్లాడం కనిపించేది. కాలేజీ అన్ని వసతులతో, ప్రతిపగల అధ్యాపకులతో మంచి పేరు కలిగి వుండేది డాక్టరు గారిని గురించి పబ్లిక్ లో మంచి అభిప్రాయం వుందని అప్పుడే తెలిసింది.

గుంటూరు మెడికల్ కాలేజీలో డాక్టరు గారి చిన్నబ్బాయి సురేష్, నా క్లాస్మేట్. అచ్చం డాక్టర్ గారిలా వుండేవాడు. కళ్ళజోడు తగిలిస్తే డాక్టర్ గారు అనుకోవచ్చు, రమాబాలా, ఉషా బాలా గారితో కొంత పరిచయముంది. చదువుకునే రోజులను డాక్టర్ గారితో పాటు, మద్దినేని గోపాలకృష్ణ, చిగురుపాటి నాగేశ్వరరావు గార్ల హాస్పిటల్స్ కు వెళ్తుండేవాడిని. వారందరు యువ డాక్టర్లకు స్ఫూర్తి వైద్యంలోనే కాకుండా రోగుల పట్ల వారితో పాటు వచ్చే బంధువుల పట్ల మంచి సంబంధాలు అవగాహన కలిగి వుండేవారు బీద, బిక్కి వారిని కనిపెట్టి వైద్యం చేయడంలో వీరు పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. అందువల్ల వీరంటే మాకు గౌరవము. మా జీవితాల్లో వృత్తికి మార్గ దర్శనం చేశారు. ముఖ్యంగా సదాశివరావు గారికి వైద్య వృత్తి తో పాటు వివిధ రంగాలలో అభినివేశం వుంది. విద్యాసంస్థలు నడపడం,

సాహితీవేత్తలతో సమావేశాలు ఏర్పాటు చేయడం, సామాజిక అవసరాలకు స్పందించడం చివరిగా రాజకీయ రంగంలో ప్రవేశించి రాష్ట్ర అభివృద్ధికి కృషి చేయడం, నన్ను చాలా ప్రభావితం చేశాయి. నేను గుంటూరులో ప్రభుత్వ ఆసుపత్రికి, నా వంతు కృషి చేసి అభివృద్ధికి పాటుపడుచున్నాను. డాక్టర్ సదాశివరావు గారే నాకు స్ఫూర్తి.

డాక్టరు గారి శత దినోత్సవ వేడుకలు జరపడం చాలా సంతోషంగా వుంది. 100 సంవత్సరాలు పండుగ అందరికీ జరగదు. సదాశివరావు గారికి జరుగుతుందంటే, వారు పేదల డాక్టరుగా, ధన వ్యామోహం లేకుండా జీవితాంతం వైద్య సేవ చేయడం. వైద్యం వ్యాపారం కాదని బలంగా నమ్మటమే గాక ఆచరించి యితరులకు ఆదర్శంగా నిలవడం, శతదినోత్సవం సందర్భంగా వారి ఆశయాలను గౌరవిస్తూ మనం ఆచరించడమే వారికి మనం సమర్పించే నివాళి. వారు జీకేసి కాలేజీలో సీటు ఇప్పించకపోతే ఈ గోపాలకృష్ణ గోఖలే ఇంతటి ఘనత సాధించి వుండేవాడు కాదు.

మరొక్క జన్మంటూ ఉంటే డాక్టరుకు బదులు రాజకీయ నాయకుడై దేశాభివృద్ధిలో భాగమవుద్దామని అనుకుంటున్నాను. పశ్చిమదేశాలతో పోలిస్తే, మన ఆరోగ్య విధానం పేదలకు ఇంకా సమీకృత ఆహారము గాని, ఆధునాతన వైద్యం గాని అందడం లేదు. ఇది చట్టాల ద్వారానే సాధ్యమవుతుంది. అదే నా కోరిక.





## అప్పిచ్చువాడు వైద్యుడు!

నాగండ్ల శివనాగేశ్వరరావు సినీ నటులు

చిన్నతనంలో అప్పిచ్చువాడు వైద్యుడు అనే పద్యాన్ని చదువుకున్నప్పుడు, 'అప్పిచ్చువాడు వైద్యుడు' అనే మాటని మా డాక్టరుగారు కాసరనేని సదాశివరావు గారికి నేను అన్వయించుకునేవాడిని. అయితే, కాస్త జ్ఞానం పెరిగిన తర్వాత ఆ పద్యానికి అసలు అర్థం తెలిసింది. అప్పిచ్చువాడు, వైద్యుడు, ఎప్పుడూ ఎడతెగక పారే పేరు, ద్విజుడు లేని ఊరిలో వుండవద్దు అనేది ఆ పద్యం సారాశం. కాబట్టి, వైద్యుడికి, అప్పిచ్చువాడుకి ఎలాంటి సంబంధం లేదు అని కూడా అర్థమైంది. అయినప్పటికీ, వైద్యుడు అంటే... పేషెంట్ల చేత అప్పులు చేయించేవాడు, రోగి చేతికి చిప్ప వచ్చేలా చేసేవాడు అనుకునే పరిస్థితులు ఏర్పడిన నేపథ్యంలో, నేను మా డాక్టరుగారిని మాత్రం అప్పిచ్చువాడు వైద్యుడు అనే అంటాను. ఎందుకంటే, ఆయన అప్పట్లో తన దగ్గరకి వచ్చే పేషెంట్లలో ఆర్థిక స్థోమత లేనివాళ్ళకి ఉచితంగా వైద్యం చేయడం మాత్రమే కాదు... అవసరమైతే ఇన్పేషెంట్లుగా చేర్చుకుని, రూమ్ రెంట్లు అలాంటివేవీ లేకుండా ఉ చితంగా వైద్యం చేసేవారు. సర్జరీ కూడా ఉచితంగా చేసేవారు. పేషెంట్లు కోలుకున్న తర్వాత వాళ్ళు తిరిగి తమ స్వస్థలాలకు వెళ్ళడానికి రవాణా ఖర్చులు ఉన్నాయా, లేవా అనేది కనుక్కొని వాటిని కూడా సర్దుబాటు చేసేవారు అలా పేషెంట్లు ఆయనకు రుణపడేవారు ఆర్థికంగా మాత్రమే కాదు ఆప్యాయత విషయంలో కూడా రుణపడేవారు.

ఒకప్పుడు, అంటే 1960 ఆ ప్రాంతాల్లో రవాణా సౌకర్యాలు సరిగా లేని రోజుల్లో గుంటూరు జిల్లాలోని మారుమూల గ్రామాలకు సదాశివరావు గారే కారు వేసుకుని వెళ్ళి అక్కడ వున్న పేషెంట్ల బాగోగులు చూసేవారు. అవసరమైతే పెట్రొమాక్స్ లైట్ల సాయంతో ఆయన సర్జరీలు చేసిన సందర్భాలు కూడా వున్నాయి.

గుంటూరు జిల్లాలో చాలామంది డాక్టర్లకు ఆయన మార్గదర్శి ఎవరు కొత్తగా వైద్య వృత్తిలో ప్రవేశించి తమ క్లినిక్ లేదా హాస్పిటల్ ఓపెనింగ్ పెట్టుకున్నా, సదాశివరావు గారి చేతుల మీదుగానే తమ హాస్పిటల్ ప్రారంభం జరగాలని కోరుకునేవారు.

ఇలా, వైద్యరంగంలో భగవత్ స్వరూపుడిగా ఆరోజుల్లో అందరి చేతా కొనియాడబడిన సదాశివరావు గారికి మా తాతగారైన నాగండ్ల నాగభూషణం గారు అత్యంత ఆత్మీయుడు. సదాశివరావు గారికి ఏవైనా ప్రత్యేకమైన పరిస్థితులు ఏర్పడినప్పుడు మా తాతయ్య గారిని సలహా అడిగేవారు. వారిద్దరి మధ్య సన్నిహిత సంబంధాలు చిరకాలం కొనసాగాయి. అలా ఆయనతో మా కుటుంబానికి అనుబంధం ఏర్పడింది.

నా మొదటి సినిమా 'మనీ' విడుదలకు ముందు మా నాన్నగారు నాగండ్ల నరసింహారావు గారికి ఆరోగ్యం సరిగా లేకపోవడంతో సదాశివరావు గారి దగ్గరకి తీసుకెళ్ళాము. ఆయన మా నాన్నగారికి ఒక్క బయాప్సీ మాత్రమే చేయించారు. స్కానింగులు, బ్లడ్ టెస్టులు ఇలాంటివేవీ చేయకుండానే మా నాన్నగారిని నిశితంగా పరీక్షించారు. ఆ తర్వాత మీ నాన్నకి గాల్ బ్లాడర్లో కేన్సర్ వుంది. అది చాలా అడ్వాన్సుడ్ స్టేజ్లో వుంది. మహా అయితే వారం, రెండు వారాలకంటే ఆయన ఎక్కువకాలం బతకడు.

ఆయనకి ఈ విషయం చెప్పకుండా, ఇంటికి తీసుకెళ్ళండి. ఆయన ఏది తినాలనుకుంటే అది పెట్టండి... ఎవరిని చూడాలనుకుంటే వాళ్ళని పిలిపించండి... ఎక్కడకి వెళ్ళానుకుంటే అక్కడకి తీసుకెళ్ళండి అని చెప్పారు. అయినా సరే మేము సెకండ్ ఒపీనియన్ అనే పేరుతో మా నాన్నగారిని మరో డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళాం. ఆయన రకరకాల టెస్టులు చేసి, ఆపరేషన్ చేసి గాల్బాడర్ తీసేస్తే సరిపోతుంది... ఇంకో పది సంవత్సరాలు బతుకుతాడు అని చెప్పారు. మేం చాలా సంతోషంగా దానికి ఓకే చెప్పాం. చివరికి ఆపరేషన్ టేబుల్ మీద సర్జరీ మొదలుపెట్టగానే ఆ డాక్టర్కి అప్పటికే పరిస్థితి చెయ్యి దాటిపోయిందని అర్థమైంది. వెంటనే కుట్లు వేసేశారు. ఆరోజు రాత్రికే మా నాన్నగారు విపరీతమైన బాధపడి చనిపోయారు.

మా నాన్న మృత్యువుని రెండు వారాలు ప్రీపోన్ చేశామన్న బాధ ఇప్పటికీ మా సదాశివరావు గారు సూచించినట్టు చివరిరోజుల్లో వారమో. రెండువారాలో మా నాన్న గారు సంతోషంగా వుండే అవకాశం లేకుండా చేశామన్న అపరాధభావం ఇప్పటికీ వెంటాడుతూ వుంటుంది.

నేను ఆయనని చివరిసారి చూసిన సందర్భం నాకు ఇప్పటికీ గుర్తుంది. ఆ సందర్భంగా ఆయను అన్న మాట ఇప్పటికి నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూ వుంటుంది. ఆయన్ని కలవటానికి నేను మా చెల్లెలిక అన్న మాట ఇపులో వాళ్ళింటికి వెళ్ళినప్పుడు ఆయన మందు సిట్టింగ్స్లో వున్నారు. "రారా . సున్ను కూడా కూర్చో" అన్నారు. నేను "లేదండీ, ఇంకోసారి వస్తాను. అప్పుడు మీతో కూర్చుంటాను" అన్నాను. దానికి ఆయన ప్రతిస్పందిస్తూ, "త్వరగా రా.. లేటు చేయకు.. ఎక్కువ టైమ్ లేదు" అన్నారు. ఆ తర్వాత రెండు మూడు నెలలకే చనిపోయారు. ఎంతోమందికి ప్రాణదానం చేసిన ఆయనకి, తన ప్రాణం ఎప్పటి వరకు వుంటుందో తెలియడం వల్లే ఆ మాట అన్నారని నాకు అనిపిస్తూ వుంటుంది.

మా డాక్టర్ సదాశివరావు గారు ఎంతోమందికి విద్యాదానం చేశారు. అవసరం వున్నవారికి కాలేజీలలో, హాస్టల్స్ లో సీట్లు ఇప్పించడంలో ఆయనెప్పుడూ ముందుండేవారు. గుంటూరులో చే కాలేజీ ఆవిర్భావానికి, రెండు కమ్మ హాస్టళ్ళ నిర్మాణానికి ఆయనే మూల కారణం. డాక్టర్ గారు మంచి సాహిత్య పిపాసి, హాస్యప్రియుడు.

ఆయన సమకాలికులైన డాక్టర్లు పొలాలు, స్థలాలు, వాణిజ్య సముదాయాలు సంపాదించుకుంటే, మా డాక్టర్ గారు గుంటూరు జిల్లాలో కొన్ని వేల దేవాలయాలు కట్టించుకున్నారు. ఇవి ఎక్కడ అంటే, అవి పైకి కనిపించేవి కావు ఎప్పటికీ నిత్యనూతనంగా వుంటాయి. మానవ నేత్రాలకు కనిపించని ఆ దేవాలయాలు ఎక్కడ వున్నాయంటే.... ఆయన దగ్గర వైద్యం తీసుకుని, ఆయన చేతుల మీదుగా ఆరోగ్యం పొందిన వారి హృదయాలలో ఆయన అందించిన సహకారం కారణంగా జీవిత కాలాన్ని పెంచుకున్న వారి మనసులలో, మా డాక్టరు గారు ఇప్పుడు శారీరకంగా మనమధ్య లేకపోయినప్పటికీ, ఎన్నో వేలమంది హృదయాలలో శాశ్వతంగా కొలువై వున్నారు.

సాధారణంగా ఎవరికైనా కీర్తిశేషులైన వారి శతజయంతి సందర్భంలో స్మృత్యంజలి ఘటిస్తారు. కానీ, మా డాక్టర్ గారి శతజయంతి సందర్భంగా నేను ఆయనకి స్మృత్యంజలి ఘటించను. పుట్టినరోజు శుభాకాంక్షలే తెలియజేస్తాను. ఎందుకంటే, నాలాంటి ఎన్నో వేలమంది హృదయాలలో ఆయన ఇప్పటికీ జీవించే వున్నారు. అందుకే, డాక్టర్ గారూ... మీకు నా హృదయపూర్వక శతజయంతి శుభాకాంక్షలు.



# డాక్టరు తాతయ్య

డా. పాతూరి కిరణ్ చౌదరి
కిరణ్ అర్థోపెడిక్ క్లినిక్, గుంటూరు

నేను పుట్టింది "ప్రజా వైద్యశాల" లో పెరిగింది సదాశివరావు గారి ఆదరణలో డాక్టరు గారి పెద్దమ్మాయి డాక్టర్ రహబాల కొడుకు సమీర్, నేను చిన్నప్పటి నుండి క్లాస్ మేట్స్ మి. అందువల్ల సమీర్ లాగా నన్నూ ప్రేమగా చూసేవారు. సమీర్ ఇంజనీరింగ్ కి వెళ్ళాడు. నేను మెడిసిన్ చేశాను.

డాక్టరు గారికి మా నాన్న పాతూరి కోటేశ్వరరావు మంచి సాన్నిహిత్యం వుంది. నాన్నకు జె. కె సి కాలేజీ లో డాక్టరు గారే ఉద్యోగం ఇచ్చారు. కానీ వారి మధ్య ఎందుకో తెలియదు గాని, దానికి మించిన అనుబంధం వుంది. డాక్టరు ఏ హాస్పిటల్ ప్రారంభానికి వెళ్లినా, నాన్నను తన కారులో ఎక్కించుకొని వెళ్ళేవారు. డాక్టరమ్మ ఎక్కువ మందితో కలిసేవారు కాదుగానీ, నాన్నన్నా, మా కుటుంబమన్నా చాలా ప్రేమగా వుండేవారు. నేను పుట్టినప్పుడు నాకు పది జతలు దుస్తులు తీసుకొనిరావడం, ఆ వీధిలో వారికి ఆశ్చర్యం కలిగించిందట.

నేను మెడిసిన్ పూర్తి చేసుకొని కొంత కాలం డాక్టర్ లక్ష్మణస్వామి గారి దగ్గర ఎప్రెంటీస్ గా చేసి కొత్తపేట లో క్లినిక్ పెట్టి డాక్టరు గారి చేతుల మీదుగా ప్రారంభింప చేశాను. నేను మెడిసిన్ డిగ్రీ తీసుకొని డాక్టరు గారి దగ్గరికి వెళ్ళినప్పుడు తను వాడిన "స్టెత్" నా మెడలో వేసి నన్ను దీవించారు. డాక్టరుగా పాటించవలసిన పద్ధతులెన్నో క్షుణ్ణంగా చెప్పారు. వారి ఆశయాలకు అనుగుణంగానే నా ప్రాక్టీసు కొనసాగిస్తున్నాను. ఆయన ఫోటోకు దణ్ణం పెట్టకుండా నా సీట్లో నేను కూర్చోలేదు. ఆయన ఆప్యాయత దొరకడం నా అదృష్టం.

డాక్టరు గారు ప్రాక్టీసు మానేసిన తరువాత రెండు సార్లు నా క్లినిక్ కు వచ్చి న వారితో మాట్లాడడం, గడపడం గమనించి కొన్ని ప్రశ్నలు, మరి కొన్ని సూచనలు చేశారు. పేరుకు జనరల్ సర్జనైనా అన్ని జులుపై అవగాహనతో పాటు, అపారమైన విషయ పరిజ్ఞానముంది. గొప్ప అనుభూతి.

అనేక విషయాలు తెలుసుకోవచ్చు. అలాంటి అదృష్టం డాక్టరు గారు విశ్రాం తీసుకునే రోజుల్లో దక్కింది. క్లినిక్ కి వచ్చేముందు ప్రతి రోజు ఒక గంట డాక్టరు గారితో కూర్చునేవాటి ఎంతోమంది డాక్టరు గారిని చూసి పలకరించడానికి వచ్చేవారు. వారి మధ్య జరిగే సంభాషణలు గత స్మృతులు నన్ను చాలా ప్రభావితం చేసాయి.

డాక్టరు గారి పిల్లలంతా విదేశాల్లో స్థిరపడి నందువల్ల తన తమ్ముడి కొడుకు జయశంకర్ డాక్టరు గారికి వృద్ధాప్యంలో సపర్యలు చేసేవాడు. ఒక రోజు నేను వెళ్ళేటప్పటికి నాన్న యూ పడుతున్నాడు. అదృశ్యం నన్ను చాలా ప్రభావితం చేసింది. జయశంకర్ లేనప్పుడు, తాతగారి సపర్యలు చేసే అదృష్టం నాకు కూడా దక్కేది. అది మా రెండు కుటుంబాల మధ్య అనుబంధం."

డాక్టరు గారిది భారీ శరీరం. ఒక రోజు కాలు జారి బాత్ రూమ్ లో పడడం వల్ల తుంటి. ఎముక విరిగింది. మేమంతా ఆందోళన పడ్డాము. ఆ వయస్సు లో ఆపరేషన్ సత్ఫలితాలనిస్తుందా. అని. అదేగాక ఊళ్ళో ఎవ్వరూ డాక్టరు గారికి ఆపరేషన్ చెయ్యడానికి సాహసించడం లేదు. ఆ పరిస్థితుల్లో సన్నిహితులం నలుగురు కలిసి యన్. ఆర్. ఐ మంగళగిరి హాస్పిటల్ కి తీసుకెళ్లి, డాక్టరు సదాశివరావు గారే పేషెంట్ అని చెప్పకుండా ఒక యువ డాక్టరుచే ఆపరేషన్ చేయించి తీసుకొచ్చాము.. కొద్ది రోజులు బాగానే వున్నారు. కొంతమంది హాస్పిటల్స్ కూడా ప్రారంభింప జేసుకున్నారు. వీల్ చైర్ మీదనే వెళ్లారు. నేను తప్పకుండా వెంట వుండే వాడిని. మా మిత్రులంతా నన్ను "ట్రాన్స్ పోర్టు మినిస్టర్" అని పిలిచేవారు. కమ్మ హాస్టల్ ప్రాంగణం లో శ్రీమతి నన్నపనేని రాజకుమారి ఆధ్వర్యంలో ఘనమైన సన్మానం జరిగింది. ర్యాంప్ లేనందువల్ల, వేదిక మీదకి డాక్టరు గారిని వీల్ చైర్ మీద కూర్చోపెట్టి ఎక్కించడం గగనమైంది. డాక్టరు గారు ఆ సన్మానంలోని ప్రధాన అతిధులను, ప్రేక్షకులను, అభిమానులను చూసి చాలా సంతోషించారు.

డాక్టరు గారు మరణించిన తరువాత పిల్లలు రావడం ఆలస్యమైనందున, మూడు రోజులు తండోపతండాలుగా వచ్చే జనాలకు దర్శనం కల్పించే కార్యక్రమంలో పాల్గొనడం అదృష్టం. అంతిమ యాత్రలో విశేష జనం నడిచిరాగా, డాక్టరు గారి పార్థివ దేహం వున్న వాహనం లో శిఖరాగ్రాన నేనుండి అంజలి ఘటించడం మరచిపోలేని దృశ్యం.

డాక్టరు గారు మరణించిన కొద్ది రోజులకే కొందరు అభిమానులతో కలిసి నాన్న "డాక్టర్ కాసరనేని సదాశివరావు నాటక కళా సమితి"ని స్థాపించి ప్రతి సంవత్సరం మూడు రోజులు సభలు, సమావేశాలు, నాటక ప్రదర్శనలు నిర్వహిస్తున్నారు. డాక్టరు గారిని ప్రజల్లో బ్రతికించడమే ప్రధాన ధ్యేయం. నాన్న వయసు రీత్యా, ఈ బాధ్యతను నాకు అప్పగించారు. తప్పక ఈ బాధ్యతను తీసుకొని కలిసి వచ్చే అభిమానులతో సంతోషంగా నిర్వహిస్తాను. తాతయ్య ఋణం తీర్చుకుంటాను.

# డా. కాసరనేని సదాశివరావు గారు

వైద్యో నారాయణో హరి:

డా. ఎలవర్తి రామరాజభూషణుడు, అమెరికా

ఒక చిన్న కుగ్రామంలో సామాన్య మధ్య తరగతి రైతు కుటుంబంలో జన్మించి, విద్యాన్వేషణలో ఎన్నో అడ్డంకుల నెదుర్కొని శ్రద్ధాళువుగా శ్రమించి, పట్టణంలో వైద్య శిఖామణిగా స్థితప్రజ్ఞులైన సందర్భాలు మనకు తరచుగా తటస్థ పడుతూనే ఉంటాయి కానీ డా. సదాశివరావుగారి జీవన ప్రస్థానంలో మరెన్నో విశేషాంశాలు ఉన్నాయి వారు కేవలం భిషగ్వరేణ్యులే కాక శస్త్రచికిత్సలో దిట్ట, అభ్యున్నత భావుకులు, మానవవాది, సంఘసేవానక్తులు, రసజ్ఞులు, సాహితీప్రియులు, విద్యావేత్త, వితరణశీలి, అంతకు మించి విశాల హృదయులు, 1986 లో వారి షష్టిపూర్తి సంచిక "అభినందన చంద్రిక", 2008 లో "సదాశివమ్" స్వీయ చరిత్రలలో డా. సదాశివరావు గారి ఆదర్శ జీవిత శిఖరాలు మాన్యులెందరో కూలంకుషంగా, సవివరంగా పేర్కొన్నారు.

కనుక డాక్టరుగారితో నా వ్యక్తిగత పరిచయానుభవాలు మాత్రం ఈ సందర్భంలో పునశ్చరణ చేసుకొనటం సముచితమని భావిస్తున్నాను. ముఖ్యంగా, మా తండ్రిగారు శ్రీ ఎలవర్తి రోశయ్య గారికి సదాశివరావుగారితో ఉన్న సాన్నిహిత్యం వలన నాకు పిన్న వయసులోనే డాక్టరుగారిని తరచు కలుసుకునే అవకాశం, అదృష్టం కలిగాయి. ఆయన స్ఫురద్రూపం, చిరు దరహాసం, వాక్చాతుర్యం, హాస్య స్ఫురణ, సాహిత్యాభిలాష, వైద్యులుగా వారికున్న పేరు ప్రఖ్యాతులు నన్ను ఎంతగానో ప్రభావితం చేశాయనటంలో ఏమాత్రం సందేహం లేదు. గుంటూరులో మా ఇంట ఎందరో కవులు, పండితులు, మానవ వాదులు, విద్యావేత్తలు, తదితర ప్రముఖులు, నాన్నగారి శిష్యవర్గంతో నిరంతరం సుదీర్ఘ సమావేశాలు జరుగుతూ ఉండేవి. తెలుగు, ఆంగ్ల సాహిత్య భాషా చర్చలు ఎడతెగక సాగుతుండేవి. ఎం.ఎన్. రాయ్, రామస్వామి చౌదరి గారి భావాలు క్షుణ్ణంగా పరిశోధించే వారు. డాక్టరు గారు చాల సార్లు ఈ వ్యాసంగంలో పాల్గొనే వారు.

1966 లో లక్ష్మీపురం లోని డాక్టరు గారి స్వగృహంలో ప్రారంభించిన "సాహితీ సదస్సు" ఆధ్వర్యంలో నెలనెలా జరిగే తెలుగు కలం, రచయితల సమావేశాలకు వీలైనప్పుడంతా నాన్న గారితో కలిసి వెళ్ళేవాడిని, సర్వశ్రీ తుమ్మల సీతారామమూర్తి, జాషువా, కొసరాజు రాఘవయ్య, కొండవీటి వేంకటకవి, ప్రసాదరాయ కులపతి, చిన్నము రామయ్య చౌదరి, అమరేంద్ర, నాగళ్ళ గురుప్రసాదరావు, కడియాల రామమోహనరాయ్. కొల్లా కృష్ణారావు, లేతపోలు రామబ్రహ్మం, రావూరి భరద్వాం. బి.వి. నరసంహారావు, కారుమంచి సాంబశివ రావు తదితర ప్రముఖులే గాక ఎందరో యువ వంతం దర్శన భాగ్యం, పరిచయ భాగ్యం లభించాయి. నాగార్జున విద్యాసంస్థల నిర్వహణ బాధ్యతలు, వైద్యవృత్తి దరువ బాగ యిన్నాసాహితీ సేవ కుంటుపడకుండా జాగ్రత్తలు తీసుకున్నారు. వారికి ప్రబంధ సాహిత్యం మీద కూధ చాల ఆదరణ ఉండేది, ఆముక్త మాల్యద, మను చరిత్ర వంటి ప్రబంధాలు చిన్నతనంలోనే చదివారు.

మా సోదరులందరికీ తెలుగు పండితుల పేర్లు పెట్టినందుకు నాన్నగారిని ఎంతగానో మెచ్చుకునేవారు. 'చేత చాల సార్లు వసుచరిత్ర లోని పద్యాలు చెప్పించేవారు. ఆనక వాటి అర్థ తాత్పర్యాయాలు అడిగేవారు. ఉచ్చారణ నియమాలు పాటించటం తథ్యం.

జాగర్లమూడి కుప్పుస్వామి కళాశాల ప్రథమ కార్యదర్శి పదవిలో ఎలవర్తి రోశయ్యగారిని ప్రధాన అధ్యాపకులుగా నియమించటానికి ఎన్నో అవరోధాల నెదుర్కొని కృతకృత్యులయారు. వారిరువురి ఆధ్వర్యంలో కళాశాల బాల్యం నుండి ఇప్పటి వరకు ఒక ఉత్తమ విద్యా సంస్థగా కొనసాగుతుంది. డాక్టరు గారి అకుంఠిత దీక్ష, రోశయ్య గారిపై వారికి గల దృఢ నమ్మిక మూల కారణాలని పలువురి అభిప్రాయం. కళాశాల విషయాలు చర్చించటానికి వైద్యశాలకు వెళ్ళే ముందుగ ఉదయమే మా ఇంటికి వచ్చేవారు. కార్యదర్శిగా తన వద్దకు రావాలని ఆదేశించేవారు కాదు. ప్రిన్సిపాల్ గారి బాధ్యతలలో ఏ మాత్రం జోక్యం చేసుకునేవారు కాదు. వారి పరస్పరాభిమానం అనిర్వచనీయం.

నేను గుంటూరు వైద్య కళాశాల విద్యార్థిగా ఉన్నప్పుడు శస్త్రచికిత్స విభాగంలో గౌరవ అధ్యాపకులుగా పని చేశారు. తమ పనులు ప్రక్కన పెట్టి విద్యార్థులు ఆయన పాఠాలు వినటానికి అధిక సంఖ్యలో హాజరయ్యేవారు. శస్త్రచికిత్సలో మెళకువలు సులువుగా అందరికీ అర్థమయేటట్లు విశదీకరించేవారు. క్లిష్టమైన చికిత్సలు కూడ నైపుణ్యంతో చురుకుగా చేసేవారని పేరు. వారి ప్రజా వైద్యశాలలో కూడ ప్రతిఫలాపేక్ష లేకుండ భావి వైద్యులకు శిక్షణ ఇచ్చేవారు. రోగులను పరీక్ష చేసినప్పుడు వారి వద్ద ఎల్లప్పుడు 5,6 మంది వైద్యులు గమనిస్తూ ఉండేవారు. వారి శిష్యరికంలో ఆరి తేరిన వైద్యులెందరో దేశ విదేశాలలో ఉన్నత పదవులు గడించారు. డాక్టరు గారి హస్తవాసి పై అపారమైన నమ్మకంతో 300 పైచిలుకు నూతన వైద్యశాలలకు యువ వైద్యులు ప్రారంభోత్సవాలు జరిపించుకున్నారు. కేవలం ధనాపేక్షతో కాక రోగి సంక్షేమానికి పాటుపడినవాడే మంచి వైద్యుడని పదే పదే నూరి పోసేవారు. వైద్యంతో పాటు మన చరిత్ర, సాహితీ సంస్కృతులను కూడ ఆదరించాలని సూచించేవారు. మా లాంటి వైద్య విద్యార్థులకు డా. సదాశివరావు గారు ఆదర్శ ప్రాయులు, చిర స్మరణీయులు.

డా. సదాశివరావు గారి శతజయంతి సందర్భంలో హృదయపూర్వక నమస్సుమాంజలులు...

# సాహితీ ప్రియుడు సదాశివుడు

శ్రీ గొల్లపూడి ప్రకాశరావు.

వైద్యం వృత్తి, సేద్యం వృత్తి కుమ్మరం వృత్తి కమ్మరం వృత్తి ఇంకా సవాలక్ష వృత్తులు,కాని కావ్యపఠనం వృత్తి కాదు. కావ్య సృజనం వృత్తి కాదు కృతి స్వీకరణం వృత్తి కాదు సమర్పణం వృత్తి కాదు. తాగూడదు కూడా.

నన్నయ భారతాన్ని రాజరాజ నరేంద్రుడు స్వీకరించాడు. హరిహర నాధుడంతటివాడు తిక్కనకు కలలో కన్పించి కావ్యాన్నడిగాడు. సింగనామాత్యుడు శ్రీ నాథుణ్ణి అడిగి వైధాన్ని అంకితం తీసుగున్నారు. కృష్ణరాయుడు పెద్దన పల్లకీని మోసి మర్యాద చేసి మనుచరిత్ర నందుకున్నాడు. అంకితం ఇచ్చిన కవీంద్రులకూ అది వృత్తి కాదు. అంకితం పుచ్చుకున్న మహామహులకూ అది వృత్తి కాదు కానీ కృతిస్వీకర్త పిలిచి పీట వేస్తేగాని కృతికర్త అంకితం ఇచ్చేవాడు కాదు.

అడక్కుండా కృతి ఇచ్చే ఆచారం ఆధునికాచారం. ఆరోగ్యకరమైన ఆచారం. కృతి సమర్పనికి గాని, కృతి స్వీకరణానికి గాని హృదయగతమైన గౌరవాభిమానాలు కారణం కావాలి గానీ బాహ్యమైన ఆచారాలు కాదు. తాను స్వీకరించిన అన్ని గ్రంథాలనూ అడగకుండానే అంకితంగా పొందిన ఆదర్శమూర్తి డాక్టరు సదాశివరావు గారు.

సదాశివరావు గారు నిజంగా సదాశయరావు గారు. సాహితీ సదస్సంస్థాపనం ఇందుకు ప్రబల తార్కాణం ఈ సహృదయునికి 'తృష్ణావర్తమనే' తన కావ్యాన్ని అయాచితంగా అంకిత మిచ్చిన సుహృదయుడు శ్రీ బోడేపూడి వెంకటరావు గారు. అడగకుండా అంకితమీయడం తనకు తక్కువ తనం అని తాననుకోలేదు. అలా అనుకొనే వారికి వారు చెప్పిన సమాధానం ఇది.

"అడుగని యీవి లాఘనగుణాస్పదమందురు. పెద్ద, వైననా
యెడద నొకించుకేని స్పృశియింపవు గౌరవ లాఘవస్థితుల్
ఎడవని భావబంధ మది యేమొ యతృత హేతుబంధమై
యుదు గరగా గంగబ్బ మిడ నుత్సుకముం బొనరించు జిత్తమున్"

ఈ కృతి కర్తను, ఈ కృతి స్వీకర్తను విప్పడానికి వీల్లేకుండా కట్టిన బంధం భావ బంధం. ఈ భావ బంధం. ఈ భావబంధం ఇంత ధృఢ తరం కావడానికి కారణం కృతిస్వీకర్త సద్గుణాలు

"స్మిత పూర్వముగ సుధానేచనోత్సవముగ
మాట లాడగ నేర్చు మధురిమంబు
పెద్దల గరిమంబు పిన్నల పెరిమంబు
గణియింపజాలిన గదుసుం దనము

ఆంగ్లభాషారూఢి నాంధ్రభాషా ప్రౌఢిం
జెంది మోదించు రాసిక్కగరిమ
భోగభాగ్యస్థితి త్యాగశీలోన్నతి
కడందాంక నెఱింగిన గజగఱికయు
నేకమై ప్రోది గాంచి నా హృదయ సీయం
బాదు కొల్పిన గౌరవ భావమేదొ
యీ చిరుతకబ్బమున్ మీకంగృతి నొసంగం
ప్రీతి పూర్వంబు నన్ను బ్రేరేచనయ."
'పూదోట ఖండ కృతిని అంకితమిచ్చిన'
శ్రీ కొల్లా శ్రీ కృష్ణారావు గారు గూడ సదా
శివుని నిర్మల హృదయాన్ని నుతించారు.




"కలిమి బలిమి గల్గి గర్వమ్ము గనరాని వెన్నవంటి హృదయమున్న వాని వంతుకెక్కు కావ్య కాంతుని గావింప గలిగినాడ దృష్టి మెలంగి నాడ"

సదాశివరావు గారి ప్రవృత్తి సాహితీ సుధాస్వాదనమైనా, వృత్తి రోగ సంహరణం ఆరోగ్య సంరక్షణ. ప్రజాసేవకై వారు ప్రారంభించిన ప్రజా వైద్యశాల దిన దిన ప్రవర్ధమానమయింది. ఈ నాటి ఈ అభివృద్ధికి సదాశివరావు గారి శస్త్ర విద్యానై పుణ్యమే కాదు కారణం జయప్రదాంబ గారి చేతి చలువ గూడా.

సదా శివరావు గారు విజ్ఞాన వేత్త వారితో పరిచయమున్న వైద్య మిత్రులు, వైద్య శిష్యులే ఇందుకు సాక్షులు. అందుకే వారితో మాట్లాడడమే ఒక ఎడ్యుకేషన్, సదాశివరావు గారు సాహితీవేత్త. వారిని కలుసుకున్న ప్రతి పండితుడూ. ప్రతి కవీ ఇందుకు సాక్ష్యం అందుకే వారితో మాట్లాడడమే ఒక ఇన్స్పిరేషన్.

అట్టి మహనీయుని శతజయంతి మనందరికి గొప్ప వేడుక వారి ఆశయాల సాధనకు ఒక మార్గ నిర్దేశనము.



# నాన్నకు దైవ సమానులు

డాక్టర్ పాతూరి రాధిక, M.Sc. M.s. M.Tech. Ph.D
ప్రిన్సిపాల్ విజ్ఞాన్ నిరులా ఇంజనీరింగ్ కాలేజి ఫర్ గర్ల్స్, గుంటూరు.

మా నాన్న గారు, పాతూరి కోటేశ్వరావు గారికి జాగర్లమూడి కుప్పుస్వామి కళాశాల (J.K.C College)లో ఉద్యోగం రావడానికి ప్రధానకారకులు సదాశివరావు గారేనని చెప్పేవారు. వారి పరిచయం కాకతాళీయంగా జరిగిందని, వారి మధ్య నాన్న పెండ్లి సంభాషణ నాటకీయంగా జరిగిందని, ఫేస్స్ బుక్ పోస్టింగులలోనూ, గురువందన సంచిక "పరిమళ పారిజాతంలోనూ" చదువరులకు ఆసక్తి కలిగించేటట్లు వివరించారు.

నాన్న, డాక్టర్ గారు కాలేజీ సెక్రటరీగా కాకుండా, ఒక గొప్ప మనిషిగా ఆరాధించేవారు. సాయంత్ర వేళ్లలో డాక్టరు గారి ఆసుపత్రికి వెళ్లి రకరకాల మనుషులను కలవడం వారు డాక్టర్ గారితో మాట్లాడే తీరు, డాక్టర్ గారు వారితో ఆత్మీయంగా స్పందించే తీరు నాన్నగారి మీద చెరగని ముద్ర వేసింది. సామాన్యులతో కూడా డాక్టర్ గారు మనసు విప్పి మాట్లాడే తీరు నాన్నకు బాగా నచ్చింది. పల్లెటూరు నుండి వచ్చే రోగుల బంధువులను, వ్యవసాయ పనులను గురించి యితర బాగోగులను గురించి అడగడం, నాన్న ప్రవర్తనలో ఒక మార్పు తీసుకొచ్చింది. అదే సూత్రాన్ని కాలేజీలో అడ్మిషన్లకు వచ్చిన తల్లిదండ్రులను పలకరించడం అలవాటు చేసుకున్నారు. ఆ పరిచయాలే నాన్నను "గురువందన ఉత్సవం"లో వేలమంది సన్మానం చేసేటట్లు పురికొల్పాయి. డాక్టర్ గారి నుంచి నాన్న జీవిత మెళకువలు చాలా నేర్చుకున్నారు. అందుకే జె.కె.సి ఆధ్యాపకుల్లో నాన్నకు ప్రత్యేక స్థానం.

డాక్టరు గారి అన్నదమ్ముల అనుబంధం నాన్నకు బాగా నచ్చింది. డాక్టరు గారు తము నందరిని చదివించినట్లు, మా నాన్నను కూడా మా పెద్ద నాన్న చదివించాడు. ఉమ్మడి కుటుంబం ఇద్దరికి ఉమ్మడి ఆశయం, ఆలోచన, ఆచరణ. తల్లి ప్రభావం డాక్టరు గారి మీద ఎక్కువ. ఆమే పేదల కొరకు, గ్రామీణుల కొరకు మంచి ఆసుపత్రి పెట్టమని, మెడిసిన్ చదివేటప్పుడు చెప్పిందట. ధనార్జన పై దృష్టి పెట్టకుండా మెడిసిన్ చదవడానికి కారణమైన అమ్మమ్మ కోరిక, అమ్మ దృక్పధాన్ని అమలు చేస్తూ, "ప్రజా వైద్యశాల" స్థాపించి పేదలకు "అపర ధన్వంతరి" అయ్యారు.

డాక్టరమ్మ, జయప్రదాంబ గారు అందరితో సాన్నిహిత్యంగా ఉండరని జనంలో ఒక అపవాదు. అది కేవలం అపవాదు మాత్రమే. ఎందుకంటే మా అన్నయ్య డాక్టర్ కిరణ్, మా తమ్ముడు శ్రీకాంత్, డాక్టరమ్మ గారి చేతనే డెలివరీ చేయబడ్డారు. అమ్మతో చాలా ప్రేమగా మాట్లాడుతుంది. అన్నయ్య పుట్టిన పది రోజులకు జరిగిన ఫంక్షన్లో, అశోక్ నగర్ మా ఇంటికి వచ్చి పది జతల దుస్తులు తీసుకొచ్చిందట. డాక్టరమ్మగారు, కారు దిగుతుంటే వీధిలో వారంతా ఆశ్చర్యంగా చూసి, డాక్టరమ్మ గారి మీద ఉన్న అభిప్రాయాన్ని మార్చుకున్నారట.

మా చిన్నప్పుడు పల్లీరాణి, ఉషాబాల నాన్న గారి దగ్గరకు కెమిస్ట్రీ చెప్పించు కుంటానికి వచ్చేవారట. ఆడపిల్లలు గదా. నేనే వచ్చి ఒక గంట చెప్పి వెళ్తాను అని నాన్నంటే, డాక్టర్ గారు అది పద్ధతి కాదు అని, గురువు గారి వద్దకు శిష్యులు రావడం పద్ధతి అన్నారట. అదీ డాక్టరు గారి సంస్కారం డాక్టరు అడక్కుండా ఉద్యోగం యిచ్చినందువల్ల వారి గౌరవం నిలబెట్టడం కోసం, నాన్న మిగిలిన వారిలాగా ట్యూషన్లు చెప్పలేదు. తీరిక ఎక్కువ గనుక ఆ సమయమంతా డాక్టరు గారు, వారి కొరకు వచ్చే విజిటర్స్ తోనే ఎక్కువ గడిపేవారు. వైద్యంలో బాగా ప్రాచుర్యం పొందిన తరువాత, డాక్టరు గారి వద్ద శిక్షణ పొందిన జూనియర్ డాక్టర్లు గుంటూరు, ఒంగోలు, విజయవాడ పరిసర ప్రాంతాలలో హాస్పిటల్స్ పెట్టేవారు. అవి అన్నీడాక్టరు గారి చేతుల మీదుగానే ప్రారంభం అయ్యేవి. ప్రారంభాలకు వెళ్తూ నాన్నను తీసుకెళ్లేవారు. ఆ రకంగా డాక్టర్లలో నాన్న గౌరవం డాక్టరు గారు పెంచారు.

డాక్టరు గారు నిర్వహించిన "సాహితీ సదస్సు" సభలకు నాన్న తప్పకుండా హాజరయ్యే వారు. దేశంలోని గొప్ప సాహితీ వేత్తలను చూచినందుకు, వారి ఉపన్యాసాలు విన్నందుకు చాలా ఆనందం పొందేవారు. నాన్నకు book reading చాలా ఎక్కువ. మాకూ అలవాటు చేశారు. చదవడం వల్ల, భావ విస్తృతి, భాష పై పట్టు వస్తుందని చెప్పేవారు. నాన్నకు చెడు అలవాట్లు లేనందువల్ల పుస్తకాలు విస్తారంగా కొంటుంటారు. విజిటర్స్ నాన్న పుస్తకాల రాక్ చూసి, కెమిస్ట్రీ లెక్చరర్ సాహిత్యం పై ఇంత పిచ్చా అని అడుగుతారు. నాన్ననోటితో కాకుండా చూపుడు వేలుతో ఎదురుగా ఉన్న డాక్టర్ సదాశివరావు గారి ఫోటో చూపిస్తారు. తెలివైన వారికి వెంటనే స్ఫురిస్తుంది. మిగిలిన వారికి వివరిస్తారు.

నేను 1993లో ఆచార్య నాగార్జున యూనివర్సిటీలో డిగ్రీ టాపర్ గా GOLD MEDAL సాధించాను. రజతోత్సవ సంబరాలకు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారు, క్రీ.సి. నారాయణ రెడ్డి గారు. అతిథులు డాక్టర్ సదాశివరావు గారు అధ్యక్షులు నేను స్టేజి ఎక్కి బంగారు పతకం, నాగేశ్వరావు గారి నుండి తీసుకునేటప్పుడు డాక్టరు గారు "ఈ అమ్మాయి ఎవరైవుంటారో గుర్తుపట్టండని" నాగేశ్వరావు గారిని అడిగారు. ఒక్కసారి నా ముఖం వైపు నిశితంగా చూసి, నన్ను ఈ ఉత్సవానికి ఆహ్వానించిన పాతూరి కోటేశ్వరరావు గారి అమ్మాయేగదా అని అనగానే అందరూ ఆశ్చర్యపోయారు. చదువు గొప్పగా లేకపోయినా ఏ ఎన్ ఆర్ గారి పరిశీలనా శక్తి గొప్పది.

నాన్న, డాక్టరమ్మ గారి పేరుతో జె.జె.సి కాలేజీలో, డిగ్రీ కోర్స్ మ్యాథమెటిక్స్ సబ్జెక్టు లో గరిష్ట మార్కులు వచ్చిన వారికి ఒక క్యాష్ అవార్డు నెలకొల్పారు. మొట్టమొదటి ఆ అవార్డు గ్రహీతను నేనే అదే స్ఫూర్తిగా P.S. G College కోయంబత్తూర్ లో M.Sc చేసి, BITS పిలాని నుండి M.S. మద్రాస్ యూనివర్సిటీ నుండి M Tech, చివరిగా జాతీయస్థాయిలో పేరు గడించిన ప్రొఫెసర్ త్రిమూర్తి గారి ఆధ్వర్యంలో కంప్యూటర్ సైన్స్ లో Ph.D చేశాను. ప్రస్తుతం నాన్న వారసురాలిగా అధ్యాపక వృత్తి (కుల వృత్తి)లో ఆనందాన్ని ఆస్వాదిస్తున్నాను.

కాలం గడిచే కొద్దీ డాక్టరు గారి కుటుంబంతో నాన్న బంధం బలపడింది. ఎంతగా అంటే డాక్టరు గారు, డాక్టరమ్మ గారు ఇంటికి పిలిచి భోజనం పెట్టి వారు వ్రాసిన WILL మీద సాక్ష్య సంతకం పెట్టించుకునేంత, నాన్న ఎంత సంబరపడ్డారంటే ఇది "భారతరత్న పురస్కారమని" చెప్పేటంత ఇది ఆవేశంలో వచ్చిన అతిశయోక్తి కానీ మా కుటుంబానికి అది గొప్ప గౌరవం.

నాన్న, వారు జీవించినప్పుడే గాకుండా మరణించిన తరువాత కూడా వారిని విస్మరించలేదు. డాక్టరమ్మ గారి పేరుతో కాలేజీ పెడితే యాజమాన్యంలో ప్రధాన పాత్ర పోషించారు. కొంతకాలం కార్యదర్శిగా కూడా పనిచేశారు.

డాక్టరు గారు మరణించిన వెంటనే అభిమానులతో కలిసి "డాక్టరు కాసరనేని సదాశివరావు నాటక కళా సమితి"ని ఏర్పాటు చేసి, గత పదేళ్లుగా ప్రతి సంవత్సరం, సభలు నిర్వహించి, నాటకాలను ప్రదర్శింప చేస్తున్నారు.

శతజయంతి సంచికను కూడా నాన్నగారే పర్యవేక్షకునిగా ప్రచురింప జేస్తున్నారు. డాక్టరు గారి బహుముఖ ప్రజ్ఞ, ఈ తరం వారికి ఆశయం కావాలని, ఆచరణకు సాధనం కావాలని, వారి దివ్య స్మృతికి అంజలి ఘటిస్తూ.



## మిలియన్ల మందికి వైద్య & ఆరోగ్య సంరక్షణ

డా. డి. జగన్నాథ రెడ్డి, M.D

మెడికల్ హాటోనస్ గత మూడు దశాబ్దాలుగా దేశంలో వైద్యం, ఆరోగ్య సంరక్షణ రంగంలో సాధించిన పురోగమనాన్ని పునరుద్ధరిస్తుంది సంతృప్తికరమైన అనుభూతితో రికార్డ్ చేస్తుంది శిశు మరణాల రేటు 180 నుండి 140కి పడిపోయింది, మొనాటీ రేటు 1000కి 15కి తగ్గింది, ఆయుర్దాయం 54 సంవత్సరాలు. అంటు, అంటువ్యాధుల నియంత్రణ కారణంగా ఈ ఇస్నీ అంతా. దేశంలోని ప్రజారోగ్య అధికారులు గర్వించదగ్గ విజయం స్మాల్ పోస్ లేనప్పుడు మశూచికి www రేటు సాధించడం మాకు గర్వకారణం. దీని నేపథ్యం మేము ఇప్పటికీ 35. ప్రతి 1000కి 37 అనే భయంకరమైన అధిక జనన రేటును ఎదుర్కోవలసి వస్తుంది, ఉత్పత్తిలో పెరుగుదల లేకుండా ఏటా 12-13 మిలియన్ల జనాభాను కలుపుతోంది. ఇది ఒక్కొక్క వ్యక్తి ఆహార ధాన్యాల పరిమాణం తగ్గడానికి దారితీసింది, ఇది 12 ఔన్సులు. అభివృద్ధి చెందిన దేశాల్లో 2500-2800 కేలరీలు ఉండగా, మన తలసరి ఆహార వినియోగం 1800-1900 కేలరీల మధ్య ఉంది. ప్రొటెన్ వినియోగం ప్రతి వ్యక్తికి రోజుకు 30 గ్రాములు, గ్రామీణ ప్రజలలో 10 గ్రాములు లేదా అంతకంటే తక్కువగా ఉంటుంది. 5 సంవత్సరాల కంటే తక్కువ వయస్సు ఉన్న 40% కంటే ఎక్కువ మంది పిల్లలు PCM ప్రతికూల ప్రభావాలను వ్యక్తం చేస్తున్నారు. మన జనాభాలో 40% పైగా 76, 15 సంవత్సరాల కంటే తక్కువ వయస్సు, వారి పోషకాహార అవసరాలు పెద్దల కంటే చాలా ఎక్కువ, డిమాండ్ కలిగి ఉంటాయి విటమిన్లు, ఖనిజాల లోటు మెసే పిల్లల్లో కూడా స్పష్టంగా కనిపిస్తుంది క్వాషియోర్కోర్, పిల్లలలో తేలికపాటి నుండి తీవ్రమైన పోషకాహార ఎడెమా గ్రామాలలో కళ్లజోడు.

ఆధునిక పారిశుద్ధ్య సౌకర్యాలతో నివసించడానికి మంచి ఇళ్ళు, ఆరోగ్యకరమైన పరిసరాలు పూర్తిగా లేకపోవడం చాలా దారుణం. ఈ కనీస అవసరాన్ని తీర్చాలి. మంచి ఇళ్లు, త్రాగడానికి

సురక్షితమైన నీరు లేనప్పుడు, విరేచనాలు, విరేచనాలు, కలరా అంటువ్యాధుల కారణంగా కనిపించే పర్యావరణ కాలుష్యం కారణంగా 80% పైగా ప్రజలు ఈ కనీస మానవ అవసరాలను తిరస్కరించారు, పట్టణాలు కూడా తాగడానికి పైపుల ద్వారా నీటి సరఫరాను పొందడం లేదు. దేశం. దేశంలోని 00.7% కంటే ఎక్కువ మంది ప్రజలు ట్యాంకుల కొలనులు లేదా కాలువల నుండి త్రాగునీటిని ఉపయోగిస్తున్నారు, ఇవి వ్యాధికారక ప్రోటోజోవా, బ్యాక్టీరియా గొప్ప సంస్కృతులు.

ఇది దేశం పెద్ద, ప్రధాన సమస్య, బోరు బావులు, లోతైన బావులు, పైపుల వ్యవస్థ ద్వారా రక్షిత నీటి సరఫరాను అందించడానికి ప్రణాళిక కేటాయింపు 4వ పంచవర్ష ప్రణాళికలో పూర్తిగా ఉపయోగించబడలేదు, ప్రస్తుత కాలంలో మెరుగైన ఫలితాలు సాధిస్తాయని ఆశిస్తున్నాము పంచవర్ష ప్రణాళిక

మధ్యాహ్న భోజన పథకాన్ని సద్వినియోగం చేసుకునేందుకు పాఠశాల ఆరోగ్య కార్యక్రమాన్ని ముమ్మరం చేయాల్సిన అవసరం ఉంది, అంటు వ్యాధుల నివారణకు ఏకైక భరోసాగా ఉన్న పాఠశాల పిల్లలందరికీ రోగనిరోధక టీకాలు వేయాలి.

క్లినిక్‌లు, ఆసుపత్రులకు రోగుల హాజరు పెరుగుతోంది. అభివృద్ధి చెందిన దేశాల్లో 1000 జనాభాకు 2-3 చొప్పున 1000 జనాభాకు 0.4 పడకలు మాత్రమే ఉన్నందున మనకు ఇప్పటికీ ఆసుపత్రి పడకల అవసరం ఉంది. మా దగ్గర 4000-5000 మంది వైద్యుడు ఉన్నారు. దేశంలోని 21000 మంది జనాభాకు నేను 8000 మందికి నర్సు, నేను మధ్య భార్య. దేశంలో పెరుగుతున్న వైద్య, ఆరోగ్య సంరక్షణ అవసరాలను తీర్చడానికి సహజంగా వైద్య, సహాయక మానవ శక్తి సరిపోదు. 15520కి పైగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ఉపకేంద్రాల శ్రేణి రోగి అవసరాలను తీర్చలేకపోతున్నాయి. ప్రపంచ యుద్ధానంతర కాలంలో వైద్య కళాశాలల సంఖ్య విస్ఫోటనం చెందింది, అయితే వైద్యులలో నిరుద్యోగం పెరుగుతోంది. బహుశా అవి ఉద్యోగావకాశాలు కాకపోవచ్చు. దీనివల్ల ఏటా 1000 మంది వైద్యులు వలస వెళ్తున్నారు. మన ప్రజల కనీస ఆరోగ్య అవసరాల నేపథ్యంపై సమీక్ష అవసరం. ఐదవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాలో PHC బెడ్ స్ట్రెంగ్త్‌ను 30కి పెంచాలని, ఏటా మందులు, ఇతర అవసరాలకు రూ. 12,000/ అందించాలని సూచించబడింది. MCH, పౌష్టికాహార కార్యక్రమాలను కుటుంబ నియంత్రణ, కుటుంబ సంక్షేమ కార్యక్రమాలతో ఏకీకృతం చేయడం గురించి కూడా ప్రస్తావించబడింది, వీటన్నింటికీ ఒక కొత్త రకం శిక్షణ పొందిన వ్యక్తి అవసరమయ్యే శిక్షణ భావన అవసరం, ఒక బహుళార్థసాధక ఆరోగ్య కార్యకర్త సరైన దిశలో కదులుతున్నారు. గ్రామీణ, సెమీ-అర్బన్ ప్రాంతాల ఆరోగ్య సమస్యలను ఈ సిబ్బంది బాగా దృష్టిలో ఉంచుకున్నప్పుడు నిర్వహించవచ్చు

ఈ ఫిజిషియన్ అసిస్టెంట్‌లు గ్రామ ఆరోగ్య పోస్టులకు ఇన్‌ఛార్జ్‌గా ఉంటారు, ప్రజల రోజువారీ ఆరోగ్య అవసరాలను నిర్వహించడానికి, పర్యావరణ పారిశుద్ధ్యాన్ని మెరుగుపరచడానికి సలహా ఇస్తారు,

దీని కోసం వైద్యుడి ప్రతిభ వృధా కాకూడదు. నిర్వహణ రోగి సంరక్షణ, చిన్న శస్త్రచికిత్స పని సాధారణ విధుల ఆసుపత్రులు. USSR USA, చైనాలో వారు బాగా పనిచేశారు

వైద్యం, ఆరోగ్య సంరక్షణ ఖర్చులు ప్రభుత్వానికి పెరుగుతున్నాయి. ప్రొవైడర్, ప్రజలకు–వినియోగదారులకు ఆరోగ్య సంరక్షణ సంస్థ, నిర్వహణ, డెలివరీలో, అనారోగ్యంతో ఉన్నవారికి ఆరోగ్య సంరక్షణను అందించే పద్ధతులను సూచించడం మంచిది. ఇందులో మొబైల్ హెల్త్ కేర్ సేవల అభివృద్ధి చాలా అవసరం. ఆసుపత్రులను నిర్మించడం కష్టం, చాలా ఖర్చుతో కూడుకున్నది. పిహెచ్‌సి లేదా తాలూకా ఆసుపత్రి నుండి మొబైల్ డిస్పెన్సరీల ద్వారా లేదా జిల్లా ఆసుపత్రి నుండి కూడా మొబైల్ డిస్‌పెన్సరీలు ఆసుపత్రి పరిసరాల్లో పనిచేయాలి, నవీనమైన ఆరోగ్య సౌకర్యాలను అందించాలి. టెలిఫోన్ లేదా మెసెంజర్ సేవ ద్వారా గ్రామ ఆరోగ్య పోస్ట్, ఆసుపత్రి మధ్య సంప్రదింపులు నిర్వహించవచ్చు.

వైద్యులకు ప్రోత్సాహకాలు అందించడానికి ఉదార రాయితీలతో పాలిక్లినిక్‌లు, నర్సింగ్ హోమ్‌లు, డిస్పెన్సరీల ఏర్పాటును ప్రోత్సహించడం అవసరం కావచ్చు. అదే సమయంలో ఈ సంస్థల ద్వారా అందజేసే ఆరోగ్య సంరక్షణ ప్రమాణాలు, నాణ్యతపై ఎప్పటికప్పుడు సమీక్షించి ప్రభుత్వానికి సలహా ఇవ్వడానికి ఒక సంస్థను ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉంది. ఇవి, మరెన్నో వినూత్నమైన కొత్త విధానాలు కనీసం పాక్షికంగా లేదా పూర్తిగా ఈ శతాబ్దం చివరి నాటికి మన మిలియన్ల మంది వైద్య, ఆరోగ్య సంరక్షణ అవసరాలను తీర్చగలవు.

# డాక్టర్ ఎ.ఎస్. కె. సదాశివరావు, నాకు తెలుసు

డా. ఎం.ఆర్. చౌదరి. PhD(సెల్)
రిటైర్డ్ కన్‌స్ట్రక్షన్ ఇంజనీర్

విలియం షేక్స్పియర్ మాటలలో "కొందరు గొప్పగా పుడతారు, గొప్పతనాన్ని సాధిస్తారు, కొందరు గొప్పతనాన్ని సాధిస్తారు" డాక్టర్ సదాశివరావు జీవితంలో గొప్పతనం మొదటి రెండు వర్గాలకు చెందినవారు, రామచంద్రపురంలోని దిగువ మధ్యతరగతి వ్యవసాయ కుటుంబంలో జన్మించారు. గుంటూరు జిల్లా తక్కెళ్లపాడులో ప్రతిభ, కృషితో నేటి స్థాయికి ఎదిగాడు. గుంటూరులోని హిందూ కళాశాలలో ఎమ్.పి.సి గ్రూపులో ఇంటర్మీడియట్ విద్యను పూర్తిచేసి 1942లో ఎం.బి.బి.ఎస్.కోర్సు విద్యార్థిగా విశాఖపట్నంలోని ఆంధ్రా మెడికల్ కాలేజీలో చేరిన రోజులనాటికి ఆయనతో నా పరిచయం ఉంది. నేను పందొమ్మిది నలభైలలో అతనిని తరచుగా కలుసుకునేవాడిని, గ్రీకు నాగరికత ప్రారంభం నుండి అలెగ్జాండర్ ఫ్లెమింగ్ పెన్సిలిన్ ఆవిష్కరణ వరకు అసంఖ్యాకమైన విషయాలను అతనితో చర్చించాను. అతను సమాచార గని, సూర్యుని క్రింద ఏ అంశంపై సంభాషణలో ఎప్పుడూ విఫలం కాలేదు. నేను ఎల్లప్పుడూ చాలా మంది యువ వైద్య విద్యార్థులతో పాటు ముఖ్యంగా టి వెంకటేశ్వరరావు, సి. పాపారావు, వై ప్రతాప్ కుమార్, జి. ఈతిరాజులు, దివంగత గోపాలరావు వంటి వారి సహవాసంలో చూశాను, తరువాత అనేక వైద్య శాఖలలో నిపుణులుగా మారారు, అతను ప్రముఖంగా నిలిచాడు. వారు ఒక గొప్ప మహానుభావుని వలె, ఆంధ్రా మెడికల్ కళాశాల వేదికపై ఆధిపత్యం చెలాయించారు, అతను వైద్యం, శస్త్రచికిత్స రెండింటిలోనూ సమానంగా ఇంట్లో ఉన్నాడు, M. B B 5 తర్వాత అతను పోస్ట్ గ్రాడ్యుయేట్ స్టడీస్‌లో స్పెషలైజేషన్ కోసం ఏ బ్రాంచ్‌ని తీసుకుంటాడో అతనికి సందిగ్ధంగా ఉంది. 1947లో చివరగా అతను సుజరీకి అనుకూలంగా తన మనస్సును ఏర్పరచుకున్నాడు, దానిలో నైపుణ్యం సాధించాడు, 1951లో తన M. S. డిగ్రీని పొందాడు. అతను ప్రైవేట్ ప్రాక్టీస్‌లో గొప్ప విజయం సాధిస్తాడని, ఒక కాలం తర్వాత గుంటూరులో నర్సింగ్‌హోమ్‌ను ఏర్పాటు చేయమని సలహా ఇచ్చాడు. యాభైలలో గవర్నమెంట్ సర్వీస్‌లో ఉన్న సంవత్సరం లేదా అంతకంటే ఎక్కువ, అతను 22 జూన్ 1951న తన "పీపుల్స్ నర్సింగ్ హోమ్"ని స్థాపించాడు.

**వైద్యుడు, సర్జన్:**

ఒక ప్రముఖ వైద్యుడు, ప్రముఖ సర్జన్‌గా, అతను సమాజంలో ఒక ప్రత్యేకమైన స్థానాన్ని ఆక్రమించాడు; అతను సాధారణంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రజలకు, ప్రత్యేకించి గుంటూరు జిల్లా ప్రజలకు ఎనలేని సేవలందిస్తున్నాడు, అతని సమర్థుడైన భార్య డా. జయప్రదాంబ సహాయం చేస్తూ ఎవరి చురుకైన సహకారం లేకుండా అతను ఇంత ప్రజాదరణ పొంది ఉండేవాడు కాదు. హిప్పోక్రాటిక్ ప్రమాణం సూత్రాన్ని అక్షరం, ఆత్మ రెండింటిలో నిజంగా కట్టుబడి, అతను చాలా మంది రోగులకు వారిపై భారీ ఆర్థిక డిమాండ్లను ఉంచకుండా వారి బాధాకరమైన వ్యాధుల నుండి ఉపశమనం పొందాడు. తనకు చెల్లించిన దానితో అతను చాలా సంతృప్తి చెందుతాడు. అతను సంప్రదింపుల రుసుము వసూలు చేయడమే కాకుండా పేదలకు, పేదలకు అన్ని సమయాల్లో ఉచితంగా మందులు, టానిక్‌లను పంపిణీ చేశాడు. ఇలా వేల మంది ప్రజల హృదయాల్లో

హెచ్ చాలా మంచి స్థానాన్ని ఏర్పరుచుకున్నాడు, అక్యూ సూర్తి, ఎఫ్.ఆర్.సి.ఎస్. అని వ్రాసిన "దేవుని దయ, దైవానుగ్రహం ద్వారా దేవుడు సంకల్పించగలిగితే నివారణ సాధించవచ్చని ఎప్పటికీ మరచిపోకూడదు. డాక్టర్ బి ఎస్‌తో అభీష్టం, అన్నింటికంటే ముఖ్యమైనది, అందువల్ల, ఏదైనా వైద్య విధానం ప్రాక్టీషనర్ ఎప్పుడూ నివారణలకు క్రెడిట్ తీసుకోకూడదు, అయితే ఒక అభ్యాసకుడు తన ఉత్తమమైనప్పటికీ నయం చేయలేకపోతే, అతని ప్రయత్నాలకు ప్రతిఫలమిచ్చినందుకు దేవుణ్ణి స్తుతించాలి. ప్రయత్నాలను, అతను ఎల్లప్పుడూ మంచి చేయడానికి ప్రయత్నించాలి తనలోని దైవిక లక్షణాల లోపానికి ఆపాదించాలి"

**పండితుడు, విద్యావేత్త:**

డాక్టర్ సదాశివ రావు 1967లో నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించినప్పటి నుండి దాని వ్యవస్థాపక కార్యదర్శి, కరస్పాండెంట్‌గా ఉన్నారు, అతని కృషి ఫలితంగా, 1x C కళాశాల ఏర్పడింది. కళాశాల విశిష్ట ప్రిన్సిపాల్ శ్రీ రోశయ్య డాక్టర్ గారి ఆధ్వర్యంలో 1966 నుండి ఇప్పటి వరకు నిర్వహించిన సాహితీ సదస్సులో గుంటూరులోని అనేక మంది పండితులు పాల్గొని సాహిత్యంలో తాజా పోకడలను చర్చించారు. నేను దాని చర్చలలో కొన్నింటికి హాజరైన అదృష్టాన్ని కలిగి ఉన్నాను; 1972లో గ్రాడ్యుయేట్ నియోజకవర్గం నుంచి ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్‌కు ఎన్నికైన ఆయన సంస్థాగత సామర్థ్యం, చిత్తశుద్ధితో ఆయనకు నిజంగానే అస్తి, డాక్టర్ కె సదాశివరావు వంటి వారికి ఈ రంగంలో చోటు దక్కాలని భావిస్తున్నాను. సిండికేట్ దేశంలోని ఉన్నత విద్యా కోర్సుకు మార్గనిర్దేశం చేస్తుంది. విద్యారంగానికి ఆయన చేసిన సేవలకు గుర్తింపుగా కొందరు యువ మేధావులు పుస్తకాలు తయారు చేసి ఆయనకు అంకితం చేశారని తెలుసుకున్నాను.

**పరోపకారి, పరోపకారి:**

డా. సదాశివ రావు నిజమైన పరోపకారి, నిజమైన పరోపకారి, అతను తన వృద్ధాశ్రమంలో పేదలకు, అణగారిన వారికి ఎలా సహాయం చేస్తున్నాడో నేను ఇప్పటికే వివరించాను. అతను తన మంచి సంకల్పంపై ఆధారపడిన చాలా మంది విద్యార్థులకు ప్రేరణ, మద్దతు మూలం. కళాశాలలో షెడ్యూల్డ్, వెనుకబడిన తరగతులకు మాత్రమే కాకుండా ప్రతిభావంతులకు కూడా అనేక స్కాలర్‌షిప్‌లను నిర్వహించ దానికి అతను బాధ్యత వహిస్తాడు. పరోపకారం అతని రక్తంలో ఉంది, అతను సహాయం, మార్గదర్శకత్వం, సలహా కోసం తన వద్దకు వచ్చే ఉన్నతమైన లేదా తక్కువ వారందరి పారవేయడం వద్ద తనను తాను ఉంచుకుంటాడు.

సాహిత్య విమర్శకుడిగా, గౌరవ ఆచార్యుడిగా, ప్రసారకర్తగా, అతను తన అనేక వైపుల వ్యక్తిత్వాన్ని వెల్లడించాడు, ఉద్దేశపూర్వక జీవితాన్ని గడిపాడు. నేను అతనికి దీర్ఘాయువు, ఆనందం, శ్రేయస్సును కోరుకుంటున్నాను, మానవాళి బాధలకు సేవ చేయడానికి సర్వశక్తిమంతుడిని అతనిపై, అతని కుటుంబ సభ్యులపై అతని ఎంపిక దీవెనలు నింపాలని ప్రార్థిస్తున్నాను.

# లొంగని వ్యక్తిత్వం

ఉషా చలసాని
ఇంగ్లీష్ ఫ్రెస్నో యూనివర్శిటీ కాలిఫోర్నియా ప్రొఫెసర్

నేను కాలిఫోర్నియాలో వైద్యులు తక్కువగా ఉన్న ఏ సమావేశానికి వెళ్లినా, డాక్టర్ సదాశివరావుగారి పేరు ప్రస్తావించడం అనివార్యంగా వింటాను, నేను గుంటూరు నుండి వచ్చాను అని చెప్పినప్పుడు ఇది జరుగుతుంది, ఇది లెజెండరీ డాక్టర్ గురించి సంభాషణను రేకెత్తిస్తుంది. నేను అతని పెద్ద కుటుంబంలో సభ్యుడిని అని గర్వంగా ప్రకటిస్తున్నాను

నేను ఇంగ్లీషు ప్రొఫెసర్‌ని అయినప్పటికీ తెలుగు నాకు ఇష్టమైన సబ్జెక్ట్. సాహిత్యం పట్ల ఆయనకున్న మక్కువతో సాహితీ సదస్సుకు హాజరయ్యే అవకాశాన్ని నేనెప్పుడూ వదులుకోలేదు. నేను అతనిని చాలా మెచ్చుకున్నాను, నేను ఆయిల్ పెయింటింగ్స్ ఎలా చేయాలో నేర్చుకోవడం ప్రారంభించినప్పుడు, నేను అతని చిత్రపటాన్ని చిత్రించడం ద్వారా అతని పట్ల నా మోహాన్ని చూపించాను. అతని పడకగది గోడకు వేలాడుతున్న నా పెయింటింగ్ చూడగానే నా ఆనందానికి పరాకాష్ట. గొప్ప వ్యక్తులు, వారి చిన్న చిన్న హావభావాలతో, తమ అభిమానుల హృదయాలలో అతిపెద్ద స్థలాన్ని ఆక్రమించగలరని నేను గ్రహించాను.

నా వినయపూర్వకమైన పెయింటింగ్‌కు గొప్ప గుర్తింపు ఇచ్చినందుకు నేను అతనికి కృతజ్ఞతలు తెలిపినప్పుడు, అతను ఇలా అన్నాడు, "అయితే నాకు ఒక విచారం ఉంది." నా గుండె కొట్టుకుపోయింది,, నేను అతనిని బలహీనమైన స్వరంతో అడిగాను, "అది ఏమిటో నేను అడగవచ్చా?" అతను "నువ్వు పెయింటింగ్ వేస్తున్నావు కాబట్టి నా బట్టతలకి కొంచెం జుట్టు ఎందుకు జోడించలేదు?" గౌరవప్రదమైన పెద్దల సమక్షంలో గగ్గోలు పెట్టకూడదని నేను మర్చిపోయాను, అందుకే నేను ఉపశమనం పొందాను.

మనం పార్వతి గురించి మాట్లాడేటప్పుడు, మనం పరమేశ్వరుని గురించి కూడా మాట్లాడాలి, దీనికి విరుద్ధంగా, నేను ఈ సమయంలో డాక్టర్ జయప్రదాంబ గారిని ప్రస్తావించడం సముచితం. ఆమె స్వతహాగా తెలివైన వైద్యురాలు, ఆమె డాక్టర్ సదాశివ రావు గారికి ప్రేమగల, మద్దతు ఇచ్చే భార్య. వారు నిజమైన శక్తి జంట, వారు చాలా మంది ప్రజల జీవితాలపై శాశ్వత ప్రభావాన్ని చూపారు. ఈ సందర్భంలో, హెలెన్ కెల్లర్ ఒక కోట్ ఇవ్వడం ద్వారా నా ప్రియమైన ప్రజల జ్ఞాపకాలను మూసివేసేందుకు నేను జీవిస్తాను, "ఒకప్పుడు మనం ఆనందించిన వాటిని మనం ఎప్పటికీ కోల్పోలేము; మనం ఎప్పటికీ కోల్పోలేము, మనం గాఢంగా ప్రేమించేవన్నీ మనలో భాగమవుతాయి".

# మా డాక్టర్ గారు

డాక్టర్ చదలవాడ జగన్మోహన్ రావు,
శ్రీమతి శారద

మేము డాక్టర్ గారి రెండవ అల్లుడైన చదలవాడ సుబ్బారావు గారి అన్న, వదినలం వర్లమూడి సంఘం డైరీలో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసాను. మాది మధ్యతరగతి వ్యవసాయ కుటుంబము. కృష్ణా జిల్లా గన్నవరం తాలూకా వెల్లిపాడు అనే గ్రామం. రవాణా, విద్యా సౌకర్యం లేనందున మా అమ్మమ్మ గారి గ్రామం కోరంకిలో ఉండి చదువుకోవటం జరిగింది. 1964 సంవత్సరంలో నేను పశువైద్యుని గాను, మా తమ్ముడు చదలవాడ సుబ్బారావు గుంటూరు మెడికల్ కాలేజ్ మెడిసిన్ కోర్సులో చేరడం జరిగింది. సుబ్బారావు మెడిసిన్ అయిన తర్వాత జనరల్ సర్జరీ లో పీజీ చేస్తున్న సమయంలో నైపుణ్యాభివృద్ధి కొరకు డాక్టర్ గారి ప్రజా వైద్యశాలలో చేరటం జరిగింది. నేను, మా తమ్ముడు చూడటానికి ప్రజా వైద్యశాలకు రావటం వల్ల డాక్టర్ గారితో పరిచయం ఏర్పడింది.

ఈ పరిచయంతో ప్రతినెలా నేను నా తమ్ముడిని చూడటానికి ప్రజావైద్యశాలకు వచ్చినప్పుడు, నేను గమనించిన విషయం ఆయన దగ్గరకు ఎక్కువగా పల్లెటూరి నుండి రైతు కుటుంబాల పేదలు వచ్చేవారు. డాక్టర్ గారు ప్రతి ఒక్కరినీ ఆప్యాయంగా పలకరించటం, మంచి చెడులు అడుగుతూ తక్కువ ఖర్చుతో వ్యాధిని నిర్ధారణ చేయడం, నయం చేయడం బాగా నచ్చింది. వ్యాధి తగ్గిన తర్వాత ఎవరి తాహతకు తగినట్లు ఫీజు చేతిలో పెట్టేవారు ఎవరైనా ఎవ్వరు యివ్వ లేనివారు డాక్టర్ గారు ఫోటోకి దండం పెట్టివెళ్లే వారు. అప్పుడు డాక్టర్ గారు చార్జీలకు డబ్బులు ఉన్నాయా అని అడిగి లేనివారికి ఇచ్చి పంపించేవారు. అందుకే ఆయన పేదల డాక్టర్ గా ప్రసిద్ధి చెందారు. అంతటి సమర్ధతతో నిబద్ధతగా ఉండే మహానుభావులు. ఆయన పేదలపాలిటి పెన్నిధి.

1974 సంవత్సరంలో నేను పనిచేస్తున్న వీరంకి లాకు పాల సీతలకేంద్రానికి డాక్టర్ గారు వచ్చి మా రెండో అమ్మాయి కుమారి ఉమాబాలను సుబ్బారావుకు ఇవ్వాలి అని అనుకుంటున్నామని అన్నారు. మేము సంతోషంగా అంగీకరించటము వల్ల, ఆగస్టులో ఘనంగా వివాహం జరిగింది. అంతటి మంచి మనసు గలవారు ఈ బంధం ఏర్పడిన తర్వాత మేము ఉభయులము తరచుగా డాక్టర్ గారి ఇంటికి రావటము, ఉండటం కూడా జరిగేది. డాక్టర్ గారు నా భార్య శారదను వాళ్ళ పెద్దమ్మాయిగా ఇతరులకు పరిచయం చేసేవారు. అంత అభిమానంగా ఉండేవారు. ఆ ఆదిదంపతులు. ఆ కుటుంబము ఒక విద్యాలయం, చదువుల తల్లి వారి ఇంట్లోనే ఉంది. వారి బదుగురు పిల్లలను డాక్టర్లను చేయటం అంత సులభం కాదు. మా ఇద్దరు పిల్లలు మా మేనల్లుళ్లు డాక్టర్ గారి ఇంట్లో ఉండి ఎంసెట్ కోచింగ్ తీసుకోవటం వారికి మంచి ర్యాంకులతో సీట్లు రావడం జరిగింది. అందుకే అందరూ వారింట్లో సరస్వతి తాండవిస్తుందనే వారు.

కానీ నాకు నచ్చని విషయం ఆయన రాజకీయాల్లోకి రావడం నాకున్న పరిచయంతో డాక్టర్ గారిని ప్రజలకు మీరు చేసే వైద్య సేవలు కన్నా రాజకీయాలతో ఎక్కువ సేవ చేయగలరా అని అడిగితే, ఆయన చిరునవ్వే సమాధానం. 1982వ సంవత్సరంలో సీరియస్ అనారోగ్యంతో నేను జబ్బు పడినప్పుడు విజయవాడ హాస్పిటల్లో చేరాను.

కానీ పది రోజులైనా తగ్గకపోతే నా భార్య శారద, బాబాయి (డాక్టర్ గారు) కి ఫోన్ చేసి పరిస్థితి వివరిస్తే ఆయన విజయవాడకు వచ్చి చూసిన తరువాత గుంటూరు తీసుకెళ్లారు. ఆయన హస్తవాసితో పరిస్థితి చక్కబడి పది రోజులలో కోలుకోవడం జరిగింది. ఒక విధంగా నాకు అది పునర్జన్మ అని భావిస్తాను.

డాక్టరు గారు సాహిత్యాభిలాషి, కవితా గోస్టులు కూడా జరిపేవారు. నాతో అప్పుడప్పుడు పాడి పరిశ్రమతో రైతులకు ఎలా అభివృద్ధి జరుగుతుందో సంభాషించేవారు. ఈ సందర్భంలోనే సంఘం డైరీ చైర్మన్ శ్రీ కిలారు రాజన్ బాబు గారిని పరిచయం చేయడం జరిగింది. వ్యవసాయం గిట్టుబాటు కావడం లేదు. తరచుగా తుఫానులు దెబ్బతీస్తున్నాయి. పాడి పరిశ్రమే ఆధారముగా రైతులకు మేలు చేయాలి అనేవారు.

డాక్టరమ్మ జయప్రదాంబ అమ్మగారి మరణంతో డాక్టర్ గారు బాగా కృంగిపోయారు. అప్పుడు మేము ఉభయులము, డాక్టర్ గారి దగ్గరకు తరచూ రావటం, మాట్లాడటం ధైర్యం చెప్పటం జరిగేది. ఆ మహానుభావుడికి మా హృదయపూర్వక నమస్సుమాంజలులు. భగవంతుడు ఆ దంపతుల ఆత్మలను దీవించాలని శాంతిని ప్రసాదించాలని వేడుకొనుచున్నాము.



# విజ్ఞతకు మారుపేరు డాక్టరు గారు

తోట లక్ష్మి కోటేశ్వరరావు
చైర్మన్, నందివెలుగు కోఆపరేటివ్ బ్యాంక్స్

మాది నందివెలుగు గ్రామం. డాక్టర్ గారు ఎక్కువ కాలం నివసించిన తక్కెళ్ళపాడు గ్రామం. మీదుగా మా ఊరు వెళ్లాలి. మా తాత తోట కోటయ్య గారు. ఒక మోతుబరి రైతు, ఊట్లో పెత్తనం, చేసేవాడు. అందువల్ల గుంటూరు పట్టణంతో పరిచయం పెంచుకొని, గ్రామస్తులకు కావలసిన సహాయ సహకారాలు అందించేవారు. డాక్టర్ సదాశివరావు గారితో మంచి పరిచయం, అందువల్ల గ్రామంలో వారికి డాక్టర్ గారికి, వారధిగా ఉండి వారి అనారోగ్య సమస్యలు చెప్పి, ఆర్థిక స్థితిగతులు వివరించి వెసులుబాటు కల్పించే వాడట డాక్టర్లు ఆ రోజుల్లో ఊరి పెద్దల మీద గౌరవభావం కలిగి తమ ప్రాక్టీస్ వృద్ధి చేసుకొనే వారని వినికిడి. డాక్టర్ గారు మాత్రం తన వైద్య ప్రతిభ వల్లనే వృత్తిలో మంచి పేరు సంపాదించుకున్నట్లు తాతయ్య చెప్పేవారు. పేదల మీద కనికరం ఆత్మీయ పలకరింపు ఆయన గొప్ప గుణాలని రోగులు చెప్పుకునే వారట. ముఖ్యంగా తక్కెళ్ళపాడు, ఉప్పలపాడు మా ఊరు ప్రజలకు ఇంటి వైద్యులయ్యారట. మా తాత గారితో చాలా ఆత్మీయంగా ఊరి విషయాలు, పంటల విషయాలు, జనం మధ్య సంబంధాలు, కులాల అన్యోన్యత లాంటి అనేక విషయాలు మాట్లాడే వారట. మా తాతయ్యకు డాక్టర్ గారు అన్న, డాక్టరమ్మ గారు అన్నా అమిత గౌరవం.

డాక్టర్ గారు సర్జరీల్లో నిపుణుడైనా, అన్ని రకాల జబ్బులు చూసేవారట. ఆ రోజుల్లో, ఇప్పటిలాగా స్పెషలిస్టులు ఉండేవారు కారట. డాక్టర్ గారు రోగితో వివరంగా మాట్లాడి, రోగ లక్షణాలు గమనించి వైద్యం చేసే వారట ఎంతో అవసరం ఉంటే తప్ప %%–రే కూడా తీయించేవారు కాదట. అతి తక్కువ ఖర్చుతో రోగి తిరిగి ఇంటికి వెళ్లే వాడట, ప్రజా వైద్యశాల పేరు సార్ధకం చేస్తూ ప్రజలకు వైద్యం అందించే వారట. అందుకే అందరూ "సదాశివుడు" అని ఆప్యాయంగా పిలిచేవారట.

నందివెలుగు గ్రామంలో ఒకరోజు ఒక గర్భిణీ స్త్రీకి ఎద్దు పొడిచి శిశువు కాలు బయటికి వస్తే తాతయ్య దగ్గరకు ఆందోళనగా వచ్చారట. తాతయ్య డాక్టర్ గారికి ఫోన్ చేస్తే ఏమీ భయపడకండి. వెంటనే పంపించండి అని చెప్పారట. వారు ఆదుర్దాతో తాతయ్యను కూడా రమ్మని వేడుకున్నారట. డాక్టర్లు ఆపరేషన్ థియేటర్ రెడీ చేసి సిద్ధంగా ఉన్నారట. వీరు వెళ్లేటప్పటికి బల్ల మీద పడుకున్న గర్భిణీ నుండి శిశువు పాదం వరకు మాత్రమే బయటకు రావడం చూసి దీర్ఘంగా ఆలోచించి సర్జరీకి బదులు సమయస్ఫూర్తితో నిర్ణయం తీసుకొని, ఆ పాదాన్ని పొట్టలోనికి వెళ్ళేటట్లు చేశారట. ఆ చిట్కా ఏమిటంటే ఒక సాంబ్రాణి కడ్డీ తెప్పించి వెలిగించి నెమ్మదిగా ఆ పాదానికి దగ్గరగా తీసుకెళ్లి శిశువు తనంతట తానే పాదాన్ని లోపలికి సర్దుకొనేటట్లు చేశారట. తాతయ్య కూడా అప్పుడు మాస్క్ తగిలించుకొని ఆపరేషన్ థియేటర్లోనే ఉన్నారట. ఈ విషయం ఊళ్లో తెలిసి డాక్టర్ గారి సమయస్ఫూర్తిని వేనోళ్ల కొనియాడారట.

ఆ తల్లి కడుపుకోత లేకుండా పండంటి శిశువుకు ఆనందంగా జన్మనిచ్చిందట. అందుకే డాక్టర్ సదాశివరావు గారిని డాక్టర్లంతా కూడా 'డాక్టర్ గారు' అని సంబోధిస్తారట.

నేను విజ్ఞాన్ P.G కాలేజీలో M.Sc మైక్రో బయాలజీ చదివే రోజుల్లో డాక్టర్ సదాశివరావు గారు "విజ్ఞాన్ స్రవంతి" ఉత్సవాలకు ముఖ్యఅతిథిగా వచ్చారు.

మా ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ పాతూరి కోటేశ్వరావు గారికి, డాక్టరు గారంటే విపరీతమైన అభిమానం. వారిని పరిచయం చేస్తూ డాక్టర్ గారు ప్రభుత్వ ఉద్యోగానికి వెళ్లకుండా గ్రామీణ పేదలకు వైద్యం అందించాలని, పీపుల్స్ నర్సింగ్ హెూమ్ ప్రారంభించారని, మరొక డాక్టర్ని దండల మార్పిడి ద్వారా ఆదర్శ వివాహం చేసుకున్నారని, జనరల్ సర్జరీలో ఫస్ట్ ఛాన్స్ లోనే ఉత్తీర్ణుడవడమే కాకుండా గోల్డ్ మెడల్ సాధించారని, విద్యార్థుల వద్ద ఫీజు తీసుకునేవారు కాదని, పైగా విద్యార్థులు చదువుల గురించి మాత్రమే కాక, వకృత్వ వ్యాసరచనలలో పాల్గొనమని సలహాలు ఇచ్చేవారని డాక్టర్ గారి గురించి అనేక విషయాలు చెప్పారు.

డాక్టర్ గారు తన ప్రసంగంలో మూడు రోజులు జరిపే "విజ్ఞాన్ స్రవంతి" ను గురించి కొనియాడుతూ అద్భుత ప్రసంగం చేశారు. డిగ్రీ పీజీ విద్యార్థులకు పరిపక్వత వుంటుంది గనుక చదువొక్కటేగాకుండా సమగ్ర పరిజ్ఞానం సంపాదించుకోవాలని హితవు పలికారు ప్రజలకు ఉపయోగపడే పరిశోధనలు చేయించాలని అధ్యాపకులకు సూచించారు. జీవన ప్రమాణాలు పెరికి మానవుల ఆనందంగా ఆరోగ్యంగా జీవించాలంటే మానవ మేధస్సులోని ఆలోచనలే కారణమని వైద్యంలో మార్పులను గురించి ఉదాహరణలతో వివరించారు. ముఖ్యంగా పెన్సిలిన్ లాంటి యాంటీ బయోటిక్ మందు కనిపెట్టకుండా ఉండి ఉంటే వైద్యం పురోభివృద్ధి అయి ఉండేది కాదని, అంతరిక్ష ప్రయోగాలు ఫలవంతం గాక పోతే అంతర్జాతీయ ప్రసార వ్యవస్థ సాధ్యమయ్యేది కాదని, విజ్ఞానవంతమైన, స్ఫూర్తివంతమైన ఉపన్యాసం చేశారు. మా విద్యార్థులందరికీ దిశానిర్దేశం చేశారు.

నేను పాతూరి కోటేశ్వరరావు గారి ప్రోత్సాహంతో ముందు వ్యవసాయ ఆధారిత పరిశ్రమ, తరువాత "నందివెలుగు కో-ఆపరేటివ్ బ్యాంకు" చైర్మనుగా అనేక సామాజిక కార్యక్రమాలలో పాల్గొంటున్నాను. మా గురువుగారి అధ్యక్షతన ప్రతి ఏడు జరిగే డాక్టర్ కాసరనేని సదాశివరావు నాటక సమితి ఉత్సవాలలో పాల్గొనే అదృష్టం గత రెండేళ్లుగా నాకు దక్కుతుంది. డాక్టర్ గారి మీద ఇప్పటికీ అభిమానం చెక్కుచెదరలేదని ఉత్సవాలకు హాజరవుతున్న అభిమానులు. ప్రసంగాలు చేస్తున్న అతిధులను బట్టి నాకు అర్థం అవుతుంది.

అట్టి మహనీయుని స్మరించుకునే అవకాశం దక్కినందుకు సర్వదా కృతజ్ఞుడిని, శతజయంతి ఘనంగా జరిపి ఆ ఆదర్శ వైద్యుని ఆశయాలు కలకాలం ఆచరించబడేటట్లు ప్రతిజ్ఞ బూనుదాం.

# స్థిత ప్రజ్ఞులు డాక్టరు గారు

డాక్టర్ సంజయ్, మానసిక వైద్య నిపుణులు

నాకు తెలిసిన డాక్టర్ సదాశివరావు గారు ఆయనతో సన్నిహిత్యం చివరి 5, 6 సంవత్సరాలలో ఎంతో ఎక్కువగా ఉంది.

నేను ఉదయం వాకింగ్ వెళ్లేటప్పుడు తిరిగి వచ్చేటప్పుడు వారిని కలిసే వాడిని. ఎన్నో విషయాలు వారు నాతో మాట్లాడే వారు మా సైకియాట్రి కొత్త మందులు పద్ధతులు గురించి అడిగేవారు. సైకియాట్రిలో గొప్పవారి గురించి చెప్పేవారు.

ఒకసారి డాక్టర్ గారు చాలా tension గా ఉంది. నిద్రపట్టేటట్లు లేదు, నాకు ఏదైనా టాబ్లెట్ పంపు సంజయ్ అన్నారు. నాకు గుర్తుండి నేను ఒక auxiotic పంపాను. అది వేసుకొని చాలా comfortable గా feel అయి మీ బ్రాంచీలో ఇంత మంచి మందు ఉందా అన్నారు. డాక్టరు గారితో నేను మీరు చెయ్యి వేస్తే చాలు జబ్బు తగ్గుతుంది అని వేల మంది రోగులు అనుకునేవారు. మీ సన్నిహిత్యంలో నాకు అది వచ్చింది అనుకుంటాను. మీలాంటి వారికి ఆ టాబ్లెట్ రిలీఫ్ ఇచ్చిందంటే నేను ఇక ఎంతో confidence గా ముందు ముందు రోగులకు వైద్యం చేయగలుగుతాను.

వారు ఎంతో మంది డాక్టర్లను ప్రోత్సహించి, ఎన్నో వైద్యశాలలో వారి అమృత హస్తంతో ప్రారంభోత్సవాలు చేశారు. అందరి గురించి పాత తరం డాక్టర్లు, కొత్త తరం డాక్టర్ల గురించి ఎంతో గొప్పగా చెప్పేవారు. ఎవరి గురించి తక్కువ గాని, చెడుగా గాని చెప్పినటువంటి సందర్భాలు లేనే లేవు.

డాక్టర్ బసవపునయ్య గారు, డాక్టర్ మద్దినేని గోపాలకృష్ణ గారి సమయపాలన కష్టపడే తత్వం గురించి ఎంతో గొప్పగా చెప్పేవారు.

నా మిత్రుడు డాక్టర్ రాజేష్ తండ్రి గారు డాక్టర్ పరంధామయ్య గారి హాస్పటల్ కు నామకరణం గురించి సూమంచి, దర్శినొదృష్టి అని "సుదర్శని" అని పెట్టమన్నారు. ఆ హాస్పటల్ ని ప్రారంభోత్సవం చేసింది డాక్టరు గారే.

ఎంతో గొప్ప డాక్టర్లు, రాజకీయ నాయకులు, సాహితీవేత్తలు, న్యాయమూర్తులు, కళాకారులు వారిని చూడటానికి తరచుగా వస్తుండేవారు. జస్టిస్ చలమేశ్వర్ డాక్టర్ కామినేని శ్రీనివాస్ గారు, యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్ గారు, వారిలో గొప్పతనం ఏమిటి అంటే వచ్చిన వారందరికీ నా గురించి చెప్పి వారికి పరిచయం చేసేవారు.

చివరిగా, ఏదైనా దీర్ఘంగా ఆలోచనలో ఉన్నప్పుడు డాక్టర్ గారు ఏమీ ఆలోచిస్తున్నారు అంటి సంజయ్ నేను జీవితంలో చేసిన తప్పులు, వాటి నుండి వచ్చిన పరిస్థితుల గురించి ఆలోచిస్తాను. ఎంతటి

వారమైనా తప్పులు చేయటం సహజం వాటిని వీలైనంతవరకు దిద్దుకోగలిగితే ఏ సమయంలోనైనా మనకు మనశ్శాంతి లభిస్తుంది.

వారు వారి కుమారులు, కుమార్తెలు, మనుమలు, మనుమరాళ్లతో ఎంత ఆప్యాయంగా వుంటారో డాక్టర్లు, వారి పిల్లలతో అంతే ఆప్యాయంగా మాట్లాడుతూ వారి భవిష్యత్తు గురించి సలహాలు. ఇచ్చేవారు. అటువంటి మహనీయునితో నాకు అనుభవం కలగటం నిజంగా నా పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నాను..

డాక్టర్ గారు ఒంటరితనంగా భావిస్తున్నారు అని సురేష్ గారు, ఉషాబాల గారు, మిత్రుడు డాక్టర్ పాతూరి కిరణ్, డాక్టర్ గారితో కొంత సమయము వుండగలరా అని అడిగితే అంటే, వారు కాలం చేసేముందు 5 లేక 6 సంవత్సరాలు నెలలో కనీసం 10 సార్లు వారితో మాట్లాడేవాడిని. డాక్టర్ గారు, సంజయ్ నీతో మాట్లాడుతూ వుంటే నాకు చాలా ఉపశమనంగా ఉంటుంది" అనేవారు. నాకు అది చాలా గర్వంగా, నేను కౌన్సిలింగ్ చేశాను, డాక్టర్ గారికి అని, అనిపించి వెయ్యి ఏనుగుల బలం వచ్చేది. అదే విషయాన్ని డాక్టర్ గారికి చెబితే వారు నవ్వుతూ వైద్యంలో ప్రతి బ్రాంచికి ఎంతో గొప్పతనం ఉంటుంది అనేవారు.






## డాక్టర్ గారితో గతస్మృతులు

డా. యర్రా నాగేశ్వరరావు, గుంటూరు

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు నాకు దైవ సమానులు, నేను ఎంబిబిఎస్ పూర్తి చేసి అనివార్య కారణాలతో P.G చేయకుండానే ప్రాక్టీస్ ప్రారంభించాను. డాక్టర్ గారే నా హాస్పిటల్ ప్రారంభించారు. ఆరోజు చాలా ధైర్యం చెప్పారు. అవసరమైతే క్లిష్టమైన కేసులకు తనను పిలవమని కూడా అభయమిచ్చారు. ప్రతిరోజు డాక్టర్ గారి హాస్పిటల్ కి వెళ్లి, ఒకసారి కలిసి వచ్చేవాడిని. వారు పేషెంట్ తో వ్యవహరించే తీరు నా ప్రాక్టీసు లో చాలా ఉపకరించింది.

శత జయంతి సందర్భంగా దీర్ఘకాలం వారితో ఉన్న పరిచయాలను సంఘటనలను సన్నివేశాలను మీతో పంచుకోవాలనే ఉత్సాహంతో శతజయంతి సంచికా ముఖంగా పొందుపరుస్తున్నాను.

1. ఒకరోజు గాల్ బ్లాడర్ ఆపరేషన్ చేయించుకొని సెయింట్ జోసెఫ్ హాస్పిటల్ లో ఉన్న డాక్టర్ గారి దగ్గరకు చూడడానికెళ్లాను. లోపల ఒకరు టక్ చేసుకున్న వ్యక్తి కూర్చొని డాక్టర్ గారి కాళ్లు వత్తుతున్నారు. ఎవరబ్బా అని ఎదురుగా వెళ్లి చూస్తే ప్రముఖ విద్యావేత్త వేలమంది విద్యార్ధులచే గౌరవింపబడే పాతూరి కోటేశ్వరావు గారు అని గుర్తించాను. నాలాగే కోటేశ్వరావు గారికి డాక్టగారంటే అమిత ఇష్టం. గొప్ప వ్యక్తుల సేవకు అభిమానం అడ్డురాదని ఇద్దరూ నిరూపించారు.

2. డాక్టర్ గారు తన దగ్గర పనిచేసే కాంపౌడర్లకు డాక్టర్లకు నైపుణ్యం నేర్పేవారు. థియేటర్ రెడీ చేయడం ప్రాథమికంగా చేయవలసిన పనులు చేయడం డాక్టర్ గారు వచ్చే లోపల పేషెంట్ కు ఉపశమనం కలిగించేవారు ఒకరోజు డాక్టర్ గారు, నేనూ క్లబ్ లో ఉండగా ఎపెండిసైటిస్ కేసు వచ్చిందని కాంపౌండర్ ఫోన్ చేశారు. డాక్టర్ గారు హాస్పటల్ కి అర్ధగంటలో తిరిగి వచ్చేసారు. అడక్కుండానే, వారే

చెప్పారు. ఎక్కువ పని కాంపౌదర్లే చేశారని అది వారు కల్పించే అవగాహన, కాంపౌండర్లు కూడా డాక్టరు గారిని దేవుడిలా కొలిచేవారు.

3. మానవతా విలువలకు అత్యంత ప్రాధాన్యతనిస్తారు డాక్టరు గారు ఒకరోజు నాకున్న చనువుతో "మీరు కొంతమందిని ద్వేషిస్తారటగా" అని అడిగాను. ఎవరు చెప్పారు నీకు అని అడుగుతూనే "నేను ఎవ్వరినీ ద్వేషించను ద్వేషం, కోపం, పగ, అసూయ అగ్ని లాంటివి అవి ఎవరిలో వుంటే వారిని దహించి వేస్తాయి" అని వివరించారు. ఎవరు చేసే కర్మలను బట్టి వారికి సమాజంలో విలువ, గుర్తింపు వస్తుందని చెప్పారు.

4. డాక్టరు గారికి మనుషులపై నిర్దిష్ట అభిప్రాయాలున్నాయి. నేను విదేశాల నుండి తిరిగి వచ్చిన తర్వాత ఒక పార్టీ ఏర్పాటు చేసి డాక్టరు గారిని పిలిచాను. ఇంకా ఎవరు వస్తున్నారని అడిగారు. నేను కొన్ని పేర్లు చెబితే అందులో కొందరితో నేను పార్టీ ఎంజాయి చేయలేను అని సున్నితంగా తిరస్కరించి, తనే విందు ఏర్పాటు చేసి నన్ను గౌరవించారు..

5. డాక్టర్ గారు ఎమర్జెన్సీ తరువాత గుంటూరు పార్లమెంటుకు పోటీ చేసి అప్పటి కేంద్ర మంత్రి కొత్త రఘురామయ్య గారి పై ఓడిపోయారు. ఫలితాలు వచ్చే రోజు డాక్టరు గారి ఇంట్లో ఉన్నాము. 60 వేల మెజారిటీ తో రఘురామయ్య గెలిచారు. మేమంతా కళ్ళ నీళ్లు పెట్టుకుంటుంటే ఎందుకు బాధపడతారు. మనం గెలవాలని కాదుగా పోటీ చేసింది. సిద్ధాంతాల కొరకు పోటీ చేసాం. ప్రత్యర్థి లాగా అధికారం లేదు, డబ్బు లేదు, అయినా ఈ పోటీ వల్ల భారతదేశ రాజకీయాల్లో మంచి గుర్తింపు వచ్చిందిగా అన్నారు. వారి స్థితప్రజ్ఞతకు ఆశ్చర్యపోయాము.

6. డాక్టరు గారు ప్రాక్టీస్ చేసే రోజుల్లో కంప్యూటర్లు లేవు వారే కంప్యూటర్ లాగా కొన్ని సంవత్సరాలుగా ట్రీట్ చేసిన కేసులను మెదడులో డాక్యుమెంటేషన్ చేసుకునేవారు. 25 సంవత్సరాల క్రితం వైద్యం చేసిన రోగిని కూడా సులభంగా గుర్తుపట్టేవారు డాక్టర్ గారి జ్ఞాపకశక్తి అద్భుతం. డాక్టరు గారిలో మరో మెచ్చుకో తగిన లక్షణం, రోగానికి కన్నా ముందు తండ్రి, తాతల వివరాలు అడిగేవారు. వాళ్లు ఊరిలో కొంతమంది తెలిసిన వారి పేర్లు గుర్తు చేసేవారు. ఈ విధముగా ఒక సుహృద్భావ వాతావరణం వారికి కలిగించేవారు. అప్పుడు రోగ లక్షణాలు తెలిసికొని వాకి వైద్యం చేసేవారు మందుల కన్నా, తిండి ఆరోగ్యానికి మంచిదని హితువు పలికేవారు.

7. డాక్టరు గారు ఎక్కువమందికి వైద్యం చేసినా తక్కువ ఫీజు వసూలు చేస్తున్నందువల్ల లోటు బడ్జెటి లోనే ఉండేవారు. సన్నిహితుల వద్ద అప్పులు కూడా చేసేవారు. నిజంగా తాను అందరిది. సంపాదించే అలవాటు ఉంది వుంటే, తనే అప్పులు యిచ్చే స్థితిలో వుండేవారు. కానీ మా డాక్టర్లలో ఎవరికీ లేని మంచితనం సంపాదించారు. రోగులచే దేవుడు అని ప్రశంసింపబడ్డారు

8. డాక్టర్ గారి వద్ద అనేకమంది హౌస్ సర్జన్ పూర్తి అయిన తర్వాత అప్రెంటిస్ లుగా చేరేవాడు. నేను కూడా అలా వెళ్ళినప్పుడు అక్కడే నాలాగా చేరిన ఒక జూనియర్ డాక్టరు నన్నుచేరవద్దన్నారు. ఎందుకంటే వైద్యవిద్యలో ప్రశ్నలు అడుగుతారు. చెప్పలేకపోతే, కాంపౌడర్లుతో చెప్పిస్తారు అది చాలా అవమానంగా వుంటుంది. ఆ మాటలు విని నేను డాక్టర్ అత్తోట పున్నయ్య గారి వద్ద చేరవలసి వచ్చింది.

9. డాక్టర్ గారు కూడా చివర దశలో అనారోగ్యం పాలయ్యారు. డాక్టరమ్మ గారి మరణం కొంత క్రుంగతీసింది. ఆ స్థితి నాతో పంచుకొని బాధపడ్డారు. అంత స్థితప్రజ్ఞత వున్న వ్యక్తి కూడా చలించడం నాకు భాద కలిగించింది.

10. పిల్లలంతా విదేశాలకు వెళ్లిన తర్వాత సోదరి అనసూయమ్మ, తమ్ముడు మురహరి రావు గారి చిన్న కుమారుడు జయశంకర్ పిలోటు లేకుండా, డాక్టరు గారికి సపర్యలు చేయడం నాకు సంతోషం కలిగించింది. డాక్టర్ గారి ఆత్మీయులు కూడా రాకపోకల ద్వారా ఉపశమనం కలిగించేవారు.

డాక్టర్ గారి సన్నిహితత్వం నా అదృష్టంగా భావించి, నేనూ పాతూరి కోటేశ్వరరావు గారు కలిసి "డాక్టర్ కాసరనేని సదాశివరావు నాటక కళాసమితిని ఏర్పాటు చేసి గత పదేళ్లుగా ప్రతి సంవత్సరం మూడు రోజులు సభలు నాటక ప్రదర్శనలు నిర్వహిస్తున్నాము. శ్రీ కాట్రగడ్డ రామకృష్ణ ప్రసాద్ ఈ సమితికి కన్వీనర్ గా వ్యవహరిస్తున్నారు. ఈ సందర్భంగా డాక్టర్ గారి బ్యానర్ మీద మెడికల్ క్యాంపులు నిర్వహించి మందులు కూడా పంపిణీ చేస్తున్నాము.

డాక్టరు గారి శతజయంతి ద్వారా మరి కొంతకాలం వారి ఆలోచనలు, ఆశయాలు ప్రజలు చర్చించుకోవాలని ఆకాంక్షిస్తున్నాను.



# మరపురాని మహోన్నత వ్యక్తి

నల్లూరి వెంకటేశ్వరరావు సంగం జాగర్లమూడి

డాక్టర్ సదాశివరావు గారిని గురించి వ్రాసే అవకాశం లభించటం నా అదృష్టంగా భావిస్తాను. చాలామందికి ఆయన గురించి తెలుసు. ఆయన ఎప్పుడూ డబ్బుకి విలువ ఇవ్వలేదు. ప్రజలకు ముఖ్యంగా, పేదలకు అతి తక్కువ ఖర్చుతో వారిని ఆరోగ్య వంతులుగా చేయాలన్నదే ఆయన తపన.

నాకు వారు 1976లో పరిచయము నాకు వారం నుండి జ్వరం తగ్గకపోతే వారి దగ్గరికి వెళ్లాను. వారు నా గురించి వివరాలు అడిగితే, నేను హిందూ కాలేజీలో చదువుకుంటున్నానని చెప్పాను. మరి వారం నుండి జ్వరం ఉంటే ఎందుకు చూపించుకోలేదని అడిగారు. నా దగ్గర డబ్బులు లేక రాలేదని, ఈరోజు ఐదు రూపాయలు అప్పు చేసి వచ్చానని, ఆ ఐదు రూపాయలు ఆయనకు టేబుల్ మీద పెట్టాను. ఆయన లేచి చెక్క అలమర నుండి రెండు రకాల బిళ్ళలు ఇచ్చి నాలుగు రోజుల తర్వాత రమ్మని, నా ఐదు రూపాయలు నాకు తిరిగి ఇచ్చారు. ఆయన హస్త మహిమ రెండు రోజులకే తగ్గిపోయింది. నాలుగు రోజుల తర్వాత వెళ్తే ఎంతో అభిమానంగా బాగా చదువుకోమని, పేదరికం ఒక వరముగా భావించాలని కష్టపడాలని చెప్పారు. ఆయన స్వతహాగా పల్లెటూరు నుండి వచ్చినందున పల్లెటూరు విద్యార్థులు అంటే ఆయనకు ఎంతో అభిమానం..

ఆయన హస్తవాసి మంచిదని ఎంతోమంది తమ హాస్పిటల్స్, ఆయన చేత ప్రారంభించు కోవటం చాలామందికి తెలుసు వృత్తిపరంగా ఎంతో ఎన్నో విజయాలు అందుకున్న ఆయన తరువాత రాజకీయ రంగంలో అంతగా రాణించలేదేమోనని నా అభిప్రాయం.

జనతా పార్టీ తరఫున 1977లో గుంటూరు పార్లమెంటుకు, 1978లో ప్రత్తిపాడు అసెంబ్లీకి పోటీ చేశారు. తర్వాత 1985లో తెలుగుదేశం పార్టీ తరఫున గెలిచి అసెంబ్లీలో అడుగు పెట్టారు. కొన్ని విషయాల్లో ఏ మాత్రం రాజీ పడకుండా ప్రజలకు మంచి చేయాలని తపనతో శ్రీ ఎన్ టి రామారావు

గారితో కూడా నిర్మోహమాటంగా మాట్లాడేవారు ఆయనకు ఎప్పుడు ప్రజలకు తక్కువ ఖర్చుతో వైద్యం అందించాలని తపన పడేవారు. ముఖ్యముగా పేదల పక్షపాతి. పేద విద్యార్థులు అంటే ఎంతో అభిమానం అలాంటి వ్యక్తిని మళ్లీ చూడం.

డాక్టరు గారి మంచితనం, గొప్పదనం గురించి ఒక చిన్న సంఘటన, చెరుకూరి వెంకటేశ్వరరావు గారు ఒక ప్రముఖ విద్యావేత్త వరంగల్ REC లో కూడా పనిచేశారు. పదవీ విరమణ తర్వాత 20 VNR Vignan Jyothi Engineering, Poly- technic, MBA College లు విజయవంతంగా నడిపారు. ఆ కాలంలో వారి వద్ద 9 సంవత్సరాలు క్యాంటీన్ నిర్వహణ బాధ్యతలు చేశాను. అందువల్ల తరుచు వారిని కలుస్తూ ఉండేవాడిని. మా సంభాషణలో డాక్టర్ గారి ప్రస్తావన వస్తూ ఉండేది.

చెరుకూరి వెంకటేశ్వరరావు గారిది కృష్ణాజిల్లా ఆయన గుంటూరులో చదువుకునేవారు. జ్వరంతో బాధపడుతూ డాక్టర్ గారిని ఒక సారి కలిస్తే రెండు బిళ్లలు ఇచ్చారట. ఆయన హస్తవాసి వలన వెంటనే తగ్గిపోయిందట. డాక్టర్ గారు వారి దగ్గర డబ్బు తీసుకోదట. అయితే ఆ సంఘటన జరిగి 50 సంవత్సరాల తర్వాత, డాక్టర్ జయప్రదాంబ కాలేజీలో ఒక ఫంక్షన్ కి వెంకటేశ్వరరావు గారు సతీసమేతంగా హాజరై నాటి రెండు టాబ్లెట్స్ కి ఒక్కొక దానికి ఒక లక్ష రూపాయలు చొప్పున, రెండు లక్షల రూపాయలు విరాళం ఇచ్చి ఎంతో సంతోషపడ్డారట.

ఈ సంఘటనలో కొంత మంచితనం వెంకటేశ్వరరావు గారిది. అంత గొప్పతనం డాక్టర్ గారిది. నేడు ఇద్దరు మన మధ్య లేకపోయినా ఈ సన్నివేశం నాకు ఒక అపూర్వ సన్నివేశం అనిపించింది. డాక్టర్ గారి జీవితంలో ఇలాంటి సన్నివేశాలు ఎన్నో ఎన్నెన్నో.

మంచితనం, మానవత్వం మూర్తిభవించిన ఆ మహనీయుని గురించి ఈ మాత్రం గుర్తు చేసుకునే అవకాశం కల్పించినందుకు సంతోషం. అది నేను చేసుకున్న అదృష్టం.

# ఆదర్శ వైద్య దంపతులు

డాక్టరు పాటిబండ్ల దక్షిణామూర్తి, తెనాలి

డాక్టరు కాసరనేని సదాశివరావు గారు, డాక్టరు జయ ప్రదాంబగారు వైద్య, సాహిత్య రంగాలలో తెలుగు దేశమునకు, ముఖ్యంగా, గుంటూరు మండలమునకు గత 25 సంవత్సరాలుగా చేసిన సేవ నిరుపమానము; వైద్యులందరికి ఆదర్శ ప్రాయము. నాబోటి అనేక మంది వైద్యులకు వారు సాహిత్యము పట్ల ఆసక్తిని కలిగించారు. 1965-70 సంవత్సరాల మధ్యలో నేను గుంటూరు ప్రభుత్వాసుపత్రిలో అసిస్టెంట్ ఫిజిషియన్ ఉంటునప్పుడు, ఈ వైద్య దంపతులతో పరిచయం, తదుపరి సాన్నిహిత్యం ఏర్పడినాయి.

ఇంటర్ మీడియట్ వరకు నాకు తెలుగు భాషయందు సారస్వతమందు అభిరుచి ఎక్కువగా ఉండేది. తదుపరి వైద్యకళాశాలలో చేరిన మొదలు, 1865లో ఎం డి పూర్తి అగువరకు వృత్తివిద్యలో మనస్సు లగ్నమైయుండుట వలన సాహిత్యమునందు ఆసక్తి చూపుటకు సమయము లభించేది కాదు. అప్పుడు గుంటూరు వైద్యకళాశాలలో సర్జరీలో ఆనరరీ ప్రొఫెసర్గాను ప్రభుత్వాసుపత్రిలో అసరరీ సర్జనఇగాను పనిచేయుచున్న డా సదాశివరావుగారు అటు వైద్య విద్యా బోధనలోను, ఇటు పీపుల్సు నర్సింగ్ హోంలో శస్త్రచికిత్సలతోను తీరికలేక పోయినప్పటికీ "సాహితీ సదస్సు"ను ఏర్పరిచి సాహితీ పోషణ చేస్తున్నారని తెలిసి వారిమీద నాకు గాఢాభిమానం కలిగింది. వారితో ఎలాపరిచయం కలిగించు కొందామా అనుకొంటుండగా, మా సోదరికి శస్త్రచికిత్స వారిఆస్పత్రిలోనే జరిగింది. తదుపరి మాచిరంజీవులు ఇరువురు వారి ఆస్పత్రిలోనే జన్మించడం జరిగింది.

196లో "జీవశాస్త్ర విజ్ఞానం" అను అనువాద గ్రంథాన్ని నేను వ్రాసి రెండుపుస్తకాలను డాక్టరు దంపతులిద్దరికి ఇచ్చి మీ అభిప్రాయాన్ని తెలుపమని అభ్యర్థించాను, అప్పటి వరకు నన్నొక డాక్టరుగానే తెలిసిన డా. సదాశివరావుగారు "తెలుగులో ఇంత అభిరుచి నీకున్నదని తెలియదు; ప్రతినెలా సాహితీ సదస్సు సమావేశాలకు తప్పక రావలసింది" అని అన్నారు. అప్పటి నుండి నేను 1970 ప్రారంభంలో గుంటూరు నుండి విజయవాడ వెళ్లేవరకు ప్రతిసమావేశానికి హాజరగుచుండేవాడిని. సాహితీసదస్సు సమావేశాలు ఎక్కువసార్లు డాక్టరుగారంట్లోనే జరుగుతూవుండేవి. వివిధ ప్రాంతాల నుండి విచ్చేసిన కవిపండితుల ఉపన్యాసములు, కవి తాగోష్ఠులు, స్వీయకవితాగానములు జరుగుతుండేవి. ఈ సాహితీసదస్సు ద్వారానే మా బోంట్లకు ప్రఖ్యాత చిత్రకారులు సాహితీ వేత్త శ్రీ సంజీవదేవ్, శ్రీయుతులు జాషువా, తుమ్మలసీతారామమూర్తి, జంధ్యాలపాపయ్య శాస్త్రి, డా. అమరేంద్ర, డా.జి.వి. కృష్ణరావు, జమ్ములమడక మాధవరామశర్మ కొండవీటి వెంకటకవి, బి.వి. నరసింహరావు మున్నగు అనేక మంది కవిపంగవులు, పండితులు, రచయితలతో పరిచయభాగ్యముకలిగినది. తానువెనురవు ప్రతి సమావేశమును హుందాగాను, సరజనహరణీయము గాను డాక్టరు గారు నడిపించేవారు. కా కె. వాసుదేవరావు (బయోకెమిష్టి ప్రొఫెసరు డా నరసింహారావు మొదలైన కొంతమంది యువ వైద్యులం తప్పక సదస్సుకు హాజరవుతూండేవాళ్లం.

ఒక సారి నీవు కూడా ఏదైనా విషయం గురించి తప్పక మాట్లాడవలసిందిగా డాక్టరుగారు నన్ను అడిగారు. అంతమంది పండితులముందు నేను మాట్లాడలేనేమోనని నేను సంకోచిస్తూ ఉండగా డాక్టరుగారు తప్పకమాట్లాడవలెనని నన్ను ప్రోత్సాహించారు.

1968 జూన్లో జరిగిన సాహితీసదస్సుల్ డాక్టరుగారి ప్రోత్సాహముతో "తెలుగులో దేశభక్తి కవిత" అనేవిషయంపై ప్రసంధించాను అదే సభలో పండిత శ్రీ గోపదేవశాస్త్ర గారు కూడా ప్రసంగించారు. మరొకసారి "తెలుగు వైజ్ఞానిక గ్రంథాలలో సాంకేతిక పదజాలం" అనే వియషంపై ప్రసంంంచాను. సాహితీ సదస్సులో డాక్టరు గారి ద్వారా అలవరచుకున్న తెలుగు సాహిత్యాభిమానము వల్లనే ఇటీవల "డాక్టరు వ్యాసావళి వ్రాయగలిగాను. ఈ పుస్తకానికి డాక్టరు గారు "పరిచయం" వ్రాసి నన్ను ఆశీర్వదించారు.

కొన్ని సాహితీ సదస్సు సమావేశాలకు డాక్టరుగారు అధ్యక్షతవహించేవారు. వక్తల ఉపన్యాసాలపై తమ అభిప్రాయాలను నిర్మొకమాటంగా స్పష్టీకరించేవారు. కొన్ని సంవత్సరములు సాహితీసదస్సు సమావేశము నెలకు ఒక్కొక్కరియింట జరుగుతుండేది. డాక్టరుగారు సంప్రదాయ కవిత్వాన్ని, ఆధునిక కవిత్వాన్ని సమాన స్థాయిలో అభిమానంచేవారు. దేనినీ తక్కువగా చూసేవారు కాదు. డాక్టర్లుగా రోజులో 16 గంటలు తీరిక లేకుండా వ్యాధిగ్రస్తుల బాధానివారణలోను శస్త్ర చికిత్సలోను నిమగ్నమై ఉండికూడా లభించిన కొద్దితీరిక సమయములో ఈ విధంగా సాహితీ పోషణ చేయు వైద్యదంపతులు తెలుగు నాటనే గాదు భారతదేశములోనే అరుదని నా ప్రగాఢవిశ్వాసం.

డాక్టరు సదాశివరావుగారు వైద్య కళాశాలలో ప్రొఫెసరుగా, ప్రభుత్వాసుపత్రిలో సర్జన్గా చేసిన సేవలు నిరుపమానము. నర్సింగ్ హోంలో ఎడతెగని కృషిసల్పుతూకూడా ప్రభుత్వాసుపత్రిలో వైద్య విద్యార్థులకు శిక్షణ, రోగులచికిత్స చేసి అందరి గౌరవాభిమానములను అందుకన్నారు. వారు వందలాది వైద్యవిద్యార్థులకు శిక్షణయిచ్చి వారి భవిష్యత్తులను రూపుదిద్దారు. ఆనరరీ సర్జన్ వారి సేవలు చిరస్మరణీయములు డాక్టరుగారి అపారవైద్యవిజ్ఞానం, శస్త్రకిత్సా నైపుణ్యం సాహితీపోషణ, కవులు పండితుల పట్ల అవ్యాజాను రాగాలు పిన్నలను ప్రోత్సహించే ఔదార్యము-ఇవన్నీ నేటి వైద్యులకు ఆదర్శప్రాయములు. వారికి చేదోడు వాదోడుగా ఉంటున్న వారి సతీమణి డా. జయప్రదాంబగారు ఆదర్శ వైద్యవిదుషీమణి, డాక్టరు సదాశివరావు గారి శతజయంతి వైద్య రంగంలో ప్రతి ఒక్కరికి స్ఫూర్తినివ్వాలని వారి ఆశయాలను ఆదర్శాలను పాటించి వారికి ఘనమైన నివాళి అర్పిద్దాం.



## మన డాక్టరు గారు

డాక్టరు డి.ఆర్. ఆచార్య

డాక్టరు కాసరనేని సదాశివరావు గారితో నాకు పరిచయం యేర్పడి 20 సంవత్సరములు దాటినది. వారి నిండైన విగ్రహం, గంభీరమైన వదనం చూడగానే నిష్కపటి అని నాకు తట్టినది అంటే మా స్నేహలత నిర్భయంగా సాగిపోతూ వుంది. డాక్టరుగా వారు చేసిన సేవ నా కంటే గుంటూరు ప్రాంతీయులకు ఎక్కువ తెలిసి వుండాలి. అయినా నేను గమనించిన వాస్తవాన్ని నా సోదర అభిమానులకు తెలియ పరుచుటకు ప్రయత్నిస్తాను.

"Rare is to get a guide proper" అంటాము కదా! అయితే స్వార్ధంతోనో, రోగులను భయపెట్టడం లేక సాలుగు డబ్బులు సంపాదించగానే తానేదో elivated soul అనుకొని రోగుల నిర్లక్ష్యం చేయడం జరిగే ఈ రోజులలో Rarer stills to get a doctor proper అనడం సబబేకదా! గుంటూరులో మన డాక్టరు గారు ఈ లోటును తీరుస్తున్నారు.

ప్రభుత్వ ఆసుపత్రులలో జరిగే సేవతో కొంత మది తృప్తిపడరు వారికి ఆప్యాయతతో కూడిన మంచి మాటతో ధైర్యం చెప్పటం అవసరం. ఇది private nursing home లోనే సాధ్యపడుతుంది. కాని ఈ private hospital లో మరొక చిక్కు ఎదురవుతూ వుంటుంది. వృత్తిలో కొంత కాలము డాక్టర్లుకు అర్జన మీదనే దృష్టి వుంటుంది. తరువాత ప్రతిష్టమీద, ఈ స్థితిలో రిస్క్ తీసికొని కష్ట సాధ్యమయినట్టి రోగులను admit చేసికోలేరు. కారణం వీరికి results బాగుండి ప్రతిష్ట పెరిగి తేలికగా సంపాదించాలనే తాపత్రయం వుంటుంది. మన డాక్టరు సదాశివరావు గారుపై తాపత్రయాన్ని అధిగమించి ఎక్కడా admission దొరకని రోగులను చేర్చుకొని శాయశక్తులా డాక్టర్లు బహు అరుదుగా వుంటారు. సేవ చేస్తున్నారు. ఈ స్థాయినందుకున్న ( ఈ శిఖరాన్ని అధిరోహించిన డాక్టర్ల సేవను సంవత్సరములతో కొలవడ మేమిటి? సేవా విశిష్టతకే ప్రాధాన్యము కదా!

డాక్టరు గారు బహుముఖ ప్రజ్ఞాశాలి. విద్యార్థులకు చక్కగా బోధించగల శక్తి సంపూర్ణముగా కలదు. ఒక విద్యార్థికి collar stud అనే ఉదాహరణను వివరించి చెబుతూ ఆ గుండీని చూపించుచుండగా... కనుపించారు. professorగా వుంటే మరింత సేవ చేసేవారో అనిపించింది ఇంకా ఆ ఓర్పు ఆ తీరుచూస్తే.

మాతృ భాషయందు ప్రవేశము అభిరుచి సాహిత్య అభిలాష డాక్టర్లలో బహుకొద్ది మందికి లభిస్తుంది. ఈ విషయములో సదాశివరావు గారు మార్గదర్శకులయినారు డాక్టర్లకు anontomy physiology తప్ప ఇతర లోకము తెలియ కూడదా? ఏమో. ఈ లోటువున్న వారు నాకు చాలా పేలవంగా కనిపిస్తారు.

ఒక సారి డాక్టరు గారి దగ్గరకు ఒక యువకుడు వచ్చి మట్లాడుతున్నాడు. అతను అవధానిగారి కుమారుడు అని చెప్పినట్లు నాకు జ్ఞాపకము, డాక్టరు గారు జడ్జిగా వుండగా ఆ యువకుడు వక్తృత్వపోటీలో పాల్గొని first prize తెచ్చుకున్నాడు. అది వొక దశాబ్దము క్రింద జరిగి వుండవచ్చు ఆసంఘటనా విశేషాలను డాక్టరు గారు వివరిస్తూవుంటే ఆ యువకుడు విస్తు పోయినాడు. కొన్ని సంగతులు, తనకే జ్ఞాపకం లేవు. "మీ జ్ఞాపక శక్తి" అపూర్వ మండీ అన్నాడు.

ఆపరేషన్ ధియేటరులో పని అయిపోయిన తరువాత డాక్టరు గారిని సాహిత్య గోష్టిలో దింపితే భోజనం మరిపించ వచ్చు కృష్ణుడు ద్రవుడు అనే మాటలు ఎలా వ్రాస్తున్నాము? దీనిని English లో వ్రాయలంటే ఈ సౌలభ్యం కలడా, తెలుగు భాషలో ప్రాంతీయత శబ్దములో ఏ మార్పును తెస్తున్నది. ఏ కవి పోకడలో ఈ మెరుగులున్నవి. ఇటు వంటి విషయాలను వారు లోతుగ చర్చిస్తూ వుంటే మనమొక Telugu professor ముందు కూర్చున్నట్లు అనిపిస్తూ వుంటుంది. క్లుప్తంగా చెప్పాలంటే డాక్టరు గారు ఒక సంస్థ, కుల మత వర్గానికి అతీతులై ఔన్నత్యమును మెచ్చుకోగల ఔదార్యము వారికి వున్నది.

నిజాయితీ, తెలివితేటల సమ్మేళనం మన వైద్యుడు ఉదారమైన సర్జన్,
ప్రతి అంశంలోనూ దిగ్గజం, వృత్తిలో ఎలాంటి సాహసమైన, సంతోషంగా భరించే సాహసం చేసి,
అమలులో శ్రమను ఆనందంగా పంచుకుంటారు.
దయతో ఉండటానికి మాత్రమే, ఖచ్చితంగా, అతను కఠినంగా కనిపిస్తాడు,
వేసవి ఫౌంటెన్ వంటి అస్పష్టమైన, కష్టాలను అందించడానికి మాత్రమే నిర్వహించడానికి.
ఇతరుల కన్నీళ్లు, భయాలను తుడిచివేసేందుకు చింతించడం, చెమట పట్టడం.
అతను తన భయాలకు సమయం దొరుకుతుందా? సమయం లేదు – సమయం లేదు.

# డాక్టర్ కె. సదాశివరావు vs వృత్తి కౌశలం

యోగాచార్య డాక్టర్ సి.వి.రావు
స్పందన

వైద్యో నారాయణో హరి! అని పెద్దల నానుడి. అంటే "దైవం మనిష రూపేణ" అనే ఆర్యోక్తికి వైద్యుడు ప్రత్యక్ష రూపం! మనకు తెలిసిన ఈ సత్యం అక్షరాలా అక్షరాల రుజువు చేసిన మహోన్నత వైద్యుడు డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు, డబ్బు, కీర్తి, పరపతి, పలుకుబడిని దృష్టిలో పెట్టుకొని ఆయన ఏనాడూ తన వైద్య వృత్తిని, సామాజిక సేవను కొనసాగించలేదు. పాత తరం అలా ఉండేదేమో గానిబీ కొత్త తరానికి పోల్చటానికి ఇది సరిపోదు అని మనలో చాలామందికి ఉన్న పెద్ద ఆపోవా ఏం' ఎందుకు వర్తించదు? అనే లాజిక్ ను మీతో కాస్త పంచుకోవాలనే అభిలాషీయే నా ఈ స్పందనకు ప్రేరణ.

ఆ రోజుల్లో గాని, మరి ఈ రోజుల్లో గాని పేషెంట్ పట్ల శ్రద్ధ చూపిన డాక్టర్లకు అసుపత్రులకు మాత్రమే ఆదరణ ఎక్కువ అని రేటింగ్ ల ప్రామాణికంగా చూపిస్తున్నాము రేటింగ్ లు ఫేవర్ చేయించుకున్న మాత్రాన సరిపోదు. ప్రాక్టికల్ గా ఉండి తీరాలి ఒక డాక్టర్, తనను నమ్మి వచ్చిన పేషెంట్ చెప్పేది ప్రేమగా వినటం– భరోసా యిస్తూ సరదాగా స్పందించటం, అలాగే ఆరోగ్య జాగ్రత్తల గురించి నిక్కచ్చిగా చెప్పటం, వేగవంతంగా శస్త్ర చికిత్సలు చేయడం లాంటివి ఆయనలోని గొప్ప ఎథిక్స్. ఈ రోజుల్లో అయితే స్పెషల్ కార్పొరేట్ టీం డాక్టర్లు వచ్చారేమో గాని, 4 దశాబ్దాల క్రితం తానొక్కరే డీల్ చేసే ఆపరేషన్స్ లో కూడా అప్రెంటిస్ డాక్టర్లను దగ్గర పెట్టుకొని, ప్రొఫెషనల్ పద్ధతులను తనదైన శైలిలో వారికి తగు శిక్షణను ఇచ్చే వారని 2023, జూన్ 4 నాటి హైదరాబాద్ శతజయంతి సభలో ప్రముఖ డాక్టర్ల ప్రసంగాల సాక్షిగా విన్నాను. సహచరులకు మంచి శిక్షణనివ్వటంతో పాటు, తాను కూడా ప్రతి నిత్యం నేర్చుకోవటం ఆయనలోని విశిష్ట లక్షణం వారి శిష్యరికము స్ఫూర్తితో నేటి తరం డాక్టర్లు అనేక అనేకమంది తమ తమ రంగాల్లో ఉన్నత దిశగా ఎదిగి పద్మశ్రీ అవార్డులు పొందిన వారు ఉన్నారు.

ఆధునిక వైద్య విజ్ఞాన స్థాయి పెరిగి ఈనాటి కార్పొరేట్ హాస్పిటల్స్ పేషంట్లకు ఉత్తమ సేవలను అందించే స్థాయికి ఎదిగాయి. కానీ అక్కడక్కడ కార్పొరేట్ వాళ్లు నిర్దాక్షిణ్యానికి పేషెంట్ల భారీగా నష్టపోతున్న ధోరణి కూడా మనం గమనిస్తున్నాము. ఈ నేపథ్యంలో ఆధునిక వైద్యం సామాన్యుడికి అందుబాటు కాకుండాపోయింది. అప్పుడు – ఇప్పుడు అనే కాలంతో గాకబీ వైద్య సేవతో పోల్చుకుంటే డాక్టర్ సదాశివరావు గారు ఇందుకు పూర్తిగా భిన్నం. తన దగ్గరకు వచ్చిన రోగికి నాడీ పట్టి, రోగనిర్ధారణతో మందులు వ్రాసి, ఆరోగ్య స్ఫూర్తిని కూడా కలిగించేవారు. అది తన వైద్య ధర్మముగా భావించేవారు. అందులోనే ఆయన ధన్యత పొందేవారు. రోగులు మాటలకందని సంతోషంతో ఇంటికి వెళ్లేవారు. డాక్టర్ గారిని తమ కుటుంబంలో ఆత్మీయుడుగా మనసులో ప్రతిష్టించుకునేవారు. వారి కుమార్తె డాక్టర్ ఉషాబాల గారు మా కపిల మహర్షి యోగ సంస్థలో ప్రత్యేక ప్రతినిధి. ఆమెతోపాటు వారి

సంతాన వారసత్వ వైద్యరంగ సోదరీమణులు ఇప్పటికీ తండ్రి గారి అడుగుజాడల్లో నడుస్తూ మార్గదర్శకం కావటం మిక్కిలి ఆదర్శనీయం.

ప్రపంచంలో ఎక్కడ నివసించే ప్రజలైనా దాదాపు అందరూ ఓటర్లే! అలాగే కస్టమర్లు, క్లయింట్స్, పేషెంట్లు, ఉత్పత్తిదారులు, అమ్మకం, వినియోగదారులు, రవాణాదారులు, సేవకులు ఇలా అనేక వృత్తులలో జీవనం సాగిస్తున్నారు. దాదాపు అన్ని రంగాల్లో అరకొర పని, లావాదేవీలలో దోపిడి, ప్రజా నష్టం గురించి గగ్గోలు పెడుతుంటాం కదా? ఈ సంక్షోభ పరిష్కారాల వైఫల్యంలో ప్రభుత్వ యంత్రాంగాల బాధ్యత ఏమాత్రం మినహాయింపు కాబోదు. అవన్నీ మన చేతిలో లేని గడ్డు సమస్యలు అనుకుందాం. అసలు నిజానిజాలు ప్రశ్నించుకుంటే జనానికి డబ్బు సంపాదన మీద ఉన్న మోహం-చేసే పనిలో కుశలత, నిబద్ధత, మంచి ఫలితం కోసం లక్ష్యం (Intention) అనేవి లేకపోవటమే అనేది సు స్పష్టత.

### యోగ: కర్మసు కౌశలం

గనుక దయచేసి గమనించండి. సగటు పౌరుడు జనం కోసం పెద్దగా ఏమీ త్యాగాలు, దానాలు చెయ్యనక్కర్లేదు. ఎవరి జీవనమార్గంలో వారు ఏరోజుకారోజు సామాజిక బాధ్యతగా పూర్తి చేస్తే చాలు! వృత్తి ధర్మం పాటించినట్లే! డాక్టర్ కె. సదాశివరావు గారు ఒక కర్మ యోగి. ఆయన-వృత్తి కౌశలానికి పరాకాష్ట ఒక మహోన్నతమైన ఆదర్శమూర్తి! ఆయనకు మనందరి తరపున శతకోటి వందనాలు. వైద్య వృత్తికి, కుటుంబ పరిధులను మించిన అతీతమైన వ్యక్తిత్వం ఆయనది. మనలో ఎవ్వరమూ డాక్టర్ కానక్కర్లేదు. ఏ వృత్తిలో ఉన్నప్పటికీ మన చుట్టూ ఉండేది భిన్న వర్గాల ప్రజలే మన జీవనాధారం వారి సంక్షేమం, ఆదరణ మీదనే ఆధారపడి ఉందనేది కాదనలేని సత్యం. కనుక, గౌరవ డాక్టర్ గారి నేపథ్యంలో మనం నమ్ముకున్న వృత్తి ధర్మం సలక్షణముగా పాటించినట్లయితే, వినియోగదారుడికి సౌలభ్యం, సమృద్ధి కలుగుతాయి, ఇప్పుడు కస్టమర్స్ కూడా పెరుగుతారు. ఇందుకోసం మనం ఎటువంటి త్యాగాలు చేయనక్కర్లేకుండానే సామాజిక న్యాయం జరిగిపోతుంది కదా! దీనివల్ల మనకు పబ్లిసిటీతో పనిలేని ఒక స్టాండర్డ్ ఇమేజ్ తోడవుతుంది. అంతకుమించి ఎనలేని ఆత్మ సంతృప్తి మరెక్కడ దొరుకుతుంది? ఎలాంటి స్ట్రెస్ కు తావులేని ప్రశాంతత జీవనం గడపవచ్చును. కనుక ఆలోచిద్దాం-ఆచరిద్దాం!

## స్ఫూర్తిదాయకమైన ఉపాధ్యాయుడు

డాక్టర్ ఎ.ఎస్. పి.వి. సత్యనారాయణ
M.S (జనరల్) M.Ch (కార్డియోవాస్కులర్, థొరాసిక్ సర్జన్)

డాక్టర్ కె సదాశివరావు గారి పూర్వ విద్యార్థి

1971 నుండి 1974 వరకు నా శస్త్రచికిత్స శిక్షణ సమయంలో డాక్టర్ కె సదాశివరావు గారితో కలిసి పనిచేయడం నా అదృష్టం.

నేను డి కె సదాశివ రావు గారి మార్గదర్శకత్వంలో ఇతర విద్యార్థుల మాదిరిగానే శస్త్రచికిత్స నేర్చుకోవడానికి జనరల్ సర్జరీలో పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థిగా చేరాను. డాక్టర్ సదాశివరావు గారి పేరు, కీర్తి నన్ను మొదట్లో భయపెట్టింది, కానీ త్వరగా. నేను ఒంటరిగా శస్త్రచికిత్స నేర్చుకోవడం కంటే ఎక్కువ నేర్చుకోవడానికి అక్కడ ఉన్నానని గ్రహించాను.

సాధారణంగా ఒక నిర్దిష్ట సిలబస్ ఉంటుంది, శస్త్రచికిత్స శిక్షణ సమయంలో పోస్ట్ గ్రాడ్యుయేట్ విద్యార్థికి కొన్ని శస్త్రచికిత్సలు చేసే నైపుణ్యం లక్ష్యం, నేను సిలబస్ మాత్రమే కాకుండా దాని కంటే ఎక్కువ నేర్చుకున్నాను. నేను ఒక సర్జన్‌లా ఆలోచించేలా చేశాను, ఊహించిన, ఊహించని పరిస్థితులను రొటీన్, నాన్-రొటీన్ సర్జికల్ విధానాలను పరిష్కరించడానికి నైపుణ్యాలను అభివృద్ధి చేసాను

ఒక ప్రసిద్ధ చైనీస్ సామెత ఏమిటంటే, "నాకు చేపలు తినిపించవద్దు, చేపను పట్టుకోవడం నేర్పించండి డాక్టర్ సదాశివరావు గారు నా శస్త్రచికిత్సా వృత్తి ప్రారంభం నుండి మంచి పునాది వేయడం ద్వారా వివిధ క్లిష్ట పరిస్థితులలో శస్త్రచికిత్స ఎలా చేయాలో నాకు నేర్పించారు. డాక్టర్ సదాశివరావు గారి దగ్గర శిక్షణ పొందిన సర్జన్ కావడం గర్వకారణం.

ఆపరేట్ చేయడం తెలిసినవాడే మంచి సర్జన్, ఎప్పుడు ఆపరేట్ చేయాలో తెలిసిన వాడు మంచి సర్జన్, ఎప్పుడు ఆపరేట్ చేయకూడదో తెలిసినవాడే ఉత్తమ సర్జన్, నాకు తెలిసిన అతికొద్ది మంది సర్జన్లలో డాక్టర్ సదాశివరావు గారు ఒకరు.

అతను మాకు అన్ని సమయాలలో అత్యుత్తమ సర్జన్లుగా మారడానికి శిక్షణ ఇచ్చాడు, మేము అతనితో పాటు ఉండిపోయామని ఆలోచించి మాకు మార్గనిర్దేశం చేశాడు.

మనం అడ్డదారిలో ఉన్నప్పుడు, ఏ దిక్కుకు వెళ్లాలో తెలియక డాక్టర్ సదాశివరావు గారు ప్రత్యక్షమై, మన చేయి పట్టుకుని, మనల్ని సరైన దారిలో తీసుకెళ్తున్నారు, భౌతికంగా లేరు అయినప్పటికీ నేటికీ అలానే కొనసాగిస్తున్నారు. ఇన్నాళ్లూ ఆయన జ్ఞాపకాలను ఎంతో ఆదరిస్తున్నాను.

# ఒక గొప్ప వైద్యుడు

వి.ఉమామహేశ్వరరావు

ఇతరులకు 'సేవ' ప్రారంభించినవాడు శివుడు సదాశివుడు. వీన్ సురలు, అసురులు క్షీరసాగరాన్ని మథనం చేస్తున్నప్పుడు, "హాలా హలం"ని కనుగొన్నారు, అది వినాశకరమైనది, అందరినీ, ప్రతిదానిని మ్రింగివేస్తుంది, వారు శివుడిని ప్రార్థించారు, తమను రక్షించమని వేడుకున్నారు. "ఇతరులకు" సేవ చేయడానికి బీజాన్ని ఉమామహేశ్వర స్వామి స్వయంగా మింగుతున్న విషాన్ని మింగడం ద్వారా నాటారు. డాక్టర్ సదాశివరావు ఈ శాశ్వతమైన సత్యాన్ని చాలా ముందుగానే గ్రహించారు, 1951 లో ఒక లక్ష్యంతో తన వృత్తిని ప్రారంభించారు. ప్రజలకు సేవ అనేది పీపుల్స్ క్లినిక్ నినాదం సర్జరీలో ప్రత్యేకతతో డాక్టర్‌గా అర్హత సాధించి, గైనకాలజీ, ఆబ్‌స్ట్రెట్రిక్స్‌లో పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లొమా చేసి, తన పక్కనే సేవలందిస్తూ, డాక్టర్ సదాశివరావు తనకు తానుగా గుర్తు పెట్టుకోవడానికి, పేరు తెచ్చుకోవడానికి ఎటువంటి సంబంధం లేదు. 1953 నుండి ఆయనను ఎరిగిన వ్యక్తిగా, వైరుధ్యాలకు భయపడకుండా, నా ఆజ్ఞతో నేను చెప్పగలను, చిత్తశుద్ధితో కూడిన కృషి, నిజాయితీ కర్తవ్యం, సేవాతత్పరత డాక్టర్ సదాశివరావు, అతని భార్య జయప్రదకు పేరు, కీర్తిని తెచ్చిపెట్టాయి. వేదనకు గురైన ఆత్మలను సుఖంగా ఉంచేందుకు, బాధలకు ఉపశమనం కలిగించేందుకు వారు పగలు, రాత్రి కష్టపడే రోజులు. కర్తవ్య భక్తి, వృత్తి పట్ల అంకితభావం, ప్రజలకు సహాయం చేయాలనే సంకల్పం ఈ జంటను గుంటూరులో ఇంటి పేరుగా మార్చాయి, గుంటూరు చుట్టుపక్కల గ్రామాల ప్రజలు రక్షకులుగా కనిపించారు.

వృత్తిపరమైన సేవ అనేది మన వృత్తి ద్వారా ఇతరులకు మనం అందించే ఆనందం, అందించే సేవగా నిర్వచించబడింది. డాక్టర్ సదాశివరావు, డాక్టర్ జయప్రద ఆ ఆదర్శాన్ని పాటిస్తూ, చెప్పిన సూత్రాన్ని పాటిస్తున్నారు. వారి వృత్తి సిల్వర్ జూబ్లీని పూర్తి చేసుకున్న ఈ సంతోషకరమైన సందర్భంగా, నేను స్నేహితులందరితో కలిసి వారికి సుదీర్ఘమైన, ఉద్దేశపూర్వక, ఉపయోగకరమైన జీవితాన్ని కోరుకుంటు ఉన్నాను.

ఒక కారణం లేదా ప్రయోజనం కోసం సేవ చేయడం అనేది జీవితం కోరుకునే ఒక విషయం. అది కనుగొనబడకపోతే, అది ఉనికి కోసం స్థిరపడుతుంది, దానిని జీవిస్తుంది. నిజమైన జీవనం మానవజాతికి కొంత సేవను కలిగి ఉంటుంది, ఒక అర్థవంతమైన మిషన్‌లో ఉంటుంది–డాక్టర్ సదాశివరావు ఆ లక్ష్యంతో తన వృత్తిని కొనసాగిస్తున్నారు. తన అడుగుజాడల్లో తన వృత్తిలో చేరుతున్న తన పిల్లలందరిలో ఆ ఆలోచనను నింపాడు. ఈ వైద్యుల కుటుంబం పేద, ధనిక అనే తేడా లేకుండా వారి సేవను కొనసాగించాలని, వారి లక్ష్యం–సేవను నెరవేర్చాలని ఆశిద్దాం.

# నా తాత

డాక్టర్ సుమన చదలవాడ
మనుమరాలు

అతడు...

నా టాటా ఒకసారి మా టెట్-ఎ-టెట్‌లలో హిస్టారికల్ వర్తమాన కాలం గురించి నాతో మాట్లాడారు. అతని వర్ణన – ఒక గొప్ప వ్యక్తి మరణించినప్పుడు అతను/ఆమె ప్రపంచంపై వారి ప్రభావం కాలాన్ని మించి ఉంటుంది కాబట్టి అతను/ఆమె ఉన్నట్లే సూచించబడతారు.

తన కమ్యూనిటీలో ఒక ట్రైల్‌బ్లేజర్, సర్జరీ రంగంలో మాస్టర్, స్ఫూర్తిదాయకమైన గురువు, ప్రగతిశీల విద్యావేత్త, నైతిక రాజకీయవేత్త నిజమైన స్నేహితుడు, ప్రేమగల కుటుంబం మనిషి ప్రతి ఒక్కటి తన కష్టపడి, సంకల్పంతో, క్రాఫ్ట్ పట్ల అంకితభావంతో తెరిచాడు, అతను వెనుకాడడు. వారి పూర్తి సామర్థ్యాన్ని సాధించడానికి ఇతరులకు మార్గనిర్దేశం చేయండి.

ఆయన శతజయంతి స్మారకోత్సవం ఖచ్చితంగా ఆయన వ్యక్తిగతంగా అందుకోవాలని మనమందరం కోరుకునే గౌరవప్రదమైన గౌరవం. అతని కంఠస్వరం, చిరునవ్వు, అతని కళ్ళలో మెరుపు మనమందరం మిస్ అవుతాము. మన జీవితాలన్నింటిపై ఆయన అందించిన అన్ని సహకారాలు, మార్గదర్శకత్వం ప్రభావాన్ని ప్రతిబింబిస్తూ, మన జీవితాలన్నీ సుసంపన్నం అయినందున మేము వినయం, కృతజ్ఞతతో కలిసి ఒక గొప్ప వ్యక్తిని జరుపుకుంటాము.

అందుకే ఆయన మనందరితో కలకాలం ఉంటాడు.



# సవ్యసాచి సదాశివుడు!

శ్రీమతి మల్లవరపు శౌంఖ్య



వైద్య వృత్తికి అంకితుడు!
శస్త్ర విద్యలో ప్రవీణుడు!
సాటి వైద్యులకు స్నేహితుడు!
వారితో వైద్య రహస్యాలను
పంచుకునే ఉదారుడు!
విద్యార్ధులకు గురువు,
సలహాదారుడు!
బీదలపాలిట ఆపద్బాంధవుడు!
తీరికలేని సమయంలోనూ
తెలుగు సాహిత్యాన్ని మరువని
రసగ్నుడు!
సాహితీ సదస్సు ప్రారంభకుడు!
జాషువా సంజీవదేవ్ కాళోజీ నాజర్
దువ్వూరి అమరేంద్ర విశ్వనాథులనే
దిగ్గజాలను సాహితీ సదస్సు కు
ఆహ్వానించిన సాహితీ ప్రియుడు!
యువత లో తెలుగు సాహిత్యం పట్ల అభిరుచి పెంచిన
సాహిత్య ప్రేమికుడు!
సదా కుటుంబ సంక్షేమాన్ని
ఆశించిన కుటుంబీకుడు!
వివాహ బాంధవ్య పరాయణుడు!
జయప్రదాంబగారికి ధీటైన
సహచరుడు!
పిల్లలందరినీ డాక్టర్లు చేసిన

ప్రతిభావంతుడు!
ఎమర్జెన్సీని తూర్పారబట్టిన
విమర్శకుడు!
ఆంధ్రరాష్ట్రంలో జనతాపార్టీ
కార్యశీలకుడు!
ఎన్టీఆర్ పార్టీ లో చేరిన
రాజకీయ నాయకుడు!
అన్ననైనా విమర్శించగల
సమర్థుడు!
అసెంబ్లీ సభ్యుడిగా నియోజకవర్గ
సంక్షేమానికి పాటుపడిన సేవకుడు!



విద్యారంగంవైపుకు దృష్టి సారించిన
మార్గదర్శకుడు!
సీతారామయ్య పాఠశాల జేకేసి
కళాశాల స్థాపన కారకుడు!
నాగార్జున ఎద్యుకేషన్ సొసైటీ
అధ్యక్షుడు!
ఎన్నో కాలేజీలో స్థాపనకు
చెయ్యందించిన వ్యవస్థాపకుడు!
అద్వితీయుడు సదాశివుడు!
అందరికీ ఆచరణీయుడు!
చిరస్మరణీయుడు!

# మహోన్నత యశోభూషణ సుమగంధం
## డాక్టర్ కాసరనేని సదాశివరావు

శ్రీమతి కనుమూరి లక్ష్మి రమేశ్, నర్సారావుపేట

ఈ భువిపైన విరిసిన ఎందరో మహానుభావులు అందరకీ వందనాలు అందరిలాగే ఒక సామాన్య కుటుంబంలో పుట్టి పెరిగిన మట్టిలో మాణిక్యం. అన్నదాత కుటుంబం నుండి జనియించిన ఒక మహోన్నత వ్యక్తిత్వం.

అది సరిగ్గా 1923 వ సంవత్సరం, అక్టోబర్ మాసం, ఆ నెలలోనే పదమూడవ తేదీన భాగ్యము రామశాస్త్రులు అనే దంపతులకు గుంటూరు జిల్లా పెదకాకాని మండలం, తక్కెళ్లపాడుకు పక్కన గల రామచంద్రపాలెంలో కాసరనేని కుటుంబాన (ఆ వూరిని గారపాడు అని కూడా పిలుస్తారు. 1) జన్మించారు సదాశివరావుగారు, పుట్టుక తోనే గోల్డెన్ స్పూన్ తో పెరగక పోయిన ఒక సాధారణ మధ్యతరగతి సాదక బాధకాలు తెలిసిన రైతు కుటుంబాన పెరిగి ఆ కుటుంబానికే ఓ తలమాణికగా నిలిచారు.

డాక్టర్ చలసాని జయప్రదాంబ గారిని జీవిత భాగస్వామిగా చేబూనారు వీరికి ఐదుగురు సంతానం ఐదుగురూ కూడా మంచి పేరు ప్రఖ్యాతులు గాంచిన డాక్టర్లే కావడం విశేషం. అంతేకాదు వీరికి ఒక మంచి మేనమామ కూడా వున్నారు ఆయన పేరు శ్రీ పిన్నమనేని సూరయ్య గారు. ఈయన, ఆ కాలంలోనే స్వాతంత్ర్య ఉద్యమంలో చురుగ్గా పాల్గొనటమే కాకుండా జైలుశిక్ష కూడా అనుభవించిన ఒక గొప్ప దేశభక్తుడు. వారి పర్యవేక్షణలో శ్రీ సదాశినరావు గారు మంచితనాన్ని, సమాజ సేవను తన ఆస్తిగా మూట కట్టుకొని పలువురికి బాసటగా నిలిచారు ఒక సామాన్య మధ్య తరగతి రైతు కుటుంబం నుంచి వచ్చిన శ్రీ సదాశివరావు గారు చదువంటే బహుప్రీతి కలిగి విద్యా రంగాన వైద్య విద్యను అభ్యసించి ప్రావీణ్యం కలిగిన వైద్యునిగా "పేపుల్స్ నర్సింగ్ హెూమ్" పేరిట ప్రజా వైద్యశాలను, మిర్చి, పొగాకు ఘాటుకు ప్రసిద్ధి గాంచిన గుంటూరు నడిబొడ్డున స్థాపించి దాదాపు అర్ధ శతాబ్దం పాటు వైద్యవృత్తిని కొనసాగించారు. మంచి హస్తవాసి గల డాక్టరుగా పేరెన్నిక గలిగిన డాక్టర్ సదాశివరావు గారు, పేద ప్రజల పట్ల చాలా ఉదారంగా, అమితమైన శ్రద్ధతో వ్యవహరించేవారు. శస్త్రవైద్య నిపుణునిగా వృత్తిలో దైవత్వాన్ని, మానవత్వాన్ని వృత్తి విలువలను తు.చ తప్పక పాటించటంలో ఆయనకు ఆయనే సాటిగా నిలిచారు.

వృత్తి రీత్యా వైద్యుడు అయినప్పటికీ గొప్ప రాజకీయవేత్తగా, దానకీలిగా, గొప్ప విద్యా విశ్లేషకునిగా, తెలుగు సాహిత్యం పట్ల అమితమైన అభిలాషిగా, అలానే నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ వ్యవస్థాపక కార్యదర్శిగా ప్రసిద్ధి చెందిన శస్త్ర వైద్య నిపుణులు మన శ్రీ సదాశివరావు గారు..

గ్రామీణ ప్రజలపై ఆపేక్షతో, పేద ప్రజలకు ఎంతో కొంత సాయపడాలి అనే మనస్సుతో ఒక బలమైన తలంపుతో రైతాంగ హక్కుల కొరకై శ్రీ సదాశివరావు గారు రాజకీయ రంగప్రవేశం చేశారు. అది 1978వ సంవత్సరం. రాజకీయరంగం పైన ప్రీతితో మొట్ట మొదట జనతా పార్టీ అభ్యర్థిగా గుంటూరు పార్లమెంటుకు ఆనాటి కీలక మంత్రి కొత్త రఘురామయ్యపై పోటీ చేసారు.

శ్రీ నందమూరి తారక రామారావు గారు స్థాపించిన తెలుగుదేశం పార్టీలో చేరి, తరువాత కొంతకాలానికే పెదకూరపాడు నియోజకవర్గం నుండి శాసనసభకు ఎన్నికయ్యారు. తదుపరి పర్యాయం రాజకీయ రంగాన వున్న ప్రతి క్షణమూ ఉన్నత విలువలతో జీవించి, తాను నమ్మిన విలువలకు కట్టుబడే వుండి, పలువురికి ఆదర్శ ప్రాయుడిగా నిలిచి ఎంతో ఇతోధిక సేవ జేసిన గొప్ప మానవతామూర్తి డాక్టరు సదాశివరావు గారు.

విభిన్న కోణాలు ఒకే వ్యక్తిలో కనబరుస్తూ సాహిత్య రంగాన ఒక అందెవేసిన హస్తంగా వుంటూనే ఒక గొప్ప సాహితీవేత్తగా తనదైన శైలిలో సాహితీ సదస్సు పేరిట గుంటూరులో ఒక సాహిత్య వేదికను ఏర్పాటు చేసి ఆ సంస్థ ద్వారా ప్రముఖ కవులను, రచయితలను, తాత్వికులను గుంటూరుకు ఆహ్వానించి వారి ప్రసంగాలను గుంటూరు ప్రజలకు వినిపింపజేయటంలో మిక్కిలి శ్రద్ధ కనబరిచేవారు.

వీటి అన్నింటినీ మించి ఒక విద్యా దార్శినికునిగా గుంటూరు లోని ప్రతిష్ఠాత్మక నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ కి వ్యవస్థాపక కార్యదర్శిగా కూడా వ్యవహరించిన సదాశివరావు తదుపరి కాలంలో అనేక సంవత్సరాలపాటు ఆ సంస్థకు అధ్యక్షునిగా కూడా వ్యవహరించారు. ప్రస్తుతం ఈ నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ ఆధ్వర్యంలో గుంటూరులో ఎనిమిది ప్రముఖ విద్యాసంస్థలు పనిచేస్తున్నాయి. వీరు విద్యారంగాన కూడా ఒక చిరుదివ్వెగా నిలిచారు.

తదుపరి కాలంలో సదాశివరావు గారు తన భార్య మరణానంతరం ఒక ఔన్నత్య మనస్సుతో కూడిన ఆలోచనతో తన భార్య పేరు మీద డిగ్రీ కళాశాలను కూడా స్థాపించి, ఎంతో మంది పేద విద్యార్థినులకు ఇతోధికంగా సాయం చేకూర్చారు. ఉన్నతమైన భావాలతో జీవిస్తూ తమ విశ్రాంత జీవనంలో కూడా "సదాశివమ్" అను ఒక ఆత్మకథను ప్రచురించారు. స్వాతంత్ర్యానికి పూర్వమున్న గత పరిస్థితుల్ని నేటి పరిస్థితుల్ని నాత్మకంగా చూపెట్టడటంలో, విపులంగా కళ్లకు కట్టినట్లుగా ఆ ఆత్మకథలో వివరించటం జరిగింది.

అనుకోని ఒక విషాద క్షణం సెప్టెంబర్ పదకొండు 2012 న గుంటూరులో మరణించారు. తదుపరి భారత తపాలా శాఖ వారు వారి స్కరణలో వారు విభిన్న రంగాలకు చేసిన ఎనలేని సేవాతత్పరతకు చిహ్నంగా 2019 డిసెంబర్ మాసాన పదునాలుగవ తేదీన డాక్టర్ కాసరనేని సదాశివరావు గారి స్మారకంగా ఒక ప్రత్యేక తపాలా బిళ్లను కవరును విడుదల చేయటం జరిగింది. ఇందు

వలదు. అందు లేదని సందేహం వలదు ఎందెందు వెతికినా అందెందే కలదు డాక్టర్ శ్రీ కాసరనేని సదాశివరావు గారి ప్రతిభ అనేలా.

వైద్య రంగాన ఉదయించి, ఎనలేని సేవ జేసీ వన్నె తెచ్చిన వైద్య రంగపు యశోభూషణం..
మన డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు,
సకల రంగ ప్రావీణ్యత గలిగిన ఘనాపాటిగా.
విద్యా, వైద్య, సేవ, రాజకీయ, సాహితీ రంగాన
ఎనలేని సేవజేసిన శ్లాఘనీయంగా...
ఒక ఉపాధ్యాయునిగా, ఒక విద్యావేత్తగా....
ఒక సాహితీవేత్తగా,ఒక రాజకీయ నాయకునిగా...
మారుతున్న నేటి సమాజ పోకడల దృష్ట్యా
మార్పును తీసుకొచ్చిన ఓ అద్భుత హస్తంగా...
అన్నింటినీ మించి వైద్య రంగాన పేదల
పెన్నిధిగా పరిపూర్ణ పేరు గడించిన ఓ
ప్రజా సేవ నిబద్ధ హృదయంగా...
ఈ భరత జాతి పుణ్య భూమి గడ్డన
జనించిన ఓ అలుపెరుగని ఓ అసామాన్య
నీరాజనం
ఆయనే మన డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు..
వారికివే మా హృదయపూర్వక అభినందన చందన కుసుమ శతజయంతి నీరాజనాలు...



# ఆప్త మిత్రుడు

నందిపాటి కాశీ విశ్వనాథం

పెదకాకాని మండలం, తక్కెళ్ళపాడు గ్రామవాసి, ప్రస్తుతము పందరీపురం నాలుగో లైను గుంటూరు 2, నివాసి అయిన నందిపాటి కాశీ విశ్వనాథం అను నాకు చిన్న వయసు నుండి డాక్టర్ కాసరనేని సదాశివరావు గారితో పరిచయం ఉన్నది. నా వయసు 97 సంవత్సరములు. నాకంటే డాక్టర్ గారు మూడున్నర సంవత్సరములు పెద్దవారు. డాక్టర్ గారి తల్లితండ్రులు రామచంద్రపురం తక్కెళ్ళపాడు శివారు గ్రామము అయినప్పటికీ డాక్టర్ గారు మా ఊరిలోనే వారి తాత అమ్మమ్మల వద్ద పెరిగి పెద్దవాడవుటవలన వారితో చిన్నప్పటినుండే పరిచయం ఉన్నది.

ఆ పరిచయము గుంటూరు హిందూ హైస్కూల్లో కూడా కొనసాగింది నేను థర్డ్ ఫారం చదివేటప్పుడు సదాశివరావు గారు ఇంటర్మీడియట్ చదువుచుండేవారు వారు ఉత్తమ విద్యార్థి బాగా చదివేవారు. వారు డాక్టర్ చదువును విశాఖపట్నం వెళ్లి అక్కడ చదువుకునే కాలములో వారిని చూడటానికి నేను కూడా ఒక పర్యాయము వెళ్లి వారిని కలిశాను.

డాక్టర్ జయప్రదాంబ గారితో డాక్టర్ గారి ఆదర్శ వివాహమునకు హాజరైనాను. నేను గుంటూరు మార్కెట్ కమిటీ మిర్చి యార్డులో ఉద్యోగం చేయుచున్న రోజులలో ఉద్యోగము ముగించుకొని సాయంత్రం వేళలో డాక్టర్ గారి ప్రజా వైద్యశాలకు వెళ్లి కూర్చునే వాడిని, వారి సాహితీ సభలకు క్రమం తప్పకుండా హాజరవుతుండే వాడిని నా వివాహము పెండ్లి చూపులకు కూడా డాక్టర్ గారు హాజరగుట వారి స్నేహశీలతకు మచ్చుతునక.

గుంటూరు పందరీపురం నాలుగో లైన్ లోని నా ప్రస్తుత నివాస బిల్డింగు 1966 కొనుగోలు కూడా ఆయన సలహా మీదే జరిగినది. 1983లో మిర్చి యార్డ్ సెక్రటరీగా నేను పదవి విరమణ చేసి నాటినుండి డాక్టర్ గారి తుది శ్వాస వరకు సాయంత్రం వేళలో ప్రతిరోజు వారి ఇంటికి వెళ్లి కొంత కాలక్షేపం చేస్తూ ఉండేవాడిని వారికి అనేక అంశములపై అవగాహన వుంది. వారి రిమెంబర్స్ పవర్ చాలా గొప్పది. వారు ఎటువంటి తొందరపాటు నిర్ణయాలు తీసుకునేవారు కాదు చాలా కూల్ గా ఆలోచించేవారు సౌమ్యులు.

వారి ఆత్మీయత స్నేహశీలత మరువరానిది వారు అనేకమందికి వైద్య విద్య ఉద్యోగ వృత్తిరీత్యా చేసిన సహాయ సహకారములు మరువరానివి. వారితో ఉన్న సన్నిహిత్యము వలన నేను గమనించ విషయాలు వారితో చిన్ననాటి నుండి ఉన్న స్నేహమునకు నేను వారికి స్నేహితుడైనందుకు చాలా గర్వపడుచున్నాను.



## బహుముఖ ప్రజ్ఞాశాలి, మానవతావాది
## డాక్టర్ కాసరనేని సదాశివరావు

*నూతలపాటి కాళిదాను, ప్రజా నాట్యముడు*

కాసరనేని సదాశివరావు గారి శతజయంతి సందర్భంగా ఆయన జ్ఞాపకాలు పంచుకోవడు.. నా అదృష్టంగా భావిస్తున్నాను. ఎంతోమందికి సదాశివరావు గారు ఒక వైద్యుడిగా పరిచయం కాస మాత్రం ఒక వైద్యునిగా పరిచయంతో పాటు, నా జీవితాన్ని ప్రభావితం చేసిన ఒక గురుతుల్యుడిగా మార్గదర్శిగా ఆయన నా మదిలో ఎప్పటికీ నిలుస్తారు. ప్రత్యేకించి కళారంగంలో ప్రజా కార్యకర్త పనిచేసిన నాకు ఆయనతో కళారంగానికి సంబంధించిన కొన్ని సందర్భాలు గుర్తుకొస్తాయి. త్రిపు రామస్వామి చౌదరి రచించిన "శంభూకవథ" నాటక ప్రదర్శనకు నన్ను స్వయంగా తీసుకునివెర సందర్భం, అభ్యదయకవి గుర్రం జాషువా ను ఆహ్వానించి సభ జరపిన సందర్భాలు, అనేక అధ్యనము సాహితీ సమాలోచనలకు, కళాప్రదర్శనలకు ఆయన ఆసక్తిగా హాజరైన తీరు ఆయనలోని అభ్యుదయవాదానికి, హేతువాద దృక్పథానికి నిదర్శనాలు.

"కళ కళకోసం కాదు ప్రజల కోసం" అని ప్రజాచైతన్యం కోసం కృషి చేసిన ప్రజాకళాకారుడు సిస్టర్ హస్మి పేరిట ఏటా జరిగే ఓపెన్ థియేటర్ (Safdar Hashmi Open Theatre- SHOT) షాట్ ను 1999లో గుంటూరులో నిర్వహించాలని ప్రజానాట్య మండలి రాష్ట్రకమిటి తలపెట్టింది. గుంటూరు జిల్లాలో ఆ నిర్వహణ బాధ్యత నాకు అప్పగించారు. గుంటూరులో రాష్ట్రస్థాయి షాట్ నిర్వహణ ఆర్థికంగానూ ఇతర వనరుల రీత్యా మా శక్తికి మించింది. ఈ విషయంలో సదాశివరావు గారి సలహా కోసం నేను సంప్రదించాను. ఆయన ఏమాత్రం ఆలోచించకుండా ధైర్యం చెప్పి నాకు కొన్ని సూచనలు చేసారు. షాట్ నిర్వహణకు ఒక ఆహ్వాన సంఘం వేయమనీ, అందులో నగర ప్రముఖుల్నందరినీ భాగస్వాముల్ని చేయమని ప్రోత్సహించడమే గాక ఆయనే ఆహ్వాన సంఘానికి అధ్యక్షునిగా వ్యవహరించి ఆ కార్యక్రమ నిర్వహణ ఆసాంతం మమ్మల్ని గైడ్ చేసారు.

కొన్ని సందర్భాలు గమనించినప్పుడు ఆయనలోని మానవతావాదం ఆయన తల్లి నుండి సంక్రమించిందేమో అనిపిస్తుంది వైద్యశాలలో రెండు రూపాయలు ఓ.పి ఫీజు పెంచాలని ప్రతిపాదన వచ్చినప్పుడు సదాశివరావు గారి మాతృమూర్తి ఇలా అన్నదట. "ఇప్పుడు ఓ.పి ఫీజు పెంచాల్సిన అవసరం ఉన్నదా? నిర్వహణ భారం కానప్పుడు పెంచడం సమంజసం కాదు' ఆయనలో అదే మానవతావాదం కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. ఒకసారి నేను దింటెనపాడు గ్రామానికి చెందిన ఒక యువకుడి కంటికి దెబ్బ తగిలిచే అత్యవసరమై జేబులో డబ్బులు లేకుండానే సదాశివరావుగారి వద్దకు తీసుకెళ్లాను. ఆయన కంటి డాక్టర్ ను పిలిపించి వైద్య సలహా తీసుకుందాం అన్నారు. నా దగ్గర డబ్బులు లేవు అని ఆయన దృష్టికి తీసుకువస్తే, డబ్బులు నేను అడిగానా అంటూ సున్నితంగా మందలించి కంటి డాక్టర్ ను పిలిపించి వైద్య సలహా తీసుకుని మూడు రోజులు ఆ యువకునికి వైద్యం చేసి పంపారు. సాధారణంగా వైద్యుడి వద్దకు వెళ్లడం అంటే సందేహంగా, భయంగా వెళ్లడం సహజం. ఇందుకు భిన్నంగా సదాశివరావు గారి వద్దకు వెళ్లే రోగులు : తమ స్వంత మనిషి వద్దకు వెళ్లినట్లుగా నిర్భయంగా, నిండు విశ్వాసంతో వెళ్లగలిగేవారు. జబ్బు గురించి మాత్రమే గాక, తమ తమ కుటుంబ విషయాలు, వ్యవసాయం, పాడి, ఇంటిదగ్గర పరిస్థితులు వంటి విషయాలన్నీ ఆప్యాయంగా మాట్లాడేవారు. వచ్చిన రోగి కుటుంబానికి చెందిన రెండు తరాల వ్యక్తుల గురించి మాట్లాడగలిగే అనుబంధం ఆయనకు ఉండేది. చదువుకునే విద్యార్థుల వద్ద ఫీజు తీసుకోకపోగా ఆయన వద్ద ఉన్న శాంపిల్స్ మెడిసిన్స్ ఇచ్చి పంపేవారు. ఒకానొక సమయంలో గుంటూరు జిల్లాలో కొత్తగా పెట్టిన హాస్పిటల్స్ లో సింహభాగం ఆయన చేతుల మీదుగా ప్రారంభించ బడ్డాయనడం అతిశయోక్తి కాదు.

సామాజిక స్పృహతో విద్యాలయాల వంటి సంస్థల స్థాపనలో ఆయన కీలకపాత్ర పోషించారు. నాగార్జున ఎడ్యుకేషనల్ సొసైటీ, జె.కె.సి. కళాశాల, ఆర్.వి.ఆర్. ఇంజనీరింగ్ కళాశాల వంటి విద్యాసంస్థలు అందుకు తార్కాణాలు. ఆయన స్వంత గ్రామమైన తక్కెళ్లపాడులో డాక్టర్ సదాశివరావు గారి కళా పరిషత్ పేరుతో ఒక కళాసంస్థను ఆయన జీవితకాలంలోనే స్థాపించడం ఆ గ్రామ ప్రజలకు ఆయనపైన ఉన్న ఆదరాభిమానాలకు నిదర్శనం.

సదాశివరావు గారు రాజకీయాలలో కూడా ఒక విశిష్టమైన శైలికి కట్టుబడ్డారు. తనకు రాజకీయంగా గురువులాంటి వాడైన యన్ జి రంగా పైన తానే పోటీ చేసినప్పుడు వచ్చిన విమర్శలకు ఆయన ఏ విషయానికి ఆ విషయం నిర్దిష్టంగా చూడాలి' అని సమాధానమివ్వడం ఆయన పరిపక్వతకు తార్కాణం. ఎన్నికల సందర్భంగా తెనాలిలో జరిగిన సభలో ఆయన ప్రసంగిస్తూ వైద్యునిగా నేను రోగానికి శస్త్రచికిత్స చేయడమే కాదు. సమాజంలో నెలకొన్న కుళ్లిన రాజకీయాలకు కూడా శస్త్రచికిత్స చేయాల్సి వున్నది' అన్నారు. రైతుల సమస్యల పరిష్కారం కోసం కృషి సల్పిన చరణ్ సింగ్ ను ఆయన అభిమానించేవారు.

వ్యక్తిగతంగా పరిశీలించినప్పుడు ఆయన జీవనగమనంలో ప్రేమించి వివాహం చేసుకున్న ఆయన సహధర్మచారిణి జయప్రదాంబ గారి పాత్ర కీలకం, జయప్రదాంబ గారి వద్ద పనిచేసిన అన్నపూర్ణమ్మ అనే సీనియర్ నర్సు గర్భిణీలకు అవసరమైన వైద్యం పూర్తిగా చేయగల్గిన సామర్థ్యం ఉన్నప్పటికీ కాన్పు సమయంలో తానే స్వయంగా హాజరయ్యేవారు. కష్టసుఖాలలో తోడుగా ఉండటమే గాక, ఆయన దృక్పథానికి విలువనిచ్చి ప్రోత్సహించడంలో ఆవిడ పాత్ర కీలకం, తమ పిల్లల్ని ఉన్నత చదువులకు ప్రోత్సహించడంలో గానీ, వాళ్లలో చాందసవాదం కాకుండా మానవతావాదం పెంపొందేలా కృషి చేయడంలో ఇద్దరూ సమన్వయంతో వ్యవహరించడం. గమనించదగ్గ విషయం.

సదాశివరావు గారు ఒక సందర్భంలో తెలివికి నిర్వచనం ఏంటి అని అడిగారు. ప్రక్కనే ఉన్న కొద్దిమంది కొన్ని సమాధానాలిచ్చారు. కష్టపడి సంపాదించడం, వృత్తిలో నైపుణ్యం కల్గివుండటం మంచి పదవి బాధ్యత నిర్వహించడం వంటి సమాధానాలిచ్చారు. అనంతరం ఆయన మాట్లాడుతూ మనిషిగా జన్మించిన తర్వాత తన కుటుంబ క్షేమమే గాక, ఇరుగు పొరుగు బాగును దేశం బాగును కోరుకుని తన శక్తియుక్తులను ఉపయోగించడమే నిజమైన తెలివి అని వ్యాఖ్యానించారు.

ఒక వైద్యుడిగానే కాకుండా ఒక అద్భుతమైన మానవునిగా సదాశివరావు గారు చిరస్థాయిగా చరిత్రలో నిలుస్తారు. సమాజంలో ఒక ప్రముఖ వ్యక్తితో ఎంత స్నేహంగా, సన్నిహితంగా వ్యవహరిస్తారో అంతే స్నేహంగా, సన్నిహితంగా ఒక సాధారణ గ్రామీణుడైన నాతో కూడా ఉండి, అభ్యుదయమార్గంలో నా పయనాన్ని ప్రోత్సహించిన డాక్టర్ సదాశివరావు గారి స్మరించుకోవడం ఆయన శతజయంతి సందర్భంగా నా అదృష్టంగా భావిస్తూ ఆయనకు వినమ్రపూర్వకంగా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాను.



## విలక్షణమైన వ్యక్తిత్వం

వడ్డే శోభనాద్రీశ్వరరావు
మాజీ మంత్రివర్యులు

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు విలక్షణమైన వ్యక్తిత్వంతో గుంటూరు సీమ ప్రజల హృదయాలలో తనకంటూ ప్రత్యేక స్థానాన్ని పొందారు. వైద్యవృత్తిని కేవలం ఆదాయాన్ని సమకూర్చే సాధనంగా భావించక ప్రజలకు ముఖ్యంగా తాను పుట్టి పెరిగిన ప్రాంత వాసులకు వైద్య సేవలనందించాలనే ఆశయంతో వైద్యశాలను ఏర్పాటుచేసి, రోగాన్ని గురించి నిజం చెప్పే డాక్టరుగా, రోగులను పీడించక, వారి స్థోమతను బట్టి యిచ్చిన దానితో తృప్తిచెంది, తక్కువ వ్యయంతో నాణ్యతతో కూడిన వైద్యాన్ని, సర్జరీని అందించే ప్రజా వైద్యశాలలకు ఆద్యుడైనారు డాక్టరు సదాశివరావు గారు. గుంటూరు– ప్రకాశం జిల్లాలో అనేక గ్రామాల్లో డాక్టరు గారి అభిమానులు వున్నారు.

వైద్య శాస్త్రాన్ని అభ్యసించుతూనే సమకాలీన, రాజకీయ పరిస్థితులను గమనించుతూ, మహాత్మా గాంధీని దగ్గరగా సందర్శించు భాగ్యమును పొందారు. ఆచార్య రంగా గారు డాక్టరు గారిపై గాఢమైన ప్రభావాన్ని కల్గించారు. కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్యం ఆశయం డాక్టరు గారిని ఆకర్షించబట్టే స్వతంత్ర పార్టీ, బి.యల్ డి. జనతా పార్టీ, లోక్ దళ్ లో ప్రముఖ పాత్రను పోషించారు.

రంగాజీ కాంగ్రెసులోనికి వెళ్ళినా రైతు శ్రేయస్సు, గ్రామీణ అభ్యున్నతికి, చౌదరీ చరణ్ సింగ్ నాయకత్వంలో సర్దార్ గౌతు లచ్చన్న సారధ్యలో లోకిదళ్ పార్టీలో రాష్ట్ర ఉపాధ్యక్షునిగా వ్యవహరించారు.

చిలకలూరిపేటలో కిసాన్ సమ్మేళన్ మహాసభలను అత్యంత జయప్రదంగా నిర్వహించడానికి కృషి సల్పారు. అప్పట్లో నేను ఆంధ్ర ప్రదేశ్ కిసాన్ సమ్మేళన్ అధ్యక్షునిగా వున్నాను. చౌదరి సాబ్ వ్రాసిన "Economic Night of India" పుస్తకలో చాలా చక్కగా, వివరంగా, సోదాహరణంగా భారతదేశం అన్ని వనరులను కలిగి వుండి కూడా ఎందువలన వెనుకబడి వుంది. ముందుగా వ్యవసాయాభి వృద్ధి చెంది గ్రామీణ ప్రజల కొనుగోలు శక్తి పెరిగినప్పుడు పారిశ్రామికాభివృద్ధి సేవా రంగాలు కూడా అభివృద్ధి

చెంది భారతదేశం సుసంపన్నం కాగలదని చరణిసింగ్ విశ్లేషించారు. చరణ్ సింగ్ పట్ల డాక్టరు గారిలో కాని, నాలోకాని గాఢంగా నాటుకుపోయిన అభిమానమే 1983లో నందమూరి తారకరామారావుగారు ప్రారంభించిన తెలుగుదేశం ప్రభంజనం ఉధృతంగా వుండి పలువురు హితులు, అభిమానులు, అనుచరులు తెలుగుదేశంలో చేరమని ఒత్తిళ్ళు తెచ్చినా, మేము లోక్దళ్లోనే కొనసాగేట్లు చేసింది. తరువాత తెలుగు దేశంలో చేరి పెదకూరపాడు శాసన సభ్యునిగా ఆ ప్రాంత అభివృద్ధికి గణనీయమైన సేవ లందించారు డాక్టరు గారు. పదవుల కొరకు డాక్టరు గారు ఏనాడూ ప్రాకులాడలేదు.

విద్యారంగానికి ఎనలేని సేవలనందించారు డాక్టరు గారు మాననీయులు జాగర్లమూడి చంద్రమౌళిగారు, చేబ్రోలు హనుమయ్యగారు, గోగినేని కనకయ్య గారు మున్నగు వదాన్యులతో కలసి స్థాపించిన జె.కె.సి కళాశాల దినదిన ప్రవర్ధమానమై పోస్టు గ్రాడ్యుయేషన్తో సహా అనేక కోర్సులను అందిస్తుంది. డా. మద్దిన గోపాలకృష్ణ గారు సమకూర్చిన స్థలంలో డాక్టరు గారి కుటుంబ సభ్యుల భూరి విరాళంతో ప్రారంభించబడిన డా. జయప్రదాంబ మహిళా కళాశాల నేడు వేలాది మంది విద్యార్థినులకు చక్కని ఉన్నత విద్యను లభింపజేయటం అభినందనీయం.

ముందునుండీ సాహిత్యాభిలాష, కవులలో సన్నిహిత మిత్రత్వం, సాహిత్య గోష్ఠులు, కవులకు సన్మానం జరపటం డాక్టరుగారికి ఆనందం కలిగించే విషయం. అందుకు వారి అర్ధాంగి జయప్రదాంబగారు కవి గారి కుమార్తె కావడం కొంత వరకు కారణం కావచ్చు. ఒక ఇంగ్లీషు వార పత్రికలో నెపోలియన్ చివరి రోజులకు సంబంధించిన వ్యాసం చదివి తనకున్న ఉబ్బసం అనారోగ్యం పట్ల లెట్ట చేయక ధైర్యంగా తన వ్యాపకాన్ని కొనసాగించిన మనో నిబ్బరం కల వ్యక్తి. ఆచార్య రంగా, చౌదరీ చరణ్ సింగ్, లోక్ నాయక్ జయప్రకాష్ నారాయణ్ ఆశయాలకు అనుగుణంగా సర్దార్ గౌతు లచ్చన్న, తెలుగు తేజం యన్.టి. రామారావు గార్ల నేతృత్వంలో సుదీర్ఘ రాజకీయ ప్రస్థానంలో మచ్చలేని వ్యక్తిగా నిజాయితీ నిబద్ధతలతో వైద్యోనారాయణ సూక్తిని పాటించిన డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు పుణ్య పురుషుడు, ధన్యజీవి. నేటి యువతరం ముఖ్యంగా వైద్యవృత్తిలో వున్న వారికి ఆయన స్ఫూర్తి కావాలి. డాక్టరు గారి శత జయంతి ఉత్సవాలు ఘనంగా జరగాలని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను.

# డాక్టర్ రమణ యశస్వి సందేశం

## డాక్టర్ కాసరనేని సదాశివరావు

వైద్య ,విద్య , సాహితీ సామాజిక సేవా రంగాలలో అత్యున్నత
ప్రమాణాలు నెలకొలిపి రాష్ట్రంలో ఎన్నో ఆస్పత్రులను
ప్రారంభించిన కీ॥ శే॥ డా॥ కాసరనేని సదాశివరావు గారి
శతజయంతి ఉత్సవం సందర్భంగా స్మరణంతో మరణం
కూడా మరణిస్తుంది అని నమ్మిన వారి అభిమాన వైద్యులు
అంతర్లాపి పద్ధతిన అందిస్తున్న స్మరణ మాల



ఆరోగ్య రంగ ఆ **కా** శంలో నభూతో ధృవతార
పేదవారికి అ **స** మాన ప్రేమ అందించిన సేవారత
రైతు హక్కుల కొ **ర** కు పోరాడిన యోధుడు
నీతి ,విలువల **నే** నమ్మిన సిద్ధాంత ప్రేమికుడు
సాహితి సదస్సు **ని** ర్వహించిన కళా పోషకుడు
కూరపాడులో శా **స** న సభకు ఎన్నికైన వైద్యుడు
విద్య, వైద్య సుప్ర **దా** త ఈ గారపాడు గాడ్
ఆత్మకథ సదా **శి** వమ్ ఆవిష్కరించిన బహుముఖీనుడు
వైద్య రంగానికి **వ** న్నె తెచ్చిన పీపుల్స్ దేవుడు
హస్తవాసిలో రా **రా** జుగా వెలుగొందిన సజ్జ(ర్జ)నుడు
మీ శత జయంతి **వు** త్సవం ప్రతి వైద్యునికి స్ఫూర్తి

( ఈ అభినందన స్మరణ మాల అంతర్లాపి పద్ధతి ప్రకారం ప్రతి
వాక్యంలో 7 వ అక్షరాన్ని నిలువుగా కలిపి చదివితే
డా. కాసరనేని సదాశివరావు నామధేయం వస్తుంది)

రచన
కళారత్న డా . రమణ యశశ్వి
ప్రొఫెసర్, ఆర్థో విభాగం, గుంటూరు వైద్య కళాశాల

సమర్పణ
గుంటూరు వైద్యులు

# సభలు సమావేశాలు


గురుపూజా మహోత్సవము
ఉత్తమ విద్యార్థుల పురస్కారము




Brahma
...the creator in 'u'
R.V.R & J.C.College Cultural Committee




WELCOME
ANNUAL




విద్యాసంస్థలు
1988-98




HINDU COLLEGE





# మా బావ గారు

డాక్టర్ వై.యస్. కృష్ణమూర్తి
బాపట్ల

ముందుగా మా బావగారి శత జయంతి ఉత్సవ కమిటీకి వందనములు. నా స్వగ్రామము కలవపాముల డాక్టరు జయప్రదాంబ గారు మా పెదనాన్న గారి కుమార్తె కావటముతో మేమిరువురము ఒకేచోట పెరుగుట వలన ఇరువురకు ఆత్మీయత ఎక్కువ.

నేను 1947లో విశాఖపట్టణంలో వైద్య విద్యార్థిగా చేరాను. డాక్టరుగారు నాకు 5 సం.లు సీనియరు. మొట్టమొదట స్వర్గీయ డాక్టరు కుర్రా వీరరాఘవయ్య నాకు డాక్టరు గారిని పరిచయము చేశారు. ఆ పరిచయమే పెరిగి లాడ్డిమేటుగా గురుతుల్యుడుగా ఆత్మీయుడుగా వృద్ధిచెంది వారి వివాహమునకు సంధానకర్తనై బావగారిగా చేసుకున్నాను. వారిని గురించి పూర్తిగా తెలిసిన వాళ్లము ప్రస్తుతము నేను, చీరాలలో డా. ప్రతాప్కుమార్, చెరుకుపల్లిలో డా పాపారావు ప్రైవేటు ప్రాక్టీసు చేస్తున్నాము. వారు స్వీయ చరిత్రలో వ్రాసినట్లుగా విశాఖపట్టణములో యమ్. యస్. చేసే రోజులలో కొద్ది రోజులు ఫిజియాలజీ ట్యూటర్గా యమ్.ఆర్.ఒ. గా అసిస్టెంట్ సర్జన్గా చేసారు. అసిస్టెంట్ సర్జన్ గా చేస్తున్న సమయము నేను వారి విద్యార్థిని, వారికి ఉద్యోగము లేనప్పుడు మా అక్క ఆసిస్టెంట్ సర్జన్ గా చేస్తూ గర్భవతిగా ఇంటి పనులు గూడ నిర్వహించుటలో ప్రసవించవలసిన సమయముకన్నా ముందే ప్రసవించి పుట్టిన పుత్రుణ్ణి పోగొట్టుకొని చాల వ్యధకు లోనైంది. ఓదార్చుట మా తరము కాలేదు. కొద్ది రోజుల తరువాత డాక్టరు గారు యం.యస్. పరీక్ష ఉత్తీర్ణులై బంగారు పతకము సాధించారు.

పరిస్థితులు మా అక్కకు కొంత ఉపశాంతి కలిగించినవి. ఆ తరువాత కొద్ది రోజులకే గుంటూరులో ప్రాక్టీసు పెట్టి ఆసుపత్రికి ప్రజావైద్యశాల అని నామకరణము చేశారు. ప్రజావైద్యశాల ఆక్షరాల ప్రజావైద్యశాల అనిపించుకున్నది.

నేను గుంటూరు ఆసుపత్రిలో సీనియర్ హౌస్ సర్జనుగా చేశాను. రోజు విజయవాడ నుండి వచ్చేవాడిని అలస్యమైనపుడు వారింట్లోనే ఉండే వాడిని బాపట్లలో ప్రాక్టీస్ పెడితే ఎలా వుంటుందని నేనడిగినపుడు డా రంగయ్యగారు పెదనందిపాడు వెళ్లాలంటున్నారు, కనుక అక్కడ బాగుంటుందని సలహా ఇచ్చి, కావలసిన ఏర్పాట్లకు తోడ్పడి బాపట్లలో చాల మందికి పరిచయము చేశారు. 1955 ఏప్రిల్ 25వ తేదీ వారితోనే నా నర్సింగ్హోమ్ ప్రారంభింపచేశాను. నాకు తెలిసినంత వరకు వారికి అదే ప్రథమ ప్రారంభము అంటే ఆసుపత్రిని ప్రారంభించుట. ఆ తరువాత సర్జరీ కేసులన్నింటికి శ్రమ అనుకోకుండా వచ్చి నేను స్వయంగా చేయగలిగే వరకు తెనాలి నుండి. డా. వీరరాఘవయ్య గారు రావడానికి తోడ్పడ్డారు. తెనాలిలో రాఘవయ్య, వీరయ్య డాక్టర్లకు వారే శిక్షణ ఇచ్చారు. ఇలా మాకే గాదు మరెంతమందినో గురువుగారు తీర్చిదిద్దారు. నేను డా ప్రతాప్ గారు ఒకరి కొకరు సహాయము చేసికొనే నారము, చిలకలూరిపేటలో కాజ కృష్ణమూర్తి గారు చెరుకుపల్లిలో పాపారావు గారు వీరి దగ్గర శిక్షణ పొందినవారే. మొదట్లో ఆయనకు కారులేదు. స్నేహితుడు అట్లూరి వెంకటేశ్వరరావు గారి కార్లో వచ్చేవారు మాకెప్పుడైనా సర్జికల్ కాంప్లికేషన్ వస్తే ఆయన వద్దకు తీసికొని వెళ్ళేవారము.

ఒక సారి మా తాతగారి పెద్ద కర్మకు కలవపాముల వెళ్లవలసి వచ్చి ఆయన స్నేహితుని కారులో బయలు దేరాము దానికి స్టార్ట్ చేయుటకు తాళము చెవి లేనందున రెండు వైర్లు కలిపితే బయలుదేరుతుందని నేను వారితోనే కారు తోయించాను. వైర్ల విషయము కూడ తెలిసికోలేదని నన్నేమి అనలేదు. ఈ విషయములో వారు ఎదుటి వారి అశ్రద్ధను అవకాశంగా తీసికొని హేళన చేయని ఓర్పు ఎంతో తెలుసుకున్నాను. వారి జీవిత చరిత్రలో వ్రాసినట్లు 1962 డిసెంబరులో ఔరంగాబాద్, అజంతా, ఎల్లోరా, బొంబాయి, పూనా పట్టణములన్నీ కారులో వెళ్లి వచ్చాము. నాటి ఆ ప్రయాణపు ఆనందము మరువలేనిది. 1966 డిసెంబరులో సదాశివరావుగారు, డా. యతిరాజులు గారు, డా. నూతక్కి వెంకటేశ్వరరావు గారు డా నాదెళ్ల కృష్ణారావు గారు, డా. ప్రతాప కుమార్ గారు మేము అందరము సకుటుంబముగా ఐదు కార్లలో తిరుపతి, కుప్పం, బెంగుళూరు, మణిపాల్, తిరువనంతపురము, కన్యాకుమారి, శుచీంద్రము, మధుర, రామేశ్వరం, పుదుచ్చేరి అన్నీ తిరిగి వచ్చిన విషయము వ్రాస్తుంటే ఆ అనుభూతి కళ్లముందు కదులుతున్నట్లు ఆనందంగా ఉంది. ఆ 15 రోజులు నా ఆసుపత్రి చూచుటకు డా. పరంధామయ్యగారు. కీ.శే.డా. మహదేవ రావుగారిని ఏర్పాటు చేసినారు.

వారు అనారోగ్యముగా వున్నప్పుడు నా దగ్గర 10 రోజులున్నారు. అప్పుడు మా పిల్లలతో ఎంతో సరదాగా గడిపారు. నేను 1986 నుండి ఎక్కువగా పిల్లల వద్ద అమరికాలో ఉండే వాడిని 1997లో డాక్టరు గారు అమెరికా వచ్చి మా అమ్మాయి డా. మాలతి, అల్లుడు డా. నందనకుమార్ గార్ల ఇంట్లో

నాలుగు వాదాలున్నారు అప్పుడు వారికి అస్వస్థతగా ఉంటే తగు విశ్రాంతి తీసుకున్నాక ఇద్దరము కలిసి దేశమంతా తిరిగాము,

అల్లాంటాలో వారి శిష్యులతో చెప్పి వారి 76వ జన్మదినోత్సవము, వారికి చివరివరకు తెలియకుండా. ఆశ్చర్యచకితులను చేశాం. అప్పుడే వారి శిష్యులు Dr A.S.Rao, prot of surgery Wylatf Hospi tal, Newyork, Prof. of Urology Anniversary & po తీసుకొని వెళ్లారు. వారిద్దరు మా బావగారిని మాకు చదువు చెప్పిన మా ప్రొఫెసర్ అని పరిచయము చేయగానే అక్కడి వారు Professor of Professors అని ఎంతో గౌరవ మర్యాదలతో ఆదరించారు. వారి అతిధ్యము, దేశము కాని దేశములో అంత గౌరవాతిథ్యం అందు కోవడమంటే మాటలా అది వారి సంస్కారమునకు ఒక మచ్చుతునక. మా అనుబంధము, అప్యాయతలకు అది మరో అనుభవము. మా పెద్దబ్బాయి డా. ఈశ్వర ప్రసాద్కు నేను, నా భార్య 2004 అమెరికాలో చాలా సుస్తీ చేసి నెఫ్రాలజీ యూనిట్ లో చేర్చారు. మా అమ్మాయికి ఈ విషయం తెలిసి తగిన విధంగా అక్కడి వైద్యుల సహాయం తీసుకుని గుంటూరు డాక్టర్లతో మాట్లాడుచున్ననూ మాకు తెలియనివ్వలేదు. ఈశ్వర ప్రసాద్కు బాగాలేదని మేము హడావిడిగా ఇండియాకు రావద్దని మా మావగారు ఫోన్ చేసి మీరు త్వరపడి రానవసరములేదని తనే వాడి విషయము చూసుకుంటానని చెప్పి, బాబును ఆసుపత్రి నుండి తన ఇంటికి తీసికొని వెళ్లి తను పూర్తిగా కోలుకునే వరకు చాల జాగ్రత్తగా చూశారు మేము వచ్చేసరికి మా అబ్బాయి పూర్తిగా కోలుకున్నాడు. మేము బాపట్ల వచ్చిన ప్రారంభములోనే విజయవాడ లయోల కాలేజి స్థాపించుట జరిగినది. ఆ కాలేజికి ఫండ్స్ సేకరించుటకు కీ. శే. ఫాదర్ బాలయ్యగారి బృందము మా ఇంటికి వస్తే, వారితోపాటు నేను వెళ్లి నా చేతనైనంత వసూలు చేసి ఇచ్చాను. అలా తిరుగుతున్న సమయంలో "మనము కూడా అలా ఎందుకు చేయకూడదని" Bapatla Education Society ని ఏర్పాటు చేయుట, మిత్రులు నన్ను ప్రెసిడెంట్గా ఎంపిక చేయుట జరిగింది. ఏ ముఖ్యదాత లేకుండా 40 పి ఊ ఊ : 1963 Bapatla Arts and Science College . మా బావగారు కూడా చాల మంది లెక్చరర్స్ను రికమండ్ చేసి పంపించారు. వారు స్వీయచరిత్రలో వ్రాసినట్లుగా ముందే బాపట్లలో స్థాపించిన కళాశాల నుండి నియమావళిని తెప్పించి దానిలో మార్పులు చేర్పులతో గుంటూరులోని జె.కె.సి కాలేజీకి నియమావళిని ఏర్పరచుకున్నారు. ఈ రకంగా వైద్యమే కాకుండా సమాజానికి అవసరమైన విద్య, సాంస్కృతిక ప్రజా సేవలతో బహుముఖ ప్రజ్ఞాశాలిగా మన్ననలు పొందిన మహా మనిషికి సమర్పించుతున్న మల్లెపూదండలో నా ఈ చిన్న పుష్పాన్ని జతపరచవలసినదిగా కోరుతున్నాను.

# ప్రజాసేవకులు డాక్టరు గారు

మోపర్తి సదాశివరావు,
తక్కెళ్లపాడు

అనత తరువు, ఆజానుబాహుడు, స్మృతభూపి, మహామనిషి, పేదల పాలిటి పెన్నిధి పంచ దాని గారు. "కష్టేఫలి" అనెడి నానుడికి అక్షర సత్యం మన డాక్టరు గారి జీవితం. అడిగిన వారికి లేదనకుంది. అడగని వారికి సైతం వారివారి కుటుంబ ఆర్థిక పరిస్థితులను తెలుసుకొని ఎంతోమందికి విద్యాదానము చేసి, వారు ఉన్నత శిఖరాలను అధిరోహించటానికి తోడ్పడిన మహా మనిషి మన డాక్టరు గారు. అందరూ ముద్దుగా పిలుచుకొనే "పెద్దాయన" అనే పిలుపుకు సార్థకతను చేకూర్చిన నిగర్వి మన డాక్టరు గారు.

రామచంద్రపాలెం గడ్డపై జన్మించి, తక్కెళ్ళపాడు గ్రామములో పెరిగి పెద్దవాడై మంచి వైద్యునిగా పేరు ప్రఖ్యాతులు గడించి, రెండు గ్రామాల పేర్లు జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో గుర్తింపు తెచ్చిన మన డాక్టరుగారి గొప్పతనానికి గ్రామ ప్రజలు సదా ఋణపడి యున్నారు.

కడు నిరుపేద కుటుంబములో జన్మించి, మేనమామ సహకారంతో వైద్యవిద్య సభ్యసిస్తూ, మరొక ప్రక్క కుటుంబ భారాన్ని మోస్తూ, దిగ్విజయంగా వైద్య వృత్తిలో పట్టాను పుచ్చుకొని, ధర్మపత్ని డా. జయప్రదాంబ గారితో కలిసి గుంటూరులో ప్రజా వైద్యశాలను ఏర్పాటుచేసి, ఎందరెందరో అభాగ్యులకు అనాధలకు ఆరోగ్యాన్ని ప్రసాదించిన కలియుగ దేవుడు.

ప్రతి పురుషుడి విజయ రహస్యం వెనుక ఓ స్త్రీ శక్తి దాగివుంటుంది అని తలపండిన వారి ఉ వాచ. అది అక్షర సత్యం. డా. జయప్రదాంబ గారు ఒక ప్రక్క కుటుంబ వ్యవహారాలను చక్కబరుస్తూ, మరొక ప్రక్క డాక్టరు గారికి చేదోడుగా వుంటూ, వారి కీర్తి ప్రతిష్టలకు పరోక్షంగా కారకులు ఆ మహాసాధ్వి డాక్టరు గారికి ధర్మపత్ని కావటం మన డాక్టరుగారి అదృష్టంగా భావించాలి.

వైద్య రంగంలోనే కాకుండా రాజకీయ, విద్యా రంగాలలో డాక్టరుగారి సేవలు చిరస్మరణీయం. బాంబుల మోతలతో దద్దరిల్లే పెదకూరపాడు నియోజక వర్గంలో శాంతికపోతాన్ని ఎగురవేసి, శాసన సభ్యులుగా విజయం సాధించి, రాజకీయ మేధావుల మన్ననలను పొందిన డాక్టరు గారి గొప్పదనం ఎంత చెప్పినా, ఇంకొంత మిగులుతుంది. జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల, రాయపాటి వెంకట రంగారావు ఇంజనీరింగ్ కళాశాల, పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలు తదితర విద్యాసంస్థల స్థాపనలోను, వాటి అభివృద్ధిలోను డాక్టరు గారి సేవలు ఎనలేనివి. భార్య జయప్రదాంబ గారి పేరుతో బాలికలకు డా జయప్రదాంబ డిగ్రీ కాలేజిని స్థాపించి, ఎంతో మంది పేద బాలికలకు కంప్యూటర్ విద్య నందిస్తున్న డాక్టరు గారి సేవా దృక్పథాన్ని ఏమని పొగడగలం.

అంతటి మహామనిషి యువతకు మార్గదర్శకులు వారి జీవితం నేటి యువతకు ఓ పెద్ద బాలశిక్ష లాంటిది. ఆ మహామనిషి మా గ్రామవాసి కావటం మాకు గర్వకారణం. అందుకే మా గ్రామములో డాక్టరు గారిని స్ఫూర్తిగా తీసుకొని మా గ్రామ యువత డా కాసరనేని సదాశివరావు నాటక కళాపరిషత్తును స్థాపించి, 2002 నుండి నేటివరకు నిరాటంకంగా, రాష్ట్ర స్థాయిలో సందేశాత్మక, ఆహ్వాన నాటిక పోటీలను 3 రోజులపాటు నిర్వహించి, ప్రజల్లో మంచి చైతన్యం తీసుకురావటానికి, మా వంతు కృషి మేము చేస్తున్నాము. ఎందరో డాక్టరు గారి అభిమానులు, శిష్యులు మా ఈ కార్యక్రమానికి సహాయ సహకారములు అందిస్తున్నారు. ప్రతి సంవత్సరము డాక్టరు గారు కొందరు పేద కళాకారులకు ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నారు.

నేడు మన డాక్టరు గారి శతజయంతి ఈ సందర్భంగా సదా మీ బాటలో నడుస్తామని మీ అంత కాకపోయిన, సముద్రములో నీటి బిందువంతైన, సమాజ సేవలో మేము భాగస్వాములము అవుతామని తెలియజేస్తున్నాను.



# వైద్యుల రాజకీయ ప్రవేశానికి ఆద్యులు
## డాక్టరు కాసరనేని సదాశివరావు

కందిమళ్ళ వెంకటరావు
సీనియర్ జర్నలిపి

గుంటూరు జిల్లాలో వైద్యులు రాజకీయాల్లో ప్రవేశానికి డాక్టర్ కాసరనేని దారి చూపారు. ఉమ్మడి గుంటూరు జిల్లాలో గతంలో తక్కువ మంది రాజకీయాల్లో ఉన్నారు. డాక్టర్ సదాశివరావు 1977లో గుంటూరు లోక్సభకు జనతా అభ్యర్థిగా, కాంగ్రెస్ అభ్యర్థి కొత్త రఘురామయ్య పైన పోటీచేసి ఓడిపోయారు అప్పట్లో ఎమర్జెన్సీని, విద్యావంతులు తీవ్రంగా వ్యతిరేకించారు డాక్టర్ సదాశివరావు ప్రజాస్వామ్య విలువలకు ప్రాధాన్యత ఇచ్చే వ్యక్తిగా సమాజంలో గుర్తింపు పొందారు. కొత్తరఘురామయ్యపైన దీటైన అభ్యర్థికోసం జనతాపార్టీ అన్వేషిస్తుండగా డాక్టర్ యలమంచిలి శివాజీ సూచనమేరకు జనతా నాయకులు సదాశివరావు గారిని సంప్రదించారు ఆయన పోటీకి అంగీకరించారు. ఉమ్మడి జిల్లాలో అప్పట్లో వైద్యులు ప్రత్యక్ష రాజకీయాల్లో పోటీ చేయటం తక్కువగా వుంది. రేపల్లెలో డాక్టర్ మైనేని సీతారామయ్య చిరకాలం మునిసిపల్ చైర్మన్ గా పని చేవారు. మైనేని రేపల్లె ఎమ్మెల్యేగా 1972లో స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయారు. డాక్టర్ కాసరనేని 1977లో జనతా అభ్యర్థిగా, 1980 లోక్ దళ్ అభ్యర్థిగా గుంటూరు లోక్సభకు పోటీచేసి కాంగ్రెస్ అభ్యర్థులు కొత్త రఘురామయ్య ఆచార్య ఎన్ జి రంగా పైన ఓటమిపాలయ్యారు. 1978లో పత్తిపాడులో జనతాఅభ్యర్థిగా అసెంబ్లీకి పోటీ చేసి ఓడిపోయారు. 1983లో లోక్ దళ్లోనే కొనసాగారు. యన్.టి.ఆర్ అధికారంలోకి వచ్చిన తరువాత లోక్దను తెలుగుదేశంలో విలీనం చేశారు. 1984 నాదెండ్ల భాస్కరరావు వెన్నుపోటు తరువాత 1985లో జరిగిన ఎన్నికల్లో డాక్టర్ సదాశివరావుకు ఎన్టిఆరణ పెదకూరపాడులో సీటు ఇచ్చారు. అక్కడ ఎమ్మెల్యే అల్లంశెట్టి విశ్వేశ్వరరావు, నాదెండ్ల వైపు ఫిరాయించటంతో టిడిపి కాసరనేనికి అవకాశం ఇచ్చింది. 1989లో కాసరనేని పెదకూరపాడులో కాంగ్రెస్ అభ్యర్థి కన్నా లక్ష్మీ నారాయణపై ఓడిపోయారు. తరువాత రాజకీయాలకు దూరంగా వున్నారు. ఆయన రెండుసార్లు లోక్సభకు, మూడుసార్లు అసెంబ్లీకి పోటీ చేశారు. గుంటూరు జిల్లాలో సదాశివరావు గారిని పరిగణనలోకి తీసుకొని అనేకమంది వైద్యులు రాజకీయాల్లోకి వచ్చారు. టిడిపిలో జిల్లాలో ఎక్కువమంది వైద్యులు చట్టసభలకు పోటీ చేశారు. సత్తెనపల్లిలో రావెల వెంకటరావు గెలుపొందారు.

టిడిపి లో డాక్టర్ ఎంఎస్ఎస్ కోటేశ్వరరావు, డాక్టర్ కోడెల శివప్రసాద్, డాక్టర్ మాకినేని పెదరత్తయ్య, డాక్టర్ శసత్యాయల అరుణ ఉమ్మడి రాష్ట్రంలో మంత్రులుగా పనిచేశారు. వీరితోపాటు డాక్టర్ యర్ల వెంకట రావు (రేపల్లె) చిలకలూరిపేట నుంచి డాక్టర్ కాజు కృష్ణమూర్తి, డాక్టర్ కందిమళ్ళ జయమ్మ, తెనాలి నుంచి డాక్టర్ రాని రవీంద్రనాథ్ చౌదరి, డాక్టర్ గోగినేని ఉమ, డాక్టర్ వీరపనేని యలమందరావు(నిసుకొండ) డాక్టర్ కోడాలి వీరయ్య (వేమూడు) వైకాపా నుంచి డాక్టర్ శ్రీనివాసరెడ్డి

(నరసరావుపేట), డాక్టర్ శ్రీదేవి (తాడికొండ), కాంగ్రెస్ నుంచి డాక్టర్ రావెల వెంకటరావు (సత్తెనపల్లి) గెలుపొందారు. డాక్టర్ అరవిందబాబు (నరసరావుపేట) డాక్టర్ నన్నపనేని సుధ (వినుకొండ), మంగళగిరి, సత్తెనపల్లి, ప్రత్తిపాటులో డాక్టర్ రాయపాటి శ్రీనివాసు ఓడిపోయారు. నరసరావుపేట ఎంపిగా డాక్టర్ అనిపెట్టి పద్మావతి 1991లో ఓడిపోయారు. గుంటూరు మేయర్ డాక్టర్ కొల్లి శారద, జడ్పి చైర్మన్ డాక్టర్ రాయపాటి శ్రీనివాస్, రాజ్యసభ సభ్యుడిగా డాక్టర్ యలమంచిలి శివాజీ, మునిసిపల్ వైరస్గా డాక్టర్ రావి రవీంద్రనాధ్ చౌదరి, డాక్టర్ రూతురాణి, సమితి అధ్యక్షుడు, మునిసిపల్ చైర్మన్లుగా డాక్టర్ పాటిబండ్ల రక్షిణామూర్తి, డాక్టర్ ముద్దన కూరిబాయి, డాక్టర్ కొడాలి రంగారావులు ఓడిపోయారు. వీరంతా రాజకీయరంగ ప్రవేశానికి సదాశివరావే కారణం. ఆయన చట్టసభలకు పోటీచేసిన తరువాత వివిధ పార్టీలు వైద్యులకు సీట్లుచ్చారు. గుంటూరు జిల్లాలో వైద్యులు రాజకీయ ప్రశానికి సదాశివరావు గారే ప్రధానకారణమని పెద్దలు చెబుతుంటారు. ఆచార్య యన్ జి రంగా స్వతంత్ర పార్టీలో వున్న సమయంలో సదాశివరావు గారు అక్కడే కొనసాగారు. రంగా కాంగ్రెస్లో చేరికను కాసరనేని వ్యతిరేకించారు ఎమర్జెన్సీ నుంచి కాసరనేని కాంగ్రెసేతర పార్టీలలో కొనసాగారు. జిల్లాలో వైద్యులు రాజకీయ ప్రవేశానికి ప్రధానకారణం డాక్టర్ సదాశివరావు.





# ఎవరీ సిద్దయ్య!

డాక్టరు జె.యస్. రామారావు
గుంటూరు

మన సారధి, మన సచివుడు
మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుడున్
మన విభుడు, గురుడు, దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

–మహాభాగవతము !

'నన్ను' డాక్టరు సదావివరావు గారికి తొలిగా పరిచయము చేసినది శ్రీ కామేపల్లి వేంకటరామయ్యగారు – డాక్టరు రత్నబాబు తండ్రి గారు. "డాక్టర్ సాబ్–వీడు మా అల్లుడు మీ దగ్గర పని నేర్చుకొంటానంటున్నాడు, కాకినాడలో చదివాడు మీ దగ్గర ఉంచు కొనండి", అన్నాడు.

ఉంచుకోవాలా?... డాక్టరుగారన్నారు.

అక్కడ పేషంటుగా ఉన్న "పెదవల్లి తాండవేశ్వర్లు– సార్ మా బావగారండీ ఈయన –

కవిత్వం కూడా వ్రాస్తాడు" అన్నాడు.

"కూర్మ, మూషికములు (మూషిక– కూర్మములు) జలబిల ప్రవేశము చేసెను" ఇది ఏ అలంకారము

దీనిని సామాన్యంగా అందరూ సమాసమనే అడుగుతారు. ఇది క్రమాలంకారమనుకొంటానండి. ఇంగ్లీషులో "Respectuvekt" అని చెప్తారు ఇంగ్లీషులో క్రమాలంకారము లేదనుకొంటానండి", అని తెలిసీ తెలియక చెప్పాను.

"కాలక్షేపానికి పని కొస్తాడులే వెంకట్రారామయ్యా నువ్వడిగినట్లే" అన్న మాటలోని శ్లేష వేంకట్రారామయ్య గారికి అర్థం కాలేదు మా తాండవేశ్వర్లుకు అర్థమైంది.

అప్పుడు డాక్టరు యం.యస్ యస్. కోటేశ్వరరావుగారు వారి దగ్గర పనిచేస్తున్నారు. వారికి డా నన్రా వెంకటేశ్వర్లుగారంటే తన దగ్గర పని చేసాడన్న గౌరవం కూడా ఉన్నది

సాయంత్రము గ.5.00 అయి వుంటుంది. ఒక రోగి "వంపుల"తో వచ్చాడు. డాక్టరు గారి అభిమాన కాంపౌండరు నాకు పరీక్ష పెట్టాడు "ఇతనికి spinal tap చేయాలండీ" చేస్తారా? అన్నాడు. ప్రయత్నస్తానన్నాను. వీరయ్య ఒక్కడే అతనిని పొజిషనులో పెట్టి పట్టుకొన్నాడు. Tap చేసాను రెండు బొట్లు 'చీము' వచ్చింది. పేషంటును ప్రక్కకు తిప్పాడు. పేషంటు చనిపోయాడు. – నాకు చెమటలు పట్టాయ్. ఇంతలో డాక్టరు గారు రానేవచ్చారు. నేను చాలా భయపడ్డాను వీరయ్య విషయం చెప్పాడు. డాక్టరు గారు కోపగించుకుంటారని నేను భయపడ్డాను.

"Tap– చేసావా? నిన్ను అభినందించాల్సిందే" అన్నారు.

డాక్టరు గారే ఎప్పుడూ పేషంట్లకు Spinal Anesthesia ఇచ్చేవారు.

ఒక సారి మా ప్రక్క గ్రామము నుండి ఒక రోగి. ఆమె భర్త అందరూ. ప్రొద్దున్నే వచ్చారు. అడ్మిట్ అయ్యారు. డాక్టరు గారు రౌండ్స్ పూర్తి అయినాయ్ ఈ లోపు నేను రెండు, మూడు సార్లు ఆ పేషంటు గదిలోకి వెళ్ళి వచ్చాను. డాక్టరు గారు కోపగించుకున్నారు." మీ ఊరి వారిని నాలుగు సార్లు వాళ్ళ గదికి వెళ్ళి వచ్చావు, ఇతర పేషంట్లు ఏమనుకొంటారు?

"లేదండి, ఆమెకు" ఎక్టోపిక్ ప్రెగ్నెన్సీ" లాగుందండి అన్నాను.

ఆ! అలానా. నాకూ ఆ అనుమానమే వచ్చింది. వీరయ్య ఎక్టోపిక్కు బద్ధం చెయ్యి – అన్నారు. పేషంటును చూచి వెంటనే ఆపరేషను చేశారు.

యం.యస్. యస్. మంగళగిరిలో ప్రాక్టీసు పెట్టారు. డాక్టరు గారికి నేనొక్కడినే అసిస్ట్ చేస్తున్నాను.

ఇంగ్వయినల్ హెర్నియా" చేస్తున్నారు. ఇంతలో డా. బసవపున్నయ్య గారు వచ్చారు. "రండి సార్ మనం బాబూసేట్ దగ్గరకు వెళ్ళాలి గదా? ఆ కాస్త సీతారామారావు చేసుకొంటాడు లెండి" అని వారిని బలవంతంగా తీసుకొని వెళ్ళారు.

ఇలా వ్రాసుకొంటూ పోతే చాలా కథ సాగుతుంది. డాక్టరు గారూ నేనూ రాత్రి గం. 12:00 అయివుంటుంది క్లబ్బు నుండి ఇంటికి వస్తున్నాము. "హాస్పటలుకు పోనిన్" అన్నారు. అందరూ కునికి పాట్లు పడుతున్నారు. శంకరరావు అనుకొంటాను– కాంపౌండరు ఒక హెర్నియా" ఆపరేషనుండాలే!. రమేష్ చేసిపోయాడు అన్నారు. "లేదండి బాబుగారింకా రాలేదు" అని శంకరావు చెప్పాడు.

“రామారావ్–రా మనిద్దరం ఈ హెర్నియా చేద్దాం అని డ్రెస్సు చేసుకొన్నారు. అప్పటికి మూడు నాలుగు సంవత్సరాలు గడచివుంటాయ్. వారు ఆపరేషను చేసి, ఆ ఆపరేషను చేసి డాక్టరు. గారు – బహుశా ఇది నా ఆఖరి సర్జరీ అనుకొంటాను" అన్నారు.

కాలం గడచిపోయింది వారికి ఫ్రాక్చర్..... కుడి తుంటి ఎముక విరిగింది. డెంగూ ఫీవర్ ఎక్కువ గా వుండేది. వారితో పాటు నాకూ ఈ డెంగూ

ఆ రోజు సాయంత్రం (ప్రతి రోజూ) వారి దగ్గరకు వెళ్ళాను. "నేను చిలకలూరి పేట వెళ్తున్నాను. "రేపు నేను రానండి" అన్నాను. "రామారావ్– నీవు సిద్దయ్య లాంటి శిష్యుడవ్" అన్నారు. నాకు వెంటనే ఈ సిద్ధయ్య ఎవరో గుర్తురాలేదు. ఐదారు నిముషాల తరువాత గుర్తు కొచ్చింది" భోరున ఏడ్చాను" డాక్టరు గారెప్పుడు శ్రీ పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వామి గారిని గురించి మాట్లాడలేదు. చెప్పలేదు. ఈ సిద్ధయ్య– దూదేకుల కులం, వీరబ్రహ్మేంద్రస్వామి వారు సమాధి చెందారు. సిద్ధయ్య– తనను సమాధిలోనికి వెళ్ళనివ్వడని మండుటెండలో ఆరుయోజనాల దూరలో వున్న చోట మల్లెపూవులు వున్నాయ్, అక్కడకువెళ్ళి ఆ మల్లెపూవులు తీసుకొనిరా! అని చెప్పారు. " యోజనం అంటే ఎనిమిది మైళ్ళనుకొంటాను, సిద్దయ్య వచ్చేటప్పటికి బ్రహ్మంగారు సమాధిలోనికి వెళ్ళిపోయారు"

"అంతగా నీవు దు:ఖించటానికి ఏముంది? నేను ఊరికే అన్నాను, నీవు పసుమర్రు వెళ్ళిరా– అన్నారు.

మరుసటి రోజు, మరలా నీకు డెంగూ మా పిల్లవాడు నాకు చాలా సేవ చేశాడు. తెల్లవారింది". జయశంకర్ "ఫోను" డాక్టరు గారు లేరని". అదే స్థిత ప్రజ్ఞత.

# తోడు – నీడ

జొన్నలగడ్డ రామారావు

అమెరికా కనుగొని తిరిగి వచ్చిన కొలంబస్ గౌరవార్ధము స్పెయిన్ మహా రాజు గొప్పవిందు ఏర్పాటు చేశాడు. ఆహూతులలో కొందరు తమ అసూయా ద్వేషములను, కొంటెమాటలతో వెలిబుచ్చగా కొలంబస్ విని ఎవరైనా కోడిగ్రుడ్డును బల్లపై నిలబెట్టగలరా యని అడిగిను వారికి చేతకాదనిది. కొలంబస్ ఒక గ్రుడ్డుకు చిన్న సొట్టపడేటట్లు కొట్టి నిలిపి చూపెను

నాటినుండి నేటివరకు క్రొత్తపుంతలు త్రొక్కే వాళ్ళకు మడమలు త్రొక్కే వాళ్ళ ముందుకు నెట్టి మడమలు త్రిప్పేవాళ్ళ బెడద వుంటూనేవుంది. అడుగుజాడలలో నడిచేవారికి అనుసరించి అతికేవారికి మార్గదర్శకులు పడిన కష్ట సష్టములు, చూపిన ధైర్య సాహసములు, విజ్ఞాన, జ్ఞానముల వైశాల్యము అర్థము కానందున అనర్థములు, వడ్డించిన విస్తరిముందు కూర్చోనటానికి పెనుగులాటలో తమ చొరవ సామర్థ్యమునకు మురుసికోనేవారు విస్తరలో ఎవరు ఎంత కష్టించి పెట్టారో ఆలోచించలేరు.

ఉన్నతమైన విద్యలు పొందిన సహచరులు ఉపాధ్యాయులుగా, ఉద్యోగులు రూపొందే సమయములో స్వచ్ఛంచ వృత్తిలో ప్రవేశించి క్రొత్తపుంత త్రొక్కారు డాక్టరు సదాశివరావుగారు. ఎల్లోపతీ వైద్య విస్తరణలో ఉత్తమ స్థానము పొందారు. విద్య పూర్తి చేసికొని వృత్తిలో ప్రవేశించేవారికి శిక్షణ ఇచ్చి వైద్యాలయములు ప్రారంభించటములో ప్రథమ స్థానము పొందారు. దక్షిణ ఇచ్చి వైద్యాలయములు ప్రారంభించటములో ప్రథమస్థానము పొందారు. దక్షిణ కోరని గురువు రోగులు మధ్యవర్తుల ద్వారా. రావలసిన అవసరాన్ని దళారీల ద్వారా పిలుపించుకొనే ఆనవాయితీని అరికట్టారు రోగపీడితునకు దళారీలు, వైద్యుడు చీడ కాకూడదేనే పట్టుదల క్రొత్త హైస్కూలు, కాలేజీ, ఇంజనీరింగు కాలేజీ అవరమును గుర్తించిన ప్రథముడు, స్థాపనకు బాధ్యుడు నిర్వహణలో దక్షుడు.

జయాపజయముతో నిమిత్తము లేకుండా ఆదర్శము కోసము రాజకీయ యుద్ధరంగములో నిలిచినివాడు.

పదవీలోలుడైన అంతేవాసి వర్గోన్మాదులకు కొరముట్టుకాగా మౌనముగా పోరువీడిన నాగరికుడు. మూర్ఖునకు మొగమోటము లేదుగదా! డాక్టరు సదాశివరావువర్తమాన సమాజమునకు మకుటము వర్ధమాన సమాజమునకు ఆదర్శము. స్నేహితులలోని మంచికి గుర్తింపు – చెడుకు మరపు, ఆలోచన కలవారికి తోడు–లేని వారికి నీడ.

# శకపురుషుడు – సదాశివుడు

**కట్టా వలరాజు**, M.A, LLB.
అడ్వకేట్
Ex: G.D.C, బ్యాంక్ మేనేజర్, లీగల్ ఆఫీసర్

మంచితనం మానవత్వం మూర్తీభవించిన మహనీయుడు. నిండైన విగ్రహం తెలుగుదనానికి నిలువెత్తు సంతకం. వైద్యవృత్తికే వన్నెతెచ్చిన వైద్య శిఖామణి. ఈ శతాబ్దపు మహామనిషి స్వర్గీయ డాక్టర్ కాసరనేని సదాశివరావు గారు.

డాక్టర్ గారి 100 సంవత్సరాల వేడుకలు మహనీయులకు మరణం లేదు. వారు సదా చిరస్మరణీయులు. ప్రజల హృదయాలలో వారికి స్థానం పదిలం అనే నానుడికి డాక్టర్ గారే నిదర్శనం.

డాక్టర్ గారు ఆ తరం వైద్యుల నుండి ఈ తరం వైద్యుల వరకు ఆరాధ్య దైవము, మార్గదర్శకుడు. ఆయన వద్దకు వచ్చిన రోగికి ఎంతటి వ్యాధైనా ఇట్టే నయమయ్యేది. ఆయన హస్తవాసి అలాంటిది. రోగులు పట్ల వారి, సహాయకుల పట్ల ఆయన చూపించిన ప్రేమ, అభిమానము, ఆర్థిక సహాయానికి ప్రతిగా ఆయన జిల్లాలోని గాక రాష్ట్రంలోనే ప్రజా వైద్యుడిగా వైద్యునిగా పేరుగాయించారు. అందుకని ఆయన వైద్యశాల పేరు ప్రజా వైద్యశాల అని పెట్టారు.

గుంటూరు జిల్లాలోనే గాక రాష్ట్రంలోని అత్యధిక వైద్యశాలలో ఆయన తో మాత్రమే ప్రారంభించుకోవటం వారి గొప్పతనానికి తార్కాణం. వైద్యరంగంలోనే కాకుండా విద్యా రంగానికి ఆయన చేసిన మేలు ఎనలేనివి నాగార్జున ఎడ్యుకేషన్ నిర్మాణము జేకేసి కాలేజీలో ఆయన చేసిన సేవలు బరస్మరణీయం.

సదాశివరావు గారు 1970లో నేను జెకెసి కాలేజీలో డాక్టర్ గారి నన్ను ఇంటర్ లో చేర్చారు. గుంటూరు జిల్లా, ఈపూరు మండలం, అంగులూరు గ్రామం మునసబు గార్రైన మా నాన్న కట్టా పేరయ్య గారు, డాక్టర్ గారు సన్నిహితులే. గాక ఆచార్య రంగా గారికి అత్యంతహితులు. J.K.C లో నా ప్రవేశము ఇంటర్ డిగ్రీ విద్యాభ్యాసం J.K.C హాస్టల్ నుండి సదాశివరావు గారి ఆశీస్సులతో చదువుకొని ఆయన ఆశయాలను ఆదర్శంగా తీసుకొని 35 సంవత్సరాలు G.D.C.C బ్యాంకులో మేనేజర్ లీగల్. ఆఫీసర్ గా నోడల్ ఆఫీస్ గా జిల్లా G.D.C.C లు ఉద్యోగులు సంఘ అధ్యక్షుడిగా G.D.C.C బ్యాంకులో డైరెక్టర్ గా టిడిపి డిస్ట్రిక్ట్ వైస్ ప్రెసిడెంట్ గా రైతులకు సేవ చేయుటకు జిల్లాలో గుర్తింపు పొందిన వ్యక్తిగా నన్ను తీర్చిదిద్దన మహనీయుడు ఆ మహనీయునికి శకపురుషునికి నా అశ్రునివాళులు.

ఈ సందర్భంగా డాక్టర్ గారితో పాటు నా ఉన్నతికి సహకరించిన మా గురువుగార పాతూరు కోటేశ్వరరావు గారికి నా కృతజ్ఞతలు.

డాక్టర్ గారు రాజకీయ రంగంలో కూడా గొప్ప వ్యక్తి 1985 లో N.T.R పిలుపుమేరకు అనూహ్యంగా పెదకూరపాడు ఎమ్మెల్యేగా గెలిచి ప్రజా సేవకుడుగా వన్నెకెక్కాడు N.T.R గారికి అత్యంత ఆత్మీయుడు డాక్టర్ గారు 1994లో అన్నగారి వివాహాన్ని మొహమాటం లేకుండా మీరు చేసినది తప్పు అని N.T.Rఎదురుగానే చెప్పిన ధీశాలి డాక్టర్ గారు. డాక్టర్ గారు ఎమ్మెల్యేగా ఉన్నప్పుడు మల్లాది శివన్నారాయణ నన్ను డాక్టర్ గారికి పరిచయం చేయబోగా వారి పేరు వలరాజు తండ్రి పేరు పేరయ్య వాళ్ళ తాత పేరు సుబ్బయ్య అని చెప్పగా శివన్నారాయణ గారు ఆశ్చర్యపోయాడు. అది ఆయన జ్ఞాపకం శక్తికి అభిమానానికి నిదర్శనము.

విద్యా, వైద్య, రాజకీయం సామాజిక సేవ రంగాలలో వైద్యునిగా విద్య దాతగా సామాజిక సేవతత్పరునిగా ప్రజానాయకుడిగా, రాజకీయ నాయకుడిగా విశిష్ట సేవలందించిన డాక్టర్ కాసరనేని చరితార్థుడు, చరిత్రకారుడు. నాకూ మా గురువు గారైన పాతూరి కోటేశ్వరావు గారి లాంటి ఎందరో మహానుభావులకు ఆయన "గాడ్ ఫాదర్".



# ప్రజల మనిషి డాక్టర్ కాసరనేని సదాశివరావు

ఆలోకం పెద్దబ్బాయి, గుంటూరు

1976లో గుంటూరు పట్నంబజార్ నుంచి వ్యాపార లావాదేవీలు నిర్వహించే తరుణంలో చెల్మి కాటన్ కు చెందిన శ్రీ జొన్నలగడ్డ రామారావుగారి ద్వారా డా కాసరనేని సదాశివరావుగారితో నాకు పరిచయ భాగ్యం కలిగింది. మూర్తిభవించిన మానవత్వంతో అప్పటికే ఆయన గుంటూరులో ప్రముఖ వైద్యులుగా ఖ్యాతి గడించి యున్నారు. అప్పటి నుండి ప్రతి రోజు సాయంత్రము డాక్ సదాశివరావు గారి హాస్పిటల్ కి వెళ్లి వారితో కొంత సమయం గడిపి ముచ్చటిస్తూ వారి మాటలన్న సందేశాలను గ్రహించి గౌరవించడం దినచర్యగా అలవాటు చేసుకున్నాను. డాక్టర్ సదాశివరావు గారు శ్రీ కొల్లా శ్రీకృష్ణారావు గారి ద్వారా తరచుగా నిర్వహించే సాహితీ సదస్సులకు నేను హాజరు. అవుతూ ఎంతోమంది కవుల గురించి, వారి సాహిత్యం గురించి తెలుసుకోవడం జరిగింది. డాక్టర్ గారితో నాకున్న పరిచయం చనువుగా మారి డాక్టర్ గారి ఇంటికి వెళ్లి ఇష్టా గోష్టి కార్యక్రమాలలో పాల్గొనడం అనేది నిజంగా నా అదృష్టంగా ఇప్పటికీ భావిస్తాను. ఎందుకంటే డాక్టర్ సదాశివరావు గారి కంటే నేను 20 సంవత్సరాలు చిన్నవాడిని. డాక్టర్ సదాశివరావు గారితో పరిచయం ఉన్న ప్రతి ఒక్కరూ డాక్టర్ గారికి నేనే అత్యంత ఆత్మీయున్ని అనుకునేవాళ్లు. డాక్టర్ గారి ఆప్యాయత అంతా ఘాడంగా, అంత మనస్సుకు హత్తుకునేలా ఉండేది.

1984లో భావసారూప్యత కలిగిన శ్రీ జొన్నలగడ్డ రామారావు మరి కొంత మంది మిత్రులను కలిసి డాక్టర్ సదాశివరావు గారి షష్టిపూర్తి మహోత్సవము ఘనంగా నిర్వహించి డాక్టర్ గారి జీవిత విశేషాలతో, ప్రముఖుల వ్యాసాలతో సావనీరు కూడా ప్రచురించడం జరిగింది. 1987లో నేను, శ్రీ పాతూరి కోటేశ్వరరావు, శ్రీ జొన్నలగడ్డ రామారావు, శ్రీ రావెల సాంబశివరావు, శ్రీ కోటపాటి మురహరిరావు గారు మరి కొంతమంది మిత్రులు కలిసి డాక్టర్ సదాశివరావు గారి అధ్యక్షతన గుంటూరులో కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి గారి శతజయంతి ఉత్సవాలను ఎంతో ఘనంగా నిర్వహించడం జరిగింది. 2002లో నేను, శ్రీ రావెల సాంబశివరావు, శ్రీ వికాస్ శంకరరావు తదితురుల కలిసి డాక్టర్ గారి సతీమణి పేరుతో ఏర్పాటు చేస్తున్న డాక్టర్ కాసరనేని జయప్రదాంబ మహిళ డిగ్రీ కళాశాల భవనాల నిర్మాణాలను దగ్గరుండి పూర్తి చేయించడమే కాక ఆ కాలేజీ కమిటీ మెంబర్ గా, కాలేజీ ట్రస్ట్ బోర్డ్ మెంబర్ గా నేను సేవలు అందించడం నా అదృష్టం.

మట్టి నుండి మెతుకుని పండించే రైతులన్నా గ్రామీణ ప్రాంత ప్రజలన్నా, పట్టణ ప్రాంత కార్మికులన్నా విపరీతంగా అభిమానించే డాక్టర్ సదాశివరావు గారు ఎంతోమంది పేద ప్రజలకు, పేర విద్యార్థులకు ఉచిత వైద్య సేవలు, ఉచిత మందులు పంపిణీయే కాకుండా ఆర్థిక సహాయాన్ని కూడా ఎంతోమందికి అందించేవారు మానవతావాది, మహామనిషి విద్యాదాత, వైద్య ప్రదాత డాక్టర్ కాసరనేని సదాశివరావు గారి మధురస్మృతులను సదాస్మరిస్తూ వారి అడుగుజాడల్లో నడవడానికి నిరంతరము ప్రయత్నిస్తూ నమస్సులతో.





# సహృదయానికి నిలువెత్తు నిదర్శనం

తొళ్లూరి లక్ష్మీ ప్రసన్న
విశ్రాంత అధ్యాపకురాలు

డాక్టర్ గారిని నేను మొదటిసారి ప్రత్యక్షంగా చూసింది గుంటూరులోని జేకేసి కళాశాలలో నేను ఉద్యోగార్థినై ఇంటర్వ్యూకి వచ్చినప్పుడు. అప్పటివరకు వారిని గురించి వినటం మాత్రమే మా నాన్న మాకు తన మేనమామను గురించి చెప్తూ ఉండేవారు.

కాలేజీలో ఉద్యోగం వచ్చిన తర్వాత చదువు ఆపవద్దని చెప్పారు నేను M.A. చేశాను. వెంటనే Ph.D కూడా చేయమని చూచించారు పూర్తి చేశాను. ఇలా నేను డాక్టర్ లక్ష్మీప్రసన్న అనిపించు కోవటానికి మూల కారణం వీరే. చదువంటే, చదువుకునే వారంటే వీరికి చాలా ఇష్టం.

సాహిత్యం పట్ల మక్కువతో వీరు అందుకు సంబంధించి ప్రశ్నలు వేస్తూ ఎదుటివారి జ్ఞానాన్ని పరీక్షించేవారు. ఏ పద్య పాదమో, సంఘటననో, హఠాత్తుగా అడిగేవారు. తెలియని విషయం లేదు వీరికి, ఆంధ్ర ప్రాంతంలోని ఏదైనా కళాశాల పేరు చెప్పగానే అది వాళ్ళు ఏర్పాటు చేశారు, అంటూ పుట్టుపూర్వోత్తరాలు తెలియచెప్పేవారు. డాక్టర్ గారితో సంభాషణ విజ్ఞానాన్ని పెంపొందించుకోవటమే.

నేను డాక్టర్ గారి దగ్గరకు అప్పుడప్పుడు వెళ్ళేదాన్ని ఆ సమయంలో దగ్గర ఉన్న వారందరినీ పరిచయం చేసేవారు. బంధువులు అయితే నాకు తెలియదు కనుక బంధుత్వాన్ని వివరించేవారు.

వీరికి ఇష్టము మా బంధువులు. వైద్యం కోసం వెళ్లేవారు కదా! వాళ్ళందరూ డాక్టర్ గారిని ఎంతో పొగిడేవారు. ఒక మామగారు తన అల్లుని వైద్యం కోసం తీసుకువెళ్లారు. ఏమడిగినా మామగారి సమాధానం చెప్పేవారు. చూచిచూచి నవ్వుతూ ఈ జంతువు ని ఎక్కడ పట్టుకొచ్చారు అన్నారట. వాళ్ళు ఎన్నో రోజులు ఈ సంఘటనను చెప్పుకునే వాళ్ళు.

డాక్టర్ గారు ప్రజా వైద్యశాల స్థాపించి ఎందరికో వైద్య సేవలు అందించారు. బంధువులుగా మాకు ఉచితం. విద్యార్థులకు కూడా అంతే అసలు వీరి లక్ష్యము రోగం నయం చేయటమే వైద్యుని కర్తవ్యం అని, ఎవరిని నిక్కచ్చిగా అడిగి ఫీజును తీసుకోలేదు. నాజర్ వంటి ప్రముఖులు కూడా అట్టి వైద్యం పొందిన వారే. తాను ఎంత మేలు చేసినా, తిరిగి ఏమీ ఆశించని వ్యక్తి. మేము ఇచ్చిన కూరగాయలు చూసి ఎంతో ఆనందపడేవారు. తమ బాల్యాన్ని గుర్తు తెచ్చుకొని ఆ విషయాలు మాకు తెలియజేసే వారు.

పంక్తిలో భోజనం వీరికి పరిపాటి. భోజన సమయం కాగానే తాను లేస్తూ అందరినీ భోజనానికి తీసుకెళతారు. వారితో పరిచయం ఉన్న ప్రతి వారికి ఈ విషయం తెలుసు. వీరు భోజనం ప్రియులు. అంటే తెగ తింటారు అని కాదు. ఏ పదార్థం ఎలా వండితే బాగుంటుందో బాగా తెలుసు సోదరి అనసూయమ్మ గారితో మేము ఏ సొరకాయ, వంకాయలవంటివి తీసుకు వెళ్లినప్పుడు ఎలా పండించాలో చెప్పేవారు.

సాహితీసదస్సులు నిర్వహించారు. చదువుకున్నాను కదా ఏదైనావ్రాయి అని ప్రోత్సహించేవారు. అలా ఒకసారి నేను ఆ సదస్సులో మాట్లాడాను. కానీ వారు ఆశించినట్టు నేను ఆ రంగంలో ముందుకు సాగలేదు. డాక్టర్ గారి ప్రోత్సాహంతో ఏవో 1, 2 వ్యాసాలు రాశాను.

డాక్టర్ గారి బంధుప్రీతి ఎక్కువ. మా నాన్నగారు మా అక్క చెల్లెలు చదువు ఉద్యోగాలు, పెళ్లిళ్లు అన్ని విషయాల్లోనూ డాక్టర్ గారి సలహాతో ముందుకు నడిచారు. అసలు మా నాన్నగారు జీవితంలో స్థిరపడటానికి కారణమే వీరు.

మా చిన్నబ్బాయికి డాక్టర్ గారు అంటే మరింత ఇష్టం, ఎంతో చనువుగా మాట్లాడేవాడు. వాడు ఇప్పుడు అనుకుంటూ నేను ఇంకా చిన్నవాడిగా ఉన్నప్పటి నుండి తాతయ్యతో మాట్లాడుతూ ఉ ండే బాగుండేది ఆ అవకాశం పోయిందే అని మరీ మరీ తలుచుకుంటాడు. ఆయన పిల్లలతో పిల్లవాడిగా కలిసిపోయి వాళ్లకు కావలసిన విషయాలు చెప్పేవారు. ఆసక్తి పెంచేవారు.ఉదార స్వభావం గలవారు. ఒకసారి ఒక రైతు వచ్చి డాక్టర్ గారితో కాసేపు మాట్లాడి వెళ్లిపోయాడు. తర్వాత చెప్పారు పెదకూరపాడు నుండి ఆ రైతు వచ్చాడని "పురిటి వాసన" నేను M.LA గా ఆ ప్రాంతంలో రైతుల కోసం నీటికి ఇబ్బంది లేకుండా కొన్ని పనులు చేయించాను. వీళు గుంటూరు వచ్చినప్పుడు కలిసి వెళుతూ ఉంటారు. అని హాస్పిటల్ కి వెళ్లకపోయినా ఎందరో డాక్టర్ గారి పై నమ్మకంతో ఇంటికి వచ్చి వైద్యం చేయించుకునేవారు, సలహాలు తీసుకునేవారు.

వీరి హస్తవాసి మంచిదని ఎన్నో ఆసుపత్రులను ప్రారంభించమని కోరి తీసుకు వెళ్లేవాళ్లు అవి 500 పైగా ఉండవచ్చు మా అబ్బాయి అఫోటోలను ఆసక్తిగా చూస్తూ ఉంటే కొన్నిటిని తీసుకు వెళ్ళమని ఇచ్చారు అవి మాకు తీయని జ్ఞాపకాలు.

ఒకసారి డాక్టర్ గారి ఇంటికి వెళ్ళాము కొంచెం నలతగా ఉండటంతో వారు మాట్లాడలేదు. ఒక నెల రోజులు దాటిన తర్వాత డాక్టర్ గారు. నేను మొన్న వాళ్లతో మాట్లాడలేదు ఒకసారి రమ్మని ఫోన్ చేయమన్నారట. అంతలో మేము వెళ్ళాము మాపై డాక్టర్ గారికి ఉన్న అప్యాయత అది.

మరొక విషయం. డాక్టర్ గారు ఒకసారి భారతం అంతా చదివాను కానీ శాంతి పర్వం చదవలేదని అంటే కొద్ది రోజులు వారికి చదివి వినిపించే భాగ్యం లభించింది. అది గొప్ప అదృష్టం.

రాజకీయాలైనా, పదవులైనా అవసరాన్ని బట్టి స్వీకరించటం వదిలేయటం వారికే సాధ్యమైంది. నాకు వారు గొప్ప కర్మయోగిగా అనిపిస్తారు. వాళ్ల కుటుంబంతో నాకు స్థానం కల్పించారు వారి ఆత్మీయతను పొందగలగటం నాకెంతో గొప్ప మర్రి చెట్టు ఎందరికో ఆశ్రయం కల్పిస్తుంది. కానీ ఆ నీడలో మరో మొక్క ఎదగదంటారు. కానీ డాక్టర్ గారు అందరికీ చేయూతనిచ్చి వారి అభివృద్ధికి తోడ్పడ్డారు డాక్టర్ గారి స్మృతులు మాకు మదిలో పదిలం.



# బంధుప్రీతి అధికం

తాళ్లూరి సుబ్బారావు

డాక్టర్ గారు మాకు మేనమామ. మా పెదనాన్న కీ.శే. పిన్నమనేని సూరయ్య గారు డాక్టర్ గారికి మేనమామ. మా పెద్దమ్మ వీరికి మేనమామ భార్య, అక్క కూతురు. మేము చిన్నప్పుడు మా పెదనాన్న దగ్గర తక్కెళ్ళపాడు లో ఉండే వాళ్ళము. మేము సూరయ్య గారి మరదలి సంతానము 5గురుము మా పెద్దన్నయ్య తక్కెళ్ళపాడులో ఉండేవారు. మా పెదనాన్న తర్వాత మేము కొలకలూరి. వెళ్లిపోయాము. మాకు పెద్దదిక్కు మా మేనమామే. అన్నాదమ్ముల్లో నేనే ఉద్యోగస్తుడిని. నేను పూజం% గా శ్రీ కాసు శాయమ్మ మున్సిపల్ హైస్కూల్లో పనిచేశాను. మాకు వెన్ను దన్ను మా మామయ్యే నేను ఉద్యోగంలో చేరిన 2,3 సంవత్సరాలు తర్వాత సరిగా జీతాలు ఇవ్వక పోవడంతో ఇబ్బందులు ఎదుర్కొన్నాము. ఆ సమయంలో మా మామయ్య నన్ను పిలిపించి, వివరాలడిగి సలహాలు ఇచ్చారు. కొద్ది కాలంలోనే ఆ స్కూలును మునిసిపాలిటీ వారు స్వాధీనంలోనికి తీసుకున్నారు. నేను గుంటూరులోనే ఉద్యోగం కనుక వీలున్నప్పుడల్లా డాక్టర్ గారిని కలిసి వెళ్లేవాడిని. మా పెద్దమ్మ మా అన్నదమ్ముల విషయం మామయ్యతో చెప్తూ ఆయన సలహా అనుసరించి నడిచేది.

మాకు గారపాడుతో ఎక్కువ బంధుత్వం ఉంది. డాక్టర్ గారి తమ్ముడు శ్రీ మురహరి గారు, సోదరి అనసూయమ్మతో మాకు మరింత సన్నిహిత్యము. వస్తూపోతూ ఉండేవాళ్లం చదువులో పెళ్లికు ఆరోగ్య సమస్యలు ఏవైనా సరే వారి సలహా తీసుకునే వాళ్ళము. మేము జీవితంలో స్థిరపడటానికి ప్రధాన కారణం మా మామయ్యే మా పిల్లల చదువులు ఉద్యోగాలు, వివాహాల విషయంలో కూడా వారే మాకు మార్గ నిర్దేశకులు. మా కుటుంబానికి మూల స్తంభం మా మామయ్యే.

నిజాన్ని మెగమోడమి లేకుండా సూటిగా చెప్తారు. ఎదుటి వాళ్ళు అవసరాన్ని బట్టి సాయం చేస్తారు. ఆదుకుంటారు. వారి స్థితి గతులను బట్టి సలహా ఇస్తారు. ఇతరుల విషయంలో కాదు ఇంట్లో విషయమైనా అంతే వియ్యాల వారికి కూడా తమ దినచర్య చెప్పారు. డాక్టర్ గారితో బాంధవ్యమే మాకు ప్రధానమని భావించిన వారే వారి వియ్యాల వారందరు.

వారి పేరు మాకు గొప్ప వరం. వారి అండ మాకు పెద్ద నిధి. తెనాలిలో డాక్టర్ పాడిపండ్ల దక్షిణామూర్తి గారు మాకు ఫీజు తీసుకోరు. మేము సదాశివరావు గారి బంధువులం. వారు డాక్టర్ గారి శిష్యులు. అలాగే డాక్టర్ బ్రహ్మాజీ రావు గారు, గుంటూరు పరిస రాలలోనే కాదు. డాక్టర్ గారు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ కే పరిచితులు. మా అబ్బాయి నిజామాబాదులో ఉద్యోగం చేశాడు. అక్కడ డాక్టర్ రామ మోహన్ రావు గారు మేము డాక్టర్ గారి బంధువుల అని తెలుసుకొని మాకు ఆత్మీయులైనారు. తాము డాక్టరు గారి శిష్యుడనని చెప్పారు. డాక్టర్ గారితో బాంధవ్యం మాకు ఎంత గొప్పతనాన్ని తెచ్చి పెట్టింది.

మా ఉన్నతికి జీవన గమనానికి మార్గదర్శికులు స్ఫూర్తి ప్రదాతలు డాక్టర్ గారే మామయ్య ఏ డాక్టర్ గారు మా మనసుల్లో ఎప్పుడూ మెదులుతూనే ఉంటారు.

వృత్తిపరంగా ఆయన ఎందరికో గురువు మార్గదర్శి కేవలం డబ్బు సంపాదించడమే పరమావధిగా ఆయన వృత్తిని నిర్వహించలేదు. ఆయనకు అది సంఘసేవ ధనం సాహితాభిమాని కళా ప్రియుడు అలంకారం కోసం కాదు స్వభావం అటువంటి వాడు రాజకీయాలలో తగినంతగా రాణించకపోవడం తెలుగు ప్రజల స్వయం కృతభిరాధం. పదవులు సంపాదించడమే రాణించటం నమస్కారం తృప్తిగా జీవిస్తారు లోకం వారి మంచి పొందుతుంది డాక్టర్ గారిని కొన్ని తరాలు గుర్తుంచుకుంటారు అంతరించిపోయిన ఒక తరానికి డాక్టర్ గారు ఒక ప్రతీక నిబద్ధత నిరాడంబరత్వం మూర్తిభవించిన వ్యక్తి వైద్యం కావచ్చు రాజకీయం కావచ్చు మైత్రికి నిజాయితీకి విలువనిచ్చిన వ్యక్తి ఆయన స్నేహానికి వాడు బేధం లేదు తనకంటే ఒక తరం చిన్న వాళ్ల మైన మాలాంటి వారితో ఏ రకమైన పట్టింపు లేకుండా కలిసి పోయే లక్షణము ఆయన ఆస్తి తద్వారా ఆయన సంపాదించుకున్న మిత్ర సంపద అపారం.



# అందరి మనసులను చూరగొన్న మా గురువు

డాక్టర్ సూర్యదేవర హనుమంతరావు.

డాక్టర్ సదాశివరావు గారు చాలా గొప్ప ప్రజ్ఞా దురంధరులు. వారు మాట్లాడే ప్రతి విషయము. మనకు విజ్ఞాన దాయకముగానూ, మనకు జీవితంలో అనేక సందర్భాలలో ఉపయోగపడే రీతిగానూ ఉంటుంది. నా అనుభవంలో, వారితో నాకు జరిగిన సంభాషణలలో కొన్నింటికి ఉదాహరించదలిచాను. ఇవి భావితరాలవారికి, ఉపయుక్తముగా ఉంటాదని నా భావన.

నేను వారి దగ్గరకు ఒకసారి వెళ్ళినప్పుడు వారు సర్జరీ చేయుటకు థియేటర్ కు వెళ్ళుచున్నారు. వారు నన్ను కూడా వారితో తీసుకొని వెళ్లి నన్ను అసిస్టెంట్ చేయమని అడిగారు వారు సర్జరీ చేస్తూ అన్ని స్టెప్స్ కూలంకుషంగా వివరిస్తూ చెప్పారు. నాకు అది నా జీవితాంతం గుర్తుండిపోయింది. చివరిలో వారు నాకు ఒక విషయం చెప్పారు. "నేను నిన్ను" ఎందుకు అలా తీసుకొని వెళ్ళాను అంటే అని ఒక విషయం చెప్పారు. మన అందరము గ్రామీణ ప్రాంతాల నుండి వచ్చిన వారం రైతు కుటుంబాల వారము మన గ్రామాలలో మన రైతులు ఎవరైనా బంధువులు వారి ఇంటికి వచ్చిన యెడల, వారు పొలం వెళ్లే సమయంలో బంధువులు వారి ఇంటికి వచ్చిన వారు అందరూ కలిసి పొలం వెళ్లి వారు చేయు పనులలో కలిమిడిగా చేసుకునే వారు. అలాగే మనము వైద్యంలో ఉ న్నాము. "నేను థియేటర్ వెళ్లేటప్పుడు నీవు నన్ను చూడటానికి వచ్చినందువలన నేను చేసే పనిలో మనమిద్దరం కలిసి పని చేయాలని తలంపుతో నిన్ను తీసుకుని వెళ్లాను" అని చెప్పారు. ఎంత గొప్ప విషయమో వారు ఎంత గొప్ప వ్యక్తితో వారి ఆలోచన ఎలా ఉంటుందో చూడండి. ఈ విధముగా విషయము రాస్తే కొంతమంది అయినా ఇలా ఆచరిస్తే బాగుంటుందని నా అభిప్రాయం. అందుకని ఈ విషయం ప్రత్యేకంగా ఉదాహరించుచున్నాను. నానాటికి విలువలు దిగజారి పోతున్నాయి. ఈరోజుల్లో ఇలాంటి విషయాలు భావితరాల వారికి మంచిదని నా అభిప్రాయం. మరొక సందర్భంలో ఎవరైనా కొత్త వ్యక్తి తటస్థపడినప్పుడు గాని, పేషెంట్స్, అటెండర్స్ తో గాని, మాట్లాడే సందర్భంలో మీరు ఎక్కడి నుండి వచ్చారు అని అడిగి, వారు చెప్పే ఊరిలో గాని ఆ చుట్టుపక్కల ఊర్లో గాని వారికి మనకు తెలిసిన కొన్ని పేర్లు చెప్పేవారు. అలా చెబితే వారు చాలా సంతోషిస్తారు కొద్ది సమయంలోనే వారు ఆత్మీయులుగా మారతారు. ఈ విషయాలను నేను ఇప్పటికీ ఆచరిస్తూ ఉన్నాను వారు చెప్పినట్టే నాకు అభిమానులుగా మిగిలిపోయారు. ఇలా వారు మాట్లాడే ప్రతి మాట మనకు ఎంతో విలువలతో కూడి విజ్ఞాన దాయకంగా ఉండాలి. వారి దగ్గరకు ఎప్పుడు వెళ్ళినా హనుమంతరావు వంటగదిలోకి వెళ్లి రెండు గార్లె తిని రా, అని ఆప్యాయంగానే అనేవారు అంత ఆప్యాయత గల గొప్ప వ్యక్తిని మనము ఎలా మర్చిపోగలము. నేను పీపుల్స్ క్లినిక్ లో ఉన్నప్పుడు నెల నెలా అద్దె తీసుకుని ఇవ్వటానికి వెళ్లేవాడిని. ఏంటయ్యా లక్ష రూపాయలు జేబులో పెట్టుకుని వచ్చావు క్రితం రోజులలో లక్ష రూపాయలు బస్తాలో తెచ్చేవారు అని హాస్యంగా అనేవారు. వారు అప్పుడప్పుడు ఎవరైనా పేషంట్ కొరకు ఫోన్ చేసి నేను డబ్బు తగ్గించమని అడగటానికి ఫోన్ చేయలేదు ఇతను ఎవరి చేతిలోనూ

మోసపోకుండా చూసి పెట్టు అని చెప్పేవారు తర్వాత మరొక సందర్భంలో ఏమయ్యా నన్ను ఎవరైనా గుర్తుంచుకుంటున్నారా! అని అడిగేవారు. అప్పుడు అదేంటి సార్ మిమ్మల్ని మరిచిపోవటం అనే ప్రశ్న ఉదయించదు. ఇక్కడికి వచ్చే వాళ్ళు ఎక్కువమంది మూడు తరాల నుండి ఇక్కడకు వస్తున్నారు. నేను ఇక్కడే పుట్టాను. మా నాన్నగారు, మా తాతగారు. ఇక్కడికే డాక్టర్ గారి దగ్గరికి వచ్చే వాళ్ళము అని చెబుతున్నారని చెప్పగా అది విని చాలా సంతోషపడేవారు. వారు ప్రాక్టీస్ చేసే సమయాలలో చాలా Record భద్రంగా Perfect maintain చేసేవారు. నేను అక్కడ పీపుల్స్ క్లినిక్ లో ఉన్నప్పుడు చాలామంది కొరకు వచ్చేవారు. నేను పాత రికార్డ్స్ భద్రపరిచినవి రిఫర్ చేసి వారికి కావలసిన సర్టిఫికెట్ రాసి ఇచ్చేవాడిని. నేను పీపుల్స్ ట్రామా పని చేయటం నా అదృష్టంగా భావించేవాడిని. ఎందుకంటే నేను డాక్టర్ జయప్రదాంబ గారు లాంటి గొప్ప డాక్టరు గారు కూర్చున్న కుర్చీల్లో కూర్చోవడం నా పూర్వజన్మ సుకృతంగా భావించి, ప్రతిరోజు అక్కడ కూర్చునే సమయంలో ఆ సీటుకు నమస్కరించి కూర్చునేవాడిని. వారు నాగార్జున ఎడ్యుకేషన్ సొసైటీ మేనేజ్మెంట్ లో ఉన్నప్పుడు క్లాసెస్ టీచింగ్ జరిగే సందర్భంలో క్లాసులో స్టూడెంట్స్ తో పాటు కూర్చునేవారు. అది చూసి ప్రస్తుతము శ్రీ పాటిబండ్ల సీతారామయ్య హైస్కూల్లో నేను కూడా కమిటీలో ఉన్నందువలన టీచర్స్ క్లాసెస్ చెప్పే సందర్భంలో నేను కూడా స్టూడెంట్ తో కూర్చొని వాళ్ళు ఎలా చెబుతున్నారు విని టీచర్స్ కు తగిన సలహా ఇస్తున్నాను. ఇలా చాలా విషయాలలో నేను వారిని అనుకరిస్తూ ఉన్నాను. వారు చనిపోయే వరకు వారి దగ్గరకు ఎక్కువగా వెళ్లేవాడిని వారి ప్రక్కన కూర్చుని చాలా విషయాలు మాట్లాడుకునే వారము. అలా వారి దగ్గర నాకు చాలా చనువు ఏర్పడింది. ఇలా చాలా విషయాలు రాద్దామని అనుకున్నా. స్థలా భావము వలన ముగిస్తూ వారికి నివాళులు అర్పిస్తున్నాను.



# ఆత్మీయ బంధువు

మదమంచి అర్జునాదేవి, విశ్రాంత అధ్యాపకురాలు

మా నాన్నగారు మదమంచి శ్రీమన్నారాయణ గారు. ఆయన బిడ్డలుగా మాకు ఇద్దరు. మహామహులతో సన్నిహితంగా మెల్లిగా అదృష్టం కలిగింది. ఒకరు డా. ఎక్కిరాల కృష్ణమాచార్యులు గారు, మరొకరు డా. కాసరినేని సదాశివరావు గారు. వీరి గురించి ఎంత చెప్పినా చెప్పవలసినది ఉ ంటూనే ఉంటుంది. డాక్టర్ గారు ప్రజాహిత సేవకు నిలువెత్తు దర్పణం, స్వయంకృషితో సాధించుకున్న వ్యక్తిత్వం మెరుగైని చిరునవ్వుతో ఆయన పలకరిస్తే అందులో ఆత్మీయ బంధం పెనవేసుకుంటుంది. ఆయన మంచితనం మంచి గంధమై పరిమళిస్తుంది. మా నాన్నగారికి డాక్టర్ గారికి గల సన్నిహిత సంబంధం అనేక సంవత్సరాలుగా వర్ధిల్లింది. ఆఫీసు నుండి రాగానే డాక్టర్ గారి దగ్గరికి వెళ్లి, రాత్రి పొద్దుపోయాక వచ్చేవారు. చాలామంది ఆయనను సదాశివరావు గారి శ్రీమన్నారాయణ అని పిలిచేవారు. మాకు ఊహ తెలిసినప్పటి నుండి నాన్నగారు డాక్టర్ గారి గురించి డాక్టరమ్మ గారి గురించి ఎన్నో విషయాలు ఎంతో గొప్పగా చెప్పేవారు. అందుకే వారి పట్ల మాకు చిన్న వయసు నుండి గౌరవం, భయం, భక్తి, ఆరాధన ఏర్పడ్డాయి. మా ఇంట్లో ఎలాగో వారి వద్ద కూడా అలాగే అందుకే వారి కుటుంబంలో వారిగానే భావించుకోగలిగాము వారు మాకు మార్గదర్శకులు, ఆరాధన మూర్తులు, డాక్టర్ గారి ఇంటి మేడ మీద సాహితీ సమావేశాలు జరిగేవి. నేను విద్యార్థి దశలోనే నాన్న గారితో పాటు ఆ సమావేశాలకు హాజరవ్వటం వల్ల డాక్టర్ సంజీవదేవ్, దివాకర్ల వారు, విశ్వనాథ వారు, అమరేంద్ర గారు, బాలబంధు గారు, కరుణశ్రీ గారు, వంటి ఉద్దండుల ప్రసంగాలు వినే అదృష్టం కలిగింది. సాహిత్యం పట్ల అభిలాష పెరిగింది. ఆ సమావేశాలకు వచ్చిన అతిథులను ఆదరించటంలో డాక్టర్ గారు ఎంతో శ్రద్ధ వహించేవారు.

నాకు మా తమ్ముళ్లకు విద్య ఉద్యోగం వివాహాది విషయాలలో డాక్టర్ గారు, డాక్టరుమ్మగారు మా తల్లిదండ్రులతో పాటు ఎంతో శ్రద్ధ వహించి, జీవితంలో స్థిరపడటానికి ఆలంబన అయ్యారు. మా పెద్ద పాప పుట్టినప్పుడు ఇంజక్షన్ రియాక్షన్ వల్ల ప్రాణాపాయస్థితిలో ఉన్న నన్ను ఎన్నో గంటలు శ్రమించి, కాపాడి, పునర్జన్మ నిచ్చిన మరో తండ్రి డాక్టర్ గారు పదో తరగతిలో మా పాప శ్రీ కళ్యాణి వ్రాసిన కవితా సంపుటి "తొలి పొద్దు" డాక్టరు తాతగారికి, డాక్టరమ్మ గారికి అంకితమిచ్చింది. వారు దయతో స్వీకరించి ఆశీర్వదించి ప్రోత్సహించారు. నా భర్త డా శాఖమూరి శివరాం బాబు గారు రచించిన "వేదము– పరమాణు– విజ్ఞానము" పుస్తకావిష్కరణ సభకు డాక్టర్ గారే అధ్యక్షులు. శివరాం బాబు గారు డాక్టర్ జయప్రదాంబ డిగ్రీ కళాశాలకు ప్రిన్సిపాల్ రెండేళ్లు సేవలందించారు.

మా మనసుల్లో అజరామరంగా నిలిచిపోయే మరపురాని మరువలేని మహామనిషి! మహనీయ మూర్తి! మానవతా స్ఫూర్తి మీకు శతకోటి వందనాలు.

## మనం డాక్టర్ గారిని ఎందుకు స్మరించుకోవాలి?

పిన్నమనేని చౌడేశ్వరరావు

మన డాక్టర్ గారు తన ఆత్మకథ "సదాశివమ్" లో
ఒరులేయవి యొనరించిన
నరవర, యప్రియము తన మనంబున కగు, దా
వారులకు నవి సేయకునికి
పరాయణము ధర్మ పథములకెల్లన్

అనే పద్యంలోని ధర్మ సూక్తిని ఉత్తమోత్తమ ధర్మమని నమ్మి తను జీవితాంతం అనుసరించిన మహా తత్వకుడు నేను "తాత్వికుడు" అని ఎందుకు అన్నానంటే మనం ఎలా ఎదుటివారు పరుష పదజాలంతో కూడిన ద్వేషభావం మనపట్ల వ్యక్తికరించకుండా ఉండాలని, స్నేహభావంతో ఉండాలని కోరుకుంటామో మనం వారిపట్ల అలానే ఉంటే మానవ సమాజమే కాదు, విశ్వమంత శాంతి సంతోషాలతో ఉంటుందని నమ్మి, దానినే ఆచరించిన మహనీయుడు మన డాక్టర్ గారు. అందుకే ఆయన ఆచరించిన ధర్మాన్ని కొంతవరకైనా మనము ఆచరించటమే ఆయనకు మన మిచ్చే ఘనమైన నివాళి.

మన డాక్టరు గారు పైన చెప్పిన ధర్మాన్ని 100% ఆచరించారని నేను నమ్మడానికి నా స్వీయానుభవాన్ని తెలియజేస్తున్నాను. కానీ, మా బంధువు అని చెప్పు కొనడానికి కాదు. అన్యథా భావించవలదని కోరుచున్నాను. మా నాన్నగారు పిన్నమనేని పిచ్చయ్య గారికి, డాక్టర్ గారి నాయనమ్మ (మహాలక్ష్మమ్మ) మేనత్త డాక్టర్ గారి అమ్మగారు సౌభాగ్యం అక్క (అప్ప) మా నాన్నగారు ఎప్పుడూ "మన డాక్టర్ గారు అపర ధన్వంతరి, మనుషుల్లో దేవుడు, మానవతామూర్తి, ఎదుటివారి కష్టాలు తీర్చే కల్పతరువు" అంటూ పొగుడుకొనేవారు. నేను కొంచెం హేతువాదిని, వారి మేనల్లుడు గనుక పొగుడుకుంటున్నాడు. ఈ రోజుల్లో ఎవరైనా అలా ఉంటారా అనుకునేవాడిని, అలాంటి సమయంలో ఒక రోజున మా నాన్నగారికి ఆయాసం ఎక్కువగా ఉంటే డాక్టర్ గారి వద్దకు పోదాంరమ్మంటే, మా నాన్న "పోదాం గాని మన పొలం పనికి వచ్చే పిసుకు ఆరోగ్యం బాగోలేదట రమ్మను, డాక్టర్ గారికి చూపిద్దాము అన్నారు. మేము ముగ్గురం డాక్టర్ గారి వద్దకు పోతే ఇద్దర్ని చూసి, మందులు వ్రాసి ఏసుకు మెడికల్ రిప్రజెంటివ్స్ ఇచ్చే శాంపిల్స్ ఇచ్చి బలహీనంగా ఉన్నావు కాస్త కాయలు అవి తినమని డాక్టర్ గారు చెప్పారు. మా నాన్నగారికి సాహిత్య అభిలాష ఎక్కువ అందువలన ప్రాస కోసం

"డాక్టర్ గారూ అన్నరసమే కష్టం ఇంకా పళ్ళరసం ఏమి తీసుకుంటాడు" అని అన్నారు. వెంటనే డాక్టర్ గారు జేబులో ఉన్న నగదు కొంత మొత్తాన్ని ఆ రోగి ఏసుకు ఇచ్చారు. ఆ సంఘటనతో దేవుళ్ళకు కూడా నమస్కరించని నేను ఆయనలోని దేవుడికి రెండు చేతులు ఎత్తి నమస్కరించాను. ఏసు బంధువు

అనో, తన కులమనో భాగ్యవంతుడనో అధికారం ఉందనో సహాయం చేయలేదు. కష్టంలోని వారికి సహాయం చేయాలని నగదు ఇచ్చారు.

ఈ సంఘటనను నేను ఎందుకు గుర్తు చేస్తున్నానంటే, ఎదుటి వారికి సహాయపడి, వారి బాధలను తొలగించి దానిలోనే ఆనందాన్ని పొందే మన డాక్టర్ గారి లాంటి వారిని సన్మానించుకుంటే మనలోనూ సమాజంలోనూ కొంతైనా మానవత్వం కలుగుతుందని చిన్న ఆశ.

ఎలాగైనా సరే ధనము, పదవులు సంపాదించిన వారిని పొగుడుతూ గౌరవిస్తూ వారి స్మృత్యర్థం పేర్లు పెట్టి విగ్రహాలు వేస్తున్నాం సమాజ హితం కోసము నిస్వార్థంగా సేవ చేసిన వారిని మరచిపోతే అందరూ స్వార్థపరులవుతారు. అది మానవ సమాజానికి మంచిది కాదు. అందుకే అజాతశత్రువు, నిస్వార్థ సేవా తత్పరుడు, మానవ హితాభిలాషి అయిన మన డాక్టర్ గారి శతజయంతి వేడుకలను ఘనంగా నిర్వహించటం మహనీయతను గౌరవించుకోవడమే.

డాక్టర్ గారు అధ్యక్షులుగా, కార్యదర్శిగా, సభ్యుడిగా ప్రారంభించిన అనేక విద్యాసంస్థలు వసతి గృహాలు మొదలైన వాటికి ఆయన కార్యదక్షత ఆయన పట్ల గల గౌరవంతో ఎందరో ప్రముఖులు వాటి అభివృద్ధికి ఆర్థికంగానూ అన్ని విధాల సహకరించారు. నేడు ఆ సంస్థలు మహోన్నత స్థానంలో ఉండటానికి మొదటిలో డాక్టర్ గారు అందరినీ కలుపుకుపోయిన విధానం ఆయన కార్యదక్షతే కారణం. మన డాక్టర్ గారు ధనం సంపాదించలేదు. కావున భూరివిరాళాలు ఇవ్వకపోయినా సమున్నతి విలువలు గల సంస్థలు అభివృద్ధి చెందటానికి కారణమయ్యారు. అందువలన ప్రస్తుతం ఆయా సంస్థల పాలకవర్గాలు కూడా ఈ శత జయంతి ఉత్సవాలు సందర్భంగా డాక్టర్ గారిని స్మరించుకోనేలా ఆ సంస్థలలోని కొన్ని భవనాలకు ఆ మహనీయుని పేరు పెట్టి గౌరవించుకుంటే భావి తరాలకు మంచి సందేశం ఇచ్చిన వారవుతారని వినమ్రతతో విజ్ఞప్తి చేస్తున్నాను.

ధర్మో రక్షతి రక్షితం

మంచిని మనం రక్షిస్తే అదే సమాజాన్ని రక్షిస్తుంది అని నమ్ముతున్నాను.



## పెదకూరపాడులో డాక్టరు గారు

నాదెళ్ల అప్పారావు, పెదకూరపాడు

1984లో గుంటూరు పార్లమెంటరీ నియోజకవర్గము నుండి లోక్ సభకు తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా డా కాసరనేని సదాశివరావు గారిని పోటీచేయమని నాటి ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారక రామారావు గారు కోరియున్నారు. అప్పుడే లోక్ దళ్ పార్టీ నుండి తెలుగమ దేశం పార్టీలో చేరిన తాను టిక్కెట్టు కొరకే పార్టీ మార్చానని ప్రచారానికి తావివ్వకూడదనే అభిప్రాయంతో పోటీ చేయలేనని చెప్పడం జరిగింది. నాటి పరిస్థితులలో రాజకీయాలకు కొత్తవాడైన అభ్యర్థిని నిలపటం వలన కొద్ది తేడాతో ఓడిపోవడం జరిగింది.

డా సదాశివరావు గారిని ఎంపిక చేసియున్నట్లయితే అప్పటికే గుంటూరు పార్లమెంటరీ నియోజకవర్గ పరిధిలోని ఏడు అసెంబ్లీ నియోజక వర్గాలలో జనతా, లోకిదల్ కేడర్లతో చక్కటి సంబంధాలు కలిగియున్నవారు కావున తప్పక గెలిచియుండేవారనేది నా నిశ్చిత అభిప్రాయం.

1985లో డా. సదాశివరావుగారు పెదకూరపాడు అసెంబ్లీ సీటు కోరియుండలేదు. శ్రీ యన్.టి.ఆర్. తనకు తానుగా డాక్టరు గారిని పోటీచేయండి. అని కోరియున్నారు. 1984లో పోటీకి దూరంగా ఉన్న తాను, ఇప్పుడు కూడా దూరంగా ఉంటానని చెపే శ్రీర్. తనను ఏవిధంగా అనుట అని బాధ ఒకవైపు, పార్టీని నమ్ముకొని టిక్కెట్టు అరిస్తున్న అర్హులైన స్థానికులకు అద్దం గలకు భావ్యంకాదనే భావన మరోవైపు, సంకట స్థితిలో ఉన్న డాక్టరుగారు తనకు తాను పోటీ చేయనని యన్.టి.ఆర్.తో డైరెక్టుగా చెప్పలేక, నాటి ప్రధాన కార్యదర్శి శ్రీ ఉపేంద్రతో చెప్పగలనని యున్నారు. స్థానికుల సమస్యను గుర్తించిన శ్రీ యన్.టి.ఆర్. వారి సంగతి మినేషన్ వెయ్యండని బి ఫారమిచ్చి పంపడం జరిగింది. ప్రచార మీరు నామినేషన్ వచ్చిన సదర్భంగా పెదకూరపా నాటి ముఖ్యమంత్రి శ్రీ యన్.టి.ఆర్. డాక్టరు గారి

సేవలను ఈ నియోజక వర్గానికే రాసు ఈ జిల్లాకే కాదు, ఈ రాష్ట్రానికే వినియోగించు కోదలచాను అని బహిరంగ సభలో చెప్పారు. పెదకూరపాడు ప్రతినిధి చరిత్రలో మొదటి సారిగా మంత్రి అయ్యే అవకాశం రాబోతుందని ప్రేమ ఎంతో సంతోషించాము. కానీ పెదకూరపాడుకి ఆ అదృష్టం కలుగలేదు.

1985 శాసనసభ ఎన్నికలలో పెదకూరపాడు నియోజకవర్గ ప్రతినిధిగా డా. సదాశివరావు గారి ఎన్నుకోబడడం ఎంతో ముదావహం. అడవులు, వాగులుతో నిండియున్న వెనుకబడిన ప్రాంతం పెదకూరపాడు నియోజకవర్గం. నాగార్జునసాగర్ నీటి పరీవాహక ప్రదేశమైయున్ననూ, ఎక్కవ వాగట కాల్వల చివరి భూములైనందున, పొలాలకు నీరందక రైతులు ఇబ్బంది పడుతున్న దశలో వృత్తిరీత్యా వైద్యుడైనా, ఆచార్యరంగా చరణ్సింగ్ లాంటి గొప్ప నాయకుల విధానాలకు ఆకర్షితుడైన దా సదాశుని. గారు ప్రధానంగా నియోజక వర్గంలో వ్యవసాయ ఉత్పత్తులు పెంచడానికి ఇరిగేషన్ అభివృద్ధికి మార్కెటింగ్ సౌకర్యాలు పెంచడానికి రహదారుల అభివృద్ధికి కంకణం కట్టుకున్నారు. అని ప్రాజెక్టుల పూర్తి చేసారు.

**ఇరిగేషన్ రంగం:**

కృష్ణానదిపై అంబడిపూడి వద్ద 32 లక్షల ఖర్చుతో 1323 యకరాలకు నీరందించే ఎత్తిపోతల పథకం, లింగంగుంట్ల వద్ద 33 లక్షల ఖర్చుతో 1300 ఎకరాలకు నీరందించే జగడాల వాగు పై రెండు నీటి మళ్ళింపు పథకాలు ఎద్దువాగుపై 26 లక్షల ఖర్చుతో అందుకూరు పరిసర ప్రాంతాలకు చెందిన 1800 ఎకరాలకు నీరందించే ఎద్దు వాగుకు ఎత్తిపోతల పథకం, మునగోడు సబ్ మైసర్కా నీటిని మళ్ళించే 8 లక్షల ఖర్చుతో 890 ఎకరాలకు నీరు అందించి పెదకూరపాడు నివర్త భూములను సస్యశ్యామలం చేసారు.



## ఆదర్శ పురుషుడు డాక్టర్ కాసరనేని సదాశివరావు

కిలారి రాజన్ బాబు
పూర్వ ఛైర్మన్ సంగం డైరీ.

డాక్టర్ కాసరనేని సదాశివరావు గారి శతజయంతి ఉత్సవాలు సందర్భంగా వారితో నేను పంచుకున్న కొన్ని సంఘటనలు. డాక్టర్ గారితో నాకు పరిచయం 1968వ సంవత్సరంలో J.K.C కాలేజీ ప్రారంభించిన మొదటి సంవత్సరము నుండి కలదు. నేను J.K.C కళాశాలలో చేరటం జరిగినది నాకు సదాశివరావు గారు అప్పట్నుండి తెలుసు గాని నేను సదాశివరావు గారికి తెలియటము ముఖ్యముగా 1985 వ సంవత్సరంలో పెదకూరపాడు నియోజకవర్గంలో MLAగా పోటీ చేసినప్పటి నుండి అప్పటినుండి వారితో నాకు ఎక్కువ సమయం గడిపే అవకాశం కలిగినది. 1985లో వారు MLA గా ఎన్నిక కావడం జరిగినది వారు నియోజకవర్గంలో పరిపాలన విభాగముతో ముఖ్యముగా పోలీస్ రెవిన్యూ శాఖలలో రాజకీయ జోక్యం లేకుండా ప్రజలందరూ మంచి జరిగేటట్లు చూసినారు.

MLA గా ఆయన చేసిన పనులు అనేకము ఉన్నప్పటికీ పుట్లగూడెం ఎత్తిపోతల పథకం ఆ రోజుల్లో ఒక కోటి రూపాయల వ్యయము గల పథకము అన్నగారు స్కీము క్రింద పొలం మొత్తము కోటి రూపాయలు చేయదుగా అనగా డాక్టర్ గారు సదికి అవతల వైపు స్కీములు నుండి అభివృద్ధి చెందినది. ఇటు ప్రక్క గోడ అభివృద్ధి చెందితే విలువ పెరుగుతుందని అన్నగారిని ఒప్పించి, sanc tion చేయించిన ఘనత డాక్టర్ గారిది.

సత్తెనపల్లి నుండి బయ్యవరం రోడ్డు వయా అబ్బూరు ఫణిదం బట్లూరు గారపాడు హుస్సేన్ నగరము మట్టి రోడ్డు కూడా లేని ఈ రహదారిని ఇంజనీరు రాఘవన్ గారిని స్వయంగా తీసుకువచ్చి చూపించి sanction చేయించినారు.

రాష్ట్ర ప్రభుత్వం జిల్లాకు ఒక మండలాన్ని మోడల్ మండలం గా sanction చేసినది. అచ్చంపేట మండలాన్ని ఎంపిక చేయించిన ఘనత డాక్టర్ సదాశివరావు గారికే దక్కుతుంది. దీనిలో భాగంగా రెసిడెన్షియల్ స్కూల్స్ కూడా sanction అయినది.

అలాగే వేల్పూరు హై స్కూల్ విషయంలో కూడా చెరువు పోరంబోకు మంజూరు చేసే సందర్భముగా డాక్టర్ గారు అన్న గారిని ఒప్పించడం వల్లనే సాధ్యపడింది.

డాక్టర్ గారు 1985 నుండి 1989 వరకు MLAగా ఉన్న ఒక అబద్ధం జోలికి పోకుండా నీతి నిజాయితీలతో ప్రజాధికారిగా పనిచేయవచ్చునని నిరూపించిన ఘనత ఆయనకే దక్కుతుంది. డాక్టర్ గారి పేరు వలన MLA పదవికే గౌరవము వచ్చినది. 1988 సంవత్సరంలో వంగవీటి రంగా హత్యగావింపబడినప్పుడు గుంటూరులో హాస్పటల్ మీద గాని, ఇంటి మీద గాని, ఒక్క రాయి పడని ఘనత వారికే దక్కుతుంది.

MLA గా ఉండి ఎటువంటి సెక్యూరిటీ లేకపోయినా వారి ఆస్తికి ఎటువంటి నష్టము కలగా లేదంటే వారి గొప్ప తనానికి అదే నిదర్శనం.

వారు బహుముఖ ప్రజ్ఞ గలవారు. వారి దగ్గరకు వెళ్ళిన ప్రతిసారి ఒక కొత్త విషయము నేర్చుకొనుట జరిగినది. డాక్టర్ జయ ప్రదాంబ కాలేజీలో నేను కాలేజీ కమిటీలో ఒకరోజు సదాశివరావు గారు కాలేజీకి వచ్చినప్పుడు, పెదపాలెం గ్రామం నుండి తపతి ఆమె ఫిజిక్స్ లెక్చరర్ గా పనిచేయుచున్నది. నేను ఆమెను పరిచయం చేసినప్పుడు, ఆమె పేరు అనగానే, తపతి అంటే అర్ధము తెలుసా అని అడిగారు. ఆమె తెలిసింది తపతి అంటే నది పేరు గారే తూర్పుకు ప్రవహించే నదులని, పడమరకు ప్రవహించేవి నదములని తెలియజేశారు తపతి నదము అవుతుంది. కానీ నది కాదు అన్నారు. 1987లో ఆయన MLA గా ఉన్న సమయంది. మండలాధ్యక్ష పదవికి ప్రత్యక్ష ఎన్నికలు జరిగినవి. నియోజకవర్గంలోని ఐదు మండలాల్లోన అచ్చంపేట మండలాన్ని గ్రంధసిరిలో వచ్చిన ఓట్లు కారణంగానే. ఆ మహిళా అభ్యర్థిని విజయం, సాధించటంతో డాక్టర్ గారికి నా పట్ల అభిమానం పెరిగినది. డాక్టర్ గారికి విద్యా వైద్య రంగముల మీద ఎనలేని మక్కువ. ఆయన వైద్యునిగా కొత్త పుంతలు తొక్కారు. విద్యారంగ అభివృద్ధికి నాగార్జునన ఎడ్యుకేషన్ సొసైటీని కేంద్రంగా చేసుకున్నారు. డాక్టర్ గారి స్నేహానికి వయసుతో పనిలేదు మూర్తి తల తరాల వారితో (తాత, తండ్రి, కుమారుడు) కలివిడిగా మెలిగేవారు.

J.K.C కాలేజీలో ఆయన ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది. staff విషయంలో గానీ, స్టూడెంట్ అటెండెన్స్ విషయంలో గానీ గ్రామీణ ప్రాంతం వారిని, పట్టణ ప్రాంతాల వారి మార్కులతో కొలవడు అని చెప్పేవారు. గ్రామము పట్టణము నుండి వచ్చేవారు అంటే ఎక్కువ శ్రద్ధ చూపేవారు. Hosper నిర్వహణను ప్రజా వైద్యశాలని పేరు పెట్టి, ఆ పేరుకి అనుగుణము గానే నడపటము జరిగినది. రోగి డాక్టర్ గారు దగ్గరకు వచ్చినప్పుడు బాధతో వస్తాడు. డాక్టర్ గారు రోగిని పిదుస్తున్నాదనే ఆలోచన రానీయ

కూడదని, వారు విద్యాసంస్థల నిర్వహణలో మీ ఆధ్వర్యంలో పనిచేసే వాళ్ళ విజయానికి మూల కారణమేమి ఏమిటని ప్రెస్ వారు అడిగినప్పుడు నిర్వహణలో Management లో అతి తక్కువ జోక్యం కల్పించుకోవటమేనని ఆయన చెప్పేవారు.

పిల్లలందరు ఎటు వాళ్ళు అటు వెళ్లిపోవటంతో ప్రజా వైద్యశాలను అద్దెకిచ్చారు. ఒకరోజు నేను వెళ్లేటప్పటికీ హాస్పటల్ Rent రూ.40000/- పంపించినారు. వారు అప్పుడు ఇలా అన్నారు. మా ఇంటిలోని వారందరూ పనిచేసినప్పుడు ఎప్పుడూ కూడా నెలకి రూ.40,000/- మిగలలేదు. ఇప్పుడ మేము ఎక్కడ ఎవరము పని చేయకుండా రూ.40,000/- వస్తున్నవని పకపక నవ్వారు.

నాకు రాజకీయ జీవితంలో ఇటువంటి ఉన్నత వ్యక్తి పరిచయం లభించడం నా అదృష్టం, వారిని ఆదర్శంగా తీసుకొని నేను కృషి చేయటము కొన్ని సందర్భాలలో నేను చేసే పనులు ఆయన్ని అనుకరిస్తున్నట్లుగా ఉన్న కారణంగా నాపై డాక్టర్ గారి ముద్ర స్పష్టంగా ఉందంటారు. ఈ జీవితానికి ఇది చాలు.



